# సంజీవి

రెండవ భాగము

మొసలికంటి సంజీవరావు



సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

నిజామురాష్ట్రమందుండు ఆంధ్రసోదరుల సౌకర్యార్థమై దక్షిణ హైద్రాబాదు నెం 544/566 రు గృహమందు నామపల్లి గౌరీశంకరవర్మ అండుకో, ఆంధ్ర బుక్కుడిపోవారిని మా ప్రతినిధులుగా ఏర్పఱచినాము. కావున నిజామురాష్ట్రవాసులు కావలసిన పుస్తకములను వారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ప్రకాశకుఁడు.

# ౧౪

ఆంగ్లనృపాలుని దౌవారికులు రాణిని వారించిరి. వా రామెయెడఁ జూపవలసిన గౌరవము యథావిధమునఁ జూపియేయుండిరి. కాని, యామెను లోనికిఁ బోనిచ్చుటకు మాత్ర మనుజ్ఞ లేదని వారు స్పష్టముగఁ దెలియఁబఱచిరి. శిబిరాంతరమున నున్న రిచర్డు గూడ నాకాంతారత్నములను నిరోధింపవలయునని సహజకఠినస్వరమున నాజ్ఞాపించుచుండెను.

తాను జేయఁగల ప్రయత్నమంతటితో సరిపోయినట్లు నిట్టూర్పు విడిచి, యాంగ్లరాణి రాజసోదరితోడ నిట్టులనెను.—"మేరీ! నాకుఁ దెలియును—నృపాలుఁడు దర్శనమీయఁడు."

ఆంగ్లభూపాలుఁ డాసమయమున నెవ్వరితోడనో యిట్టులనుచుండెను.—"ఓరీ! థామ్సు! నీపని శీఘ్రముగఁ గావలయు—నదియే నీవు చూపఁగల దయ. ఒక్కవ్రేటుతోఁ దీఱిపోవునేని, నీకుఁ బది సువర్ణములు బహుమానము. ధీరాత్ములు మరణమున కెటు లాయిత పడుదురో యెఱుఁగవలయును. ఓరీ, దుష్టా! ఆయవసరమున వాని చెక్కు తెల్లవాఱునేమొ, వదన మణుమాత్రమైనఁ జలించునేమొ కనిపట్టుము."

"నేను పైకెత్తిన కత్తి జూచి భయపడని వాఁడు లేఁడు—" అట్లు బదులాడువాని స్వరము కఠోరముగ, దుస్సహముగనుండెను. రాజ సమక్షముననుండుటచేత వాఁ డింకను జాల యణఁచికొని మాటాడినటులుండెను.

మేరీ యిఁక భరింపఁజాలక రాణితోడ నిట్టులనెను.—"దేవీ! నీ వీ మందిరము బ్రవేశింపఁజాలవేని, నిన్ను నేఁ బ్రవేశపెట్టుదును.

నేనై సఁ జొత్తును. పణిహారులారా! రాణి రాజునుఁ గాంచవలయు— భార్య భర్తృ దర్శనార్థినియై యరుదెంచినది."

తోడనే యచటి యధికారి తన యధికారదండము వంచి యిట్టు లనెను.—"దేవీ! వలదనుట కడు విచారకరము. నృపాలుఁడు మహాత్తర జీవన్మరణ విషయాలోచనా నిమగ్నుఁడై యున్నవాఁడు."

"మాయవసరము గూడ నట్టిదె. దేవీ! నేను దారి చేయుదును, రమ్ము—" అని పలుకుచుఁ దన కోమల కరంబున నాద్వారపాలకు నల్లనఁ ద్రోసి, రాజసోదరి తన రెండవకరమున నచటి తెరఁబట్టెను. సుందరాంగియగు రాజసోదరి యటు లాచరించునప్పుఁడు దౌవారికుఁ డేమి చేయఁగలఁడు? ఆంగ్లరాజ్ఞి యిఁక రాజ సమక్షమునకుఁ బోవల సినదాయెను.

రిచర్డు శయ్యనుండెను. అనతిదూరమున నొకఁడు వేచియుండెను. రాజాజ్ఞ పూర్తిగ నాలించుటకు వాఁడు నిరీక్షించుచుండి నటు లుండెను. వానిఁ గాంచునంతనే వాని యుద్యోగము తెలియఁగలదు. వాని వస్త్రధారణము వానికిఁ దగినటులేయుండెను. భుజములు కొంచెము దిగి మిగిలిన భాగము నాచ్ఛాదింపని యెఱ్ఱని జుబ్బా; ఆజుబ్బామీఁద నొకతోలు కబ్బా, ఆకబ్బామీఁద నిటికరంగువంటి యెఱ్ఱని మచ్చలు: ఆరెండును మోఁకాలు నంటియుండెను. మేజోళ్ల వలెఁ గాళ్లను గప్పియున్నవి కూడఁ దోలువే. వెలుఁగు జూడఁ జాలక దాగియుండు నులూకమువలె వాని ముఖము దట్టంపు బొచ్చు టోపియం దడఁగియుండెను. బిరుసెక్కి గజిగజిలాడుచు జీబుగఁ బెఱిగి జుట్టుతోఁ గూడఁ గలసిన యెఱ్ఱని గడ్డము చాటున వాని యధోవదనము గానరాకుండెను. ఆటోపీ గడ్డముల నడుమ నవ్యక్తముగఁ గాన్పించు ముఖము కఱకుగ, దుష్టముగ, దుస్సహముగనుం డెను. ఎద్దుమెడవంటి మెడయును, అతివిశాలములగు భుజస్కంధము

లును, పొడవునకుఁ దగని యట్టి దీర్ఘ భుజములును, చదరముగనున్న పెద్దశరీరమును, బలిష్ఠములగు దొడ్డి కాళ్లునుగల యాహ్రస్వాంగుఁ డొక దీర్ఘఖడ్గము నానికొని యుండెను. ఆకత్తియలుఁగు నాలుగున్నర యడుగులును, అందులకుఁ దగినట్లు పిడి యెనిమిదియంగుళములును బొడువుండెను. భారము సరిపోవుటకు నాపిడిచుట్టును సీసపుగుండ్లమరి యుండెను. ఆరడుగులు మించిన యాఖడ్గము వాని శిరమును గూడ మించియుండెను.

శస్త్ర్యాగారికుఁడై, యావింతమానిసితో భాషించు నాంగ్లరాజవదనము ద్వారమువంక నేయుండెను. తన రాణి యాకస్మికముగఁ బ్రవేశించుట సహింపనివానివలె నాతఁడు నడిగా వెనుదిరిగి, తన పాన్పుపై దుప్పటులవలెఁ బఱచియున్న మృదుల సింహచర్మములు లాగికొని, నిజ నాచ్ఛాదితావయవములు గప్పికొనఁ గడఁగెను.

రాజట్లు విముఖుఁడాయెను. కాని, కాంతలు తమ కాంతులను బ్రసన్నుల నొనరించుకొని కార్యసాఫల్యముగాంచు నేర్పరులుగదా. నృపాలునిచెంత మూర్తీభవించిన ధార్ష్ట్యమువలె నిలిచియున్న యాఘోరాకారునిఁగాంచి భయకంపితయయ్యు, నామోహనాంగి రిచర్డును రయమ్మునఁ డాసి, మోఁకరించి, నిజకోమల భుజంబులు మనోహరముగ సువ్యక్తముగఁ దోఁప, సుందర సువర్ణ చికురనికరాంతర సుందరాననము మేఘనిర్ముక్తమాన భానుబింబ శోభాసమన్వితమై విరాజిల్ల, నన్యదేశ భయంకరంబును క్రైస్తవాన్వయమునకుఁ బట్టుఁగొమ్మయునగు నాభూనాథుని భూరిభుజంబును దన కోమల కరద్వయంబున నల్లనఁబట్టి వినమితయై ముద్దాడెను.

తత్కాంతాకరబంధిత భుజంబట్టులేయుండ, దిప్పిన వదనము గూడ నట్టులేయుండ, నాంగ్లనృపాలుఁడటు వీక్షింపకయే యిట్లు ప్రశ్నించెను. "బెరంజేరియా! ఏమిది?"

'బెరంజేరియా' నామధేయయగు రాణి కాతరావ్యక్తస్వరమున నిట్టులనెను. "గుండాగునను నంపివేయుము. వాని చూపు ప్రాణాంతకముగనున్నది." నృపాలుఁడు తత్క్షణ మిట్టు లాజ్ఞాపించెను.

"ఓరీ! హామ్మ్రా! ఇఁక నీకేమి కావలయును? నీ వీ కాంతలనుఁ గాంచఁ దగుదువా? హామ్మ్రా!"

"రాజా! బుజ్జి యేమి చేయవలయునో—"

"దౌర్భాగ్యుఁడా! హామ్మ్రా. క్రైస్తవాచారము చొప్పున భూస్థాపనము."

నృపాలుఁ డట్లు లన, విరళవస్త్రధారిణియై, సహజసౌందర్యముతో నలరారు రాణియోయగము మెచ్చుకొనువానివలె నొక మందహాసము బఱపి యాదుష్టుఁడు వెడలెను. ఆ ఘోరాకారుని క్రూరవీక్షణముకంటె వానిహాసము మఱియు దుస్సహముగ నుండెను.

నృపాలుఁడప్పుఁ డర్ధనగ్నయై వ్రాలియున్న తనరాణివంక నర్ధాంగీకారముగ నల్లనఁ దిరిగి యామె సదుచితముగఁ బ్రశంసించెను.

యోధాగ్రేసరుఁడగు రిచర్డు సౌందర్యము గణింపఁడు, గణించి కరుగ నేరని మందజ్ఞుఁడు కాఁడు. బెరంజేరియావంటి మోహనాంగి వదనము గాంచి, తత్కాంతా కోమలకరాధరస్పర్శన మనుభవించి, తత్కోమలీ నయననిర్గత బాష్పవారిఁ గాంచిన యనంతర మాభూపాలున కింక స్థైర్యమెక్కడ? రిచర్డు ప్రసన్నహృదయుఁడై, యామేల్బంతి సువర్ణ కేశజాలము నిమురుచు, నాదివ్యవదనమెత్తి సాభిమానముగా ముద్దాడెను. మహాసత్వసంపన్నుఁడగు నృపాలుఁడు తనయెదుటఁ గృపణయై యున్న లతాంగి నావగిది బుజ్జగించుదృశ్యము సిక్కముగ దర్శనీయము—"మదీయహృదయరాజ్ఞి తనసోదరుని మందిరమున కీ యవేళ రానేల?"

ఆంగ్లనృపాలుఁ డట్లు ప్రశ్నించినంతనే, రాణి విగతస్థైర్యయై యసం

బద్ధముగ నిట్టుల నెను. "నృపాలా! క్షమింపవలయు—"

"క్షమింపవలయునా! ఎందులకు?"

"అతిసాహసంబున రాజసన్నిధి కగుదెంచినందులకు—" రాణి యింక బలుకనేరకపోయెను. ఆంగ్లనృపాలుఁడు తనవసరోచితావేగమున నిట్టుల నెను:

"అతిసాహసమా! తనకిరణము లొక యల్పునింటఁ బ్రవేశించినందులకు భాస్వంతుఁడు వినమ్రుఁడై యూఁత్కుఁగొని క్షమింపుమనునే? దేవీ! నీవంటికోమలికి దుస్సహమగు శాగ్రమున నిమగ్నుఁడనై యుంటిని. మఱియు, రోగసంకీర్ణమగు నీప్రదేశము నీకు విహారయోగ్యము కాదు."

రాణి యింకను గననందేశము దెల్పుటకు భయపడుచు నిట్టుల నెను.—"కాని,నీవిపు డారోగ్యవంతుఁడ వైతివిగదా?"

"ఆంగ్లరాజ్ఞి క్రైస్తవ భువనైకసుందరి యని యంగీకరింపని సాహసవంతుని దునుమాడఁజాలు బలారోగ్యములు గాంచితిని."

రాజట్లు సగర్వముగఁ బలుకఁ రాణి యిట్లునెను.—"రాజా! ఇఁక నాకొకవరము బ్రసాదింతువని విశ్వసింతును. విశేషముగాదు—ఒక యల్పుని ప్రాణము—"

"హా! కానిమ్ము"—రిచర్డు మోముచిట్లించెను. రాణి యిట్లు గొణిగెను.

"భాగ్యహీనుఁడగు స్కాటుసూరుఁడు.—"

"దేవీ! వాని విషయము మాటాడరాదు. వాఁడు చావవలయు—తప్పదు."

ఆంగ్లనృపాలుఁడు కఠినస్వరమున నట్లుపలుక రాణి మగుడ నిట్టుల నెను:

"రాజోత్తమా! హృదయేశ్వరా! ఒక పట్టుకేతనము గదా

పోయెను. నీరాణి మఱియొకటి స్వయముగాఁ దయారుచేసి నీకీయఁ గలదు. మదధీనములగు ముత్యములన్నియు నందుఁ బొదివి, కృతజ్ఞతాపూర్వక బాష్ప జలార్ద్రనయనన్నై మదీయ శూరాగ్రణికి సమర్పింతును.”

నృపాలుఁడు సక్రోధముగ నిట్టులనెను.—

“నీ వేమంటివో యెఱుంగవు. ముత్యములా! ఈప్రాచ్యలోకాంతర ముత్యములన్నియుఁ నాంగ్లకళంకము బోఁగొట్టునే? దేవీ! పొమ్ము! స్థలసమయాదు లరసి నీవు చరింపవలయు. నేనిపు డాచరింపవలసిన ధర్మము విస్పష్టము. నీకిందుఁ దావు లేదు.”

రాజసోదరీశ్రవణమున రాణి యిట్టులనెను.—“మేరీ! వింటివిగదా మన మేమనినను నాతని యాగ్రహ మధికమగును. మనయునికి నిరర్థకము.”

ఆంగ్ల రాణి కావిషయమంత లాఘవముగనుండెను. విపరీతవిషాద ఘూర్ణమానమానసయగు రాజసోదరి యిట్టు లుపేక్షింపఁజాలక, యొకింత ముందునకరుదెంచి, నృపాలు నుద్దేశించి, యిట్టులనెను.

“భూపాలా! ఈనికృష్టబాంధవి కృపాభిక్ష యర్థించునది కాదు,— న్యాయార్థిని భూపాలురు సర్వకాల సర్వావస్థలయందును న్యాయార్థులగుఁ దత్ప్రదాన మొనరింపవలయు.”

“హా! సోదరీ! అటులనా!” రిచర్డు లేచి సమముగఁ గూర్చుండెను.—“రాజసోదరి తదుచితముగనే సదా భాషించును. నేనును దదనుగుణముగనే ప్రత్యుత్తరమిత్తును.—మనగౌరవము సంస్మరించి యర్థింతువుగాక.”

“దేవా! నీ విపుడు వధింపఁ గృతనిశ్చయుఁడవై యున్నవాఁడు సచ్ఛారుఁడు, తనకాలమునఁ గ్రైస్తవలోక సేవాపరాయణుఁడై యశోవంతుఁడాయెను. ఆతఁడు రాజాజ్ఞాబద్ధుఁడై యప్రమత్తుఁడై

తనధర్మమును నిర్వర్తించుచుండెను. కాని కేవల వినోదార్థ మవివేక ముగ నొరులు పన్నిన యురులందుఁ జిక్కి, యాతఁడు స్థానభ్రష్టుఁ డాయెను. ఆశూరుఁడు ధర్మచ్యుతుఁ డగుట కొక నామధేయము కారణమాయెను—ఏల సంకోచింపవలయును?—మదీయనామమే కారణమాయెను. సుప్రసిద్ధ వంశోద్భవనామాంకిత సందేశమాలించిన యనంతరము, ఏక్షత్రియశూరుఁడు తాదృశముగ ధర్మచ్యుతుఁడు గాకుండును?"

"సోదరీ! నీ వాతనిఁ గాంచితివి;" తన డెందమునఁ బొంగు నాగ్రహము నడంచికొనుటకు నృపాలుఁడు తనపెదవులు గఱచి కొనెను. మేరీ యిట్లు బదులాడెను.—

"రాజా! కాంచితిని. తత్కారణము విశదపఱచుట కిది సమయము కాదు.—స్వీయరక్షణమునకుఁ గాని పరదూషణమునకుఁ గాని నే నుద్యమింపను."

"ఎచటఁ గాంచితివి?"

"రాజ్ఞి శిబిరమునందు."

"మద్రాజ్ఞీ నిలయముననే! హా! అతిసాహసము! దుస్సహము! ఈశూరుఁడు తన యంతరము దలంపక ధూర్తుఁడై తన కసాధ్యమగు నుత్తమకన్యామణిం దలంచినను నే నుపేక్షించితి. సూర్యుఁడు భూమిని వికాసవంత మొనరించునట్లు మత్సోదరి తన యున్నతస్థానమునుండి చరింపవచ్చునని సహించి యూరకుంటిని. కాని, నిశీథమున మద్రాజ్ఞీ శిబిరమున వానిం గాంచుటయే గాక, వాని ద్రోహమున కిది యొక సమాధానముగ గూడఁ జెప్పుదువా! దుర్భరము! మేరీ! భవదసంబద్ధ ప్రవర్తనఫలితమనుభవింతువు—చిరకాలము సన్యాసినీమఠా వాస మనుభవింతువు సుమా!"

రాజసోదరి నిర్భయముగా నిట్లు బదులాడెను.—"రాజా!

క్రౌర్యము నీనిరంకుశాధికారమునకుఁ జెల్లును. మన పరస్పర గౌరవము లణుమాత్రము భంగపడలేదని యెఱుంగుము,— రాణియే యిందులకు సాక్షి; తన యిచ్ఛకువచ్చునేని రాణి నానుడులు ఋజువు చేయఁగలదు. కాని, యాత్మరక్షణము బరదూషణమును నొనరించు దానఁగానని ముందే తెలిపియుంటిఁగదా. అన్యజనవంచితుఁడై ధర్మచ్యుతుఁడైన శూరుని రక్షింపవలయునని మాత్ర మర్థించుదాన. రాజా! భవత్కృతాల్పతరదోషములకే నీవొకనాఁ డుత్తమోత్తమ న్యాయస్థానమునఁ గృపాభిక్ష యర్థింపవలయు—నట్టి కృప యీశూరు నెడఁ జూపవలయునని యర్థింతును."

"ఆహా! మద్వంశోద్భవ మేరీయేనా యిది? వివేకవతియగు సత్కులప్రసూతియా? లేక, తన విటునిపైఁ గల మక్కువచేతఁ దన గౌరవము విస్మరించు విరహిణియా? మేరీ! నీవల్లభుఁడు వధ్యుఁడు, మరాంతరమున నీగరియందు వానిశిరము శాశ్వతాలంకారముగఁ ప్రతిష్ఠింతును!"

నృపాలుఁ డట్లు భయంకరముగఁ బలుకఁ మేరీ విస్పష్టముగ నిట్టులనెను.—

"అటులొనరింతువేని—" తన మానసోద్రేక మడంచికొని, యిట్టులనెను—"శూరగుణ సంభావన మెఱుంగని నృపాలునిచే నక్రమముగఁ గ్రూరముగఁ దెగటారెనని యెంచి, యానుస్తక మొక పవిత్ర చిహ్నముగ సంస్మరింతును.—" ఆమె తత్క్షణ ప్రవర్ధమాన కోపావేశమున మగుడ నిట్టులనెను. "ఆతఁడు నిక్కముగ నాప్రియుఁడు, నిష్కల్మషుఁడు: ఆతఁడు ప్రణయంపుఁ బలుకుగాని తద్వీక్షణముగాని యపేక్షింపక, సవినయముగ సభక్తికముగ సాధుజన సందర్శన మొనరించువాని వలె మాత్రము జరించెను. విశ్వసనీయులగు సచ్ఛాపరు లిందులకు మరణింప వలయునా?"

రాణి భయకంపితయై యామెతో నిట్లు గుసగుసలాడెను.—"మేరీ! యూరకుండుము. నీవు వాకొనుకొలఁది నృపాలాగ్రహ ముజ్జ్వలమగును.

"కానిమ్ము, దోషరహితయగు కన్య క్రోధోద్విగ్న హావ్యతముం గాంచి భీతిల్లదు! గుణవంతుఁడగు శూరుని పితఁ డేమైన నొనరించుఁగాక. మత్కారణమున మరణించు శూరుని సుముదిత దుఃఖాక్రాంత చిత్తనై సంస్మరింపుచుఁ గాలహరణ మొనరింతును. రాజకీయముల కొఱకుఁ జిత్తనిరోధ మొనరించు దురవస్థ తీఱిపోయెను. అసంఖ్యమగు సంఘ దురాచార పాశము నేనా శూరుని వివాహమాడకుండ నిరోధించును. అట్లు వివాహ మాడఁజాలను, ఆడను. ఇఁకనో! తానృశ నిమ్నోన్నతములను మరణము నిర్మూలించి సర్వసమానత్వ మొడఁగూర్చును. ఇఁక నా సమాధి నే గట్టుకొందును."

తదవసర నిరాశావేశమున మేరీయట్లు పలుక నృపాలుఁడత్యంత క్రోధఘూర్ణితుఁడై బదులాడు నంతలో నొక సన్న్యాసి రయమున్నన బ్రవేశించి, యాతని మ్రోల మోఁకరించి, పవిత్ర భాషణంబులాడుచు శూరవధ మాపుచేయుమని పలువిధముల బ్రతిమాలెను. నృపాలుఁ డధికతరాగ్రహధురీణుఁడాయెను. "ప్రపంచ మొక్కటియై నన్ను నాస్మదు నొనరించుఁగాబోలు. మందులు, స్త్రీలు, సన్న్యాసు లొక్కొక్క రడుగడుగున నన్ను నిరోధింపఁ గడఁగుదురే! వాఁడింక నేఁ జీవించెను!"

"నృపాలా! నా ప్రార్థన మన్నించి లోకప్రభువు వధ నిలుపు చేసెను. నిన్నుఁ బ్రార్థించి—"

"ఆ మూర్ఖుఁడు సమ్మతించెనా? ఇట్టి మౌర్ఖ్యము వానికి సహజమాయెను. నీసందేశమేమి?"

"రాజా! స్కాచిశూరుఁడగు కణతుఁ * డాచారముచొప్పునఁ దన సమాచారమంతయు నాకెఱింగించెను. అంకదొక మహత్తర రహస్యము దెలిసికొంటిని. మృత్యుముఖమున నున్న మనుజుఁడెఱుకపఱచు రహస్యములు వెల్లడించుట సన్యాసులకుఁదగదు, కానఁ దద్విషయము నీకుఁ దెలుపఁజాలను. ఎన్నిప్రమాణము లొనరించియైనను ఆరహస్యము మహత్తరమైనదని మాత్రము చెప్పఁగలను. నీకా రహస్యము తెలియునేని, నీదారుణ సంకల్పము తత్క్షణము మఱలునని నిబ్బరముగఁ జెప్పెదను."

నృపాలుఁడిట్లు బదులాడెను.—

"సాధువర్యా! మదీయ మతాభిమానము సువ్యక్తము. తదభిమానమేగదా! నన్నీ నికృష్ట దూరదేశమునకుఁ దరలించినది. తద్భూరి రహస్య మాలింతునేని, తదనుగుణముగ నాచరింపఁగలను. అటుగాక, నీవు చెప్పనంతమాత్రముననే నిర్దిష్ట కార్యము వీడుటకు సంధుఁడనుగాను."

"నృపాలా! మత్కృత ఘోరాపరాధమునకై నిర్జనమనుభూమియం దావాసమేర్పఱచుకొని, శరీరపీడన మొనరించుకొనుచు నెంగాడీ గుహాలందు నిరువది సంవత్సరములు గడిపితిని. తాదృశపవిత్రజీవన మొనరించు నేను అనృతమాడుదునా? క్రైస్తవోద్ధరణ కార్యైక తత్పరుఁడను మృత్యుసన్నిహితశూరుని రహస్యము వెల్లడింతునా? రెండును బాపావహములు, అసహ్యకరములు, నాకు వర్జనీయములు."

అట్లు బదులాడు సన్యాసి యావేశపూరితుఁడాయెను. తదవసరమున నాతని యుత్తరీయము వీడ, శరీరమున కంటియుండిన మేషాజినమును, అందుండి నిరంతరాయమాన కఠినోపవాస కఠినప్రాయ

---

* మరణావసరమునఁ దనరహస్యములన్నియు నాచార్యునకుఁ జెప్పుట క్రైస్తవాచారము.

శ్చిత్తాది కర్మలకు సాక్షీభూతముగ నస్థిపంజరమాత్రమై మిగిలిన శరీరమును గాన్పించెను. రిచర్డు రా జిట్లులనెను.—

"జనులు విశేషముగఁ గొనియాడు ఎంగాడీస్వామివి నీవేనా?— మరుస్థలస్థభూత మనుకొంటిని—రిచర్డు భూతములు గాంచి భయపడువాఁడు కాఁడు. సర్వక్రైస్తవసేనాధ్యక్షుఁడనగు నేను రోగార్తుఁడనై పడియుండు నెడ నాతోడ నాలోచింపకయే క్రైస్తవరాజన్యులు నికృష్టసంధి యొనరింపఁ దత్తరపడి, సుల్తానుతోడ సంప్రతింపవలయునని నీకెంత కంపినది యీద్రోహినే గదా? మీరేమైన నొనరింతురు గాక, నీదూత మరణింపవలయు, వాని ప్రాణము కొఱకు నీవర్థింతువు గాన వాఁడు శీఘ్రతరముగఁ జావవలయు."

సన్యాసి యావేశమధికతరమాయెను.—

"నృపాలా! తీవ్రపడకుము. అనంతరము నీవెంతేని విలపింతువు. భూర్తుఁడవై, మూర్ఖుఁడవై, యంధుఁడవై యకృత్యమొనరింపకుము!"

నృపాలుఁడు సక్రోధముగ భూతాడన మొనరించి యిట్లు గర్జించెను.—"పొమ్ముఁ పొమ్ము! ఛీ! అస్మద్దేశ గౌరవమునకు వొడమిన మాలిన్యమునకుఁ బ్రతిక్రియ యింకను నొనరింపనైతినే. అబలలారా! సన్యాసీ! మీరవ్వలకుఁ బొండు: లేదేని—"

'వలదు'—నృపాలు నెవ్వరో యిట్లు వారించుటచే నాతఁడటుఁ జూడ, మహమ్మదీయ వైద్యుఁడు గోచరించెను. రాజిట్లులనెను.—

"హాకీమ్! దయచేయుము. మా దాతృత్వము శోధింతువు గాఁబోలు."

"నీతోడ మహత్తర విషయముల గుఱించి తత్క్షణము ప్రసంగింపవలయునని యరుదెంచితిని."

"ముందు, నాభార్యను గాంచుము. మత్ప్రాణదాతను మారాణి యెఱుంగుఁగాక."

నృపాలుఁ డట్లు తమ యాచారము చెప్పనఁ బలుక, మహాత్మ్ముఁ దీయుఁడు సవినయముగ సభక్తికముగఁ జేతులు కట్టుకొని నయనములు డించి, యిట్టులనెను.—“నృపాలా! మేలిముసుఁగు లేక సహజవైభవముతోడ దీపించు సుందరాంగిని సందర్శించుట మాకుఁ దగదు.”

“బెరంజేరియా! వెడలుము—మేరీ! నీవును బొమ్ము. వలదు!—మగుడ నర్థింపవలదు. మధ్యాహ్నమువఱకు వధ నిలుపుచేయుదును. పొమ్ము, శాంతచిత్తవు గమ్ము. బెరంజేరియా!—ప్రేయసీ! పొమ్ము. “మేరీ!” ధీరస్వాంతయగు నారాజసోదరి సహితము భయకంపితయగునట్లు నృపాలుఁ డొక పీత్కారము బలికెను.—“మేరీ! వివేకము గలిగి వెడలుము.”

డేగను గాంచిన కుక్కుటవ్రాతమువలె నాకాంతలు భయాతిరేకమున వడివడి నవ్వలకుఁ బాఱి, రాణి గుడారమునకుఁ బోయిరి. ఆమె దూషణవిలాపంబులందు నిమగ్నయాయెను. అయ్యది వృథాశ్రమ. ఐన నామె స్వభావమట్టిది. అట్టి బాహ్యవిచారము నేవగించు రాజసోదరి గంభీరచిత్తయై, తడవసరావేశమునఁ బలువిధములు తీవ్రముగ విలపించు రాణిని సాభిమానముగ నూఱడించెను. అంత నొక చెలికత్తె రెండవదానితోడ నిట్టులనెను.—

“చెలీ! ఈకాంత యాశూరుని ప్రేమించెనని యనుకొంటిమి. అట్టిది యసంబద్ధము. మనము భ్రమపడితిమి. తన కతమున నొక పురుషుఁ డకారణముగ మహాపదం బొరసెనే యని నిర్వ్యాజముగ నామె ఖేదపడెను.”

రెండవ చెలికత్తె యంతకంటె ప్రౌఢయగుటచేత నామె యిట్లు బదులాడెను.—

“భద్రము, సద్దుసేయకుము. గర్వితకులప్రసూతయగు నీకన్నియ

తనబాధ వ్యక్తముచేయదు. బాధకుఁ జిక్కి విచారించుట యీవంశ జులు హేయముగ గణింతురు. గాఢక్షతగాత్రులై మరణింప నున్నను గూడఁ దమ బాధ మఱచి తమ యనుచరుల యల్పపు గాయములు గట్టఁగల వారలని విని యుందుము. మన వినోదమెంత భయంకర ముగఁ బరిణమించెను! ఇయ్యది యసంభవమాయెనేనిఁ నాదు సర్వా భరణములును సమర్పించుకొనుదానను.”

## ౧౨

కాంతలతోడ సన్యాసి కూడఁ బోయెను. కాని, యాతఁడు ద్వార మున నిలిచి, గంభీరముగ హస్తము జాపి, విస్పష్టముగ నిట్లు లనెను.— “క్రైస్తవమతహితోపదేశ మాలింపక మ్లేచ్ఛుని హితమాలించు వాఁడు దుఃఖనిమగ్నుఁడగును. రిచర్డు. రాజా! ఈస్కంధావారము వీడి యప్పుడే పోవువాఁడఁగాను. ఖడ్గమింకను వ్రాలలేదు—శిరోజ మాత్ర పటుత్వమాపియుంచినవి. ధూర్తరాజా! మనము మగుడఁ గలియుదము.”

“గర్వి! కానిమ్ము. మృదులోజ్వలవస్త్రధారులగు రాజన్యుల కంటె మేషాజినధారియే యెక్కుడహంకారి.”

సన్యాసి యాగుడారమునుండి తిరోహితుఁడాయెను. నృపాలుఁ డంత మహమ్మదీయు నిట్లు ప్రశ్నించెను.—“వివేకవంతుఁడా! ప్రాచ్యసన్యాసులు భూపాలురతోడ నింత చనవుగనుందురా?”

ఆదంబే కిట్లు బదులాడెను.—“నిస్సంగుఁడు జ్ఞానియో యున్మా దకుఁడో కావలయు—పవ లుపవసించి రేయి జాగరణ మొన రించువాఁడు సాధారణుఁడు మాత్రము గానేరఁడు. కాన, నితఁడు

స్వీయప్రతిభావిశేషమున పుడమిూనుల సమక్షమున ననువుగ మెలంగును: లేదేని, మతిభ్రష్టుఁడు గావునఁ దానొనరించు చేష్టలకు బాధ్యుఁడు కాఁడు."

"మానస్యాసులు మతభ్రష్టులేమైరి. కాని, ప్రకృతకార్యము దలంతుము. వైద్యవిశారదా! నీరాకకుఁ గతంబెద్దియో, నేనే మొనరించిన సంతృప్తిగాంతువో సెలవిమ్ము."

నృపాలుఁ డట్లు లాడ, నాదంబేకు ప్రాచ్యగౌరవపురస్సరముగా వినమ్రుఁడై నమస్కృతి యొనరించి, యిట్లులనెను.—"భవదీయ సేవకుఁ డొక్కపలుకాడుట కనుజ్ఞ దయచేయుము. ఒక్కవిషయము త్వదీయస్మరణమునకుఁ దెత్తును. నే నొనరించిన దేమియులేదు.— ఆ పరమవిజ్ఞానలబ్ధప్రభావమువలన భవత్ప్రాణరక్షణ మొనరింపఁ జాలితి.—"

"కాననందులకు వినిమయముగా నొక ప్రాణమిూయమందువు— హా! కాదా?"

"అదియే నాసంప్రార్థనము. సన్మార్గుఁడగు స్కాచిశూరుని ప్రాణము బ్రసాదింపుమందును. ఈతఁడు కొండొక నేర మొనరించె నని వధార్హుఁడాయెను. కాని, మానవజీవితము ప్రమాదభూయిష్ఠము. మనమాటయేడ? ప్రథమమానవుఁడగు 'ఆదామే' ప్రమాదగ్రస్తుఁడాయెఁగదా!"

"ఆదాము తత్కారణమున మృతినొందెనని వివేకింపఁజాలవా?"— నృపాలుఁ డట్లు కించిత్కఠినముగఁ బలికి యిట్టు లనుకొనెను— "ఈతఁడు ప్రవేశించినపుడే యీతని మనోరథము నాకు స్ఫురించెను. ఎంత విపరీతము! మదధికారానుగుణముగ ననేక సహస్రప్రజాఖండన మొనరఁజేసిన నేను మదీయహస్తముననే శతశిరఃఖండన మొనరించిన

నేను నాకును, నా వంశమునకును, నా రాణికింగూడ దురంతదుర్యశ మొడఁగూర్చిన యొక్క నరాధముని వధింపనేరకుంటినే! మదసమర్థతకు నవ్వువచ్చుచున్నది. ఒకరివెనుక నొకరు పుంఖానుపుంఖముగ నరుదెంచి నన్ను నిరోధింపఁగడంగిరి! భార్య, సోదరి, సన్యాసి, హాకీము—ఒకరు పరాభవము గాంచిన యనంతర మింకొకరు! ఒక్క శూరుఁ డింతటితోఁ బోరాడవలసివచ్చెనే! హా! హా! హు!" రిచర్డు బిగ్గఱగ నవ్వెను. ఆతని చిత్తవృత్తి యట్టిది. ఆతని తీవ్రకోపము చిరకాల ముండునదికాదు.

కాని, మహమ్మదీయుఁడు వెఱఁగుపడెను. క్రోధోన్మత్తుఁడై యుండిన నృపాలుఁ డంతలో నాగ్రహరహితుఁడై యట్లు హసించుట యాతనికి విపరీతముగఁ గాన్పించెను. చిత్తము పాదరసమువలెఁ జలించుటయు, నట్లు ధారాళముగ నవ్వుటయును ప్రాచ్యసభ్యతకు విరుద్ధములు:—స్త్రీ బాలురకుఁ జెల్లుగాని పురుషులకుఁ గేవల మనుచితము. నృపాలుని హాస మగువఱకు వేచియుండి, యాతఁ డిట్టు లనెను.

"హాసనదీపితమగు వక్త్రము మరణము విధింపరాదు. నీవు ప్రాణదాన మొనరించితివని యీ సేవకుఁడు సంతసింపవచ్చునుగదా."

"హాకీమ్! మీవారలు పెక్కుండ్రు మా బందిగమునఁ జిక్కిరి గదా. అందు వేయిమందిని గోరుము—ఈక్షణమ సమ్మతింతును. వీని ప్రాణము నీకు నిరర్థకము. వీని ప్రాణము పోయె ననియే తలంపుము."

"నృపాలా! మన ప్రాణము లన్నియుఁగూడ బోయినవే. కాని, పరాత్పరుఁడు దయామయుఁడు. అకాలమున నాకస్మికముగా నిర్బంధపఱచి యడుగఁడు."

ఆదంబే కట్లు సరసముగఁ బలుక, రా జిట్టు లనెను. "హాకీమ్! నేను రాజధర్మము నిర్వర్తించుచుండ నీ వీపగిది సాభిమానముగ నడ్డు

పడుటకుఁ గల ప్రబలకారణ మెద్దియో తెలియకున్నది."

"నృపాలా! న్యాయప్రదానముతోఁబాటు దయ జూపుటయు రాజధర్మము. కాని, నీ విపు డొనరింపఁబూనినది కేవలము నీ యిచ్ఛ మాత్రమె. నే నేల యింతుఁ గలిగించుకొందునంటివా?—చెప్పెదఁ జిత్తగింపుము. ఇందుపై ననేక జనప్రాణము లాధారపడియున్నవి.

"నీభావము వ్యక్తపఱుపుము. మిథ్యావాదములచేఁ గార్యము సాధింప బ్రయత్నింపరాదుసుమా."

"నీ సేవకుఁ డటు లెన్నఁడుఁ బ్రయత్నింపఁడు. దేవరను, సాధారణ జను లనేకులనుగూడ నుద్ధరించిన దివ్యౌషధము సంజీవి. నక్షత్రములు సముచితస్థలముల నుండిన సమయము నిరీక్షించి, దైవజ్ఞానము ప్రసన్నమగు మహాసమయము గనిపెట్టి యీ సంజీవి కల్పింపఁబడెను. తత్ప్రభావమున నెందఱో మహాలాభము గాంచిరి. ఇందు నాకునాధిక్య మేమియు లేదు. ఉచితముహూర్త మరసి దీని నొక జలపాత్రమునందు ముంచి య్యా నీర మొసంగుదును. మృత్యుముఖముననున్న రోగి యీ యమోఘౌషధప్రభావమున నారోగ్యము గాంచును."

బేకట్లు పలుక రాజిట్టులనెను—"ఈ యౌషధ మపూర్వము, సూక్ష్మముగూడను! మా యౌషధములు మోయుట కనేక యుష్ట్రములు గావలయు,—నీ కట్టిశ్రమ లేదుగదా. ఇట్టిది మఱియొకటి కలదేమో."

హాకీము మిక్కిలి గంభీరముగ నిట్టు లనెను—"సంజీవనములు గల్పించుట సాధ్యమేయగు, గాని తత్ప్రయోగకుశలు లరుదు. అందులకుఁ గఠిన నిబంధనలు చాల కలవు. బాధాకరములగు నుపవాసములు ప్రాయశ్చిత్తము లొనరించిన జ్ఞానిమాత్రము సంజీవి యుపయోగించుటకు దక్షుఁడు. వాఁడు భోగపరాయణుఁడై ప్రమత్తుఁడై చంద్ర

మానసమునకుఁ బండ్రెండుగురఁ నుద్ధరింపఁడేని సంజీవినీప్రభావ మంతరించుటయేగాక, యంత్యరోగియు, సాధకుఁడునుగూడ శీఘ్రముగ మందభాగ్యులై యొక సంవత్సరములోపున మరణింతురు. నేను మఱి యొకని రక్షించినగాని నిర్దిష్టసంఖ్య పూర్తి కాదు."

"హాకీమ్! ఈ విశాలశిబిరమున నీకు లెక్కలేని రోగులు కాన్పింతురు. నా తలారియొక్క రోగులను నీ వపహరించుట న్యాయముగు కాదు. ఒకరిధర్మము నింకొక రాక్రమించుట యధర్మమని నీకుఁ దెలియుఁగదా. ఆవిషయ మటుండ, నధార్మికుఁడగు నేరస్థుని విడుచుట నీ వ్రతమున కెట్లు సహకారి యగునో తెలియకున్నది."

"నృపాలా! ప్రశస్తౌషధములు పెక్కులు నిరర్థక మైనపు డొక గ్రుక్కెడు శీతలోదక మెట్లు సార్థక మాయెనో చెప్పఁగలవేని, తదితర రహస్యములు గ్రహింపఁగలవు. ఈ యుదయమున నొక యపరిశుద్ధజంతువు నంటియుండుటచేత నే నిపుడు ప్రభావరహితుఁడను. కావున నన్నిఁకఁ బ్రశ్నింపకుము. నా ప్రార్థన మన్నించి యీ శూరుని రక్షింతు వేని నీవును నేనును మహోపద్రవ మతిక్రమింపఁగలమని గ్రహింపుము."

"హాకీమ్! వైద్యులు నిగూఢభాషణప్రియులు; నక్షత్రములనుండి తమ జ్ఞానము ప్రభవించెనని వాకొందురు. అందులకు నే నేమనువాఁడ గాను. కాని, శకునాది క్షుద్రవిషయములు బురస్కరించుకొని రిచర్డునృపాలుని వెఱపింపఁజూచుట యసంబద్ధము. ఒక శశ మెదురాయెనని, మార్జాలము తుమ్మెనని, కాకి కూసెనని విహ్వలించి కార్య ముడుగుటకు నేను మతిమాలిన వృద్ధాంగనను గాను సుమా."

"నృపాలా! నీ యనుమానము వారింపఁజాలను. కాని, యీ సేవకుఁడు సత్యవాది యని ప్రభువు గ్రహించుఁగాక. దుష్టరోగార్తుఁడై

కడు బాధపడిన నృపాలుఁడు తనవలె నితరులుగూడ నీ సంజీవినీప్రభావమున రోగవిముక్తులై హాయిగ నుండఁజూచునా? లేక, ఒక్కయల్పకంటకుని విడువనొల్లక లో కాపకార మొనరించునా? రాజపుంగవా! నీవు సహస్రజనసంహార మొనరింపఁజాలుదువుగాని, యొక్కని కారోగ్యముఁ బ్రసాదింపఁజాలవు. భూపాలురు నైతానువలెఁ బ్రజాపీడన మొనరించుటకు సమర్థులు; జ్ఞానులు అల్లావారివలె బాధానివారణ మొనరింప సమర్థులు. నృపాలా! నీ కసాధ్యమును ప్రజాక్షేమంకరమునునగు మేటి సామర్థ్యము నీ వంతరింపఁజేయకుందువుగాక. శిరఃఖండన మొనరింపఁగలవు, పంటి సలుపైనను నివారణ సేయనేరవు."

"ఇది యతి ధూర్తము"—వినమ్రుఁడగు మహమ్మదీయుఁడు గంభీరతగుఁడై తనకు నాజ్ఞాపించుచుండెనో యనునట్లుకూడఁ బరిణమించుటచేత రిచర్డు కనలి యిటు లనెను—"నీవు వైద్యుఁడవే యనుకొంటిఁ గాని, హితోపదేశకుఁడవై బుద్ధి సెప్పుదువని యెఱుంగను."

"సుప్రసిద్ధకీర్తివంతభూపాలుఁడు తాఁ గాంచిన యుపకారము నిట్టులే పరిగణించునా? కానిమ్ము. చారణులు యూరపాసియా ఖండాంతర రాజాస్థానములందును, మహమ్మదీయుఁడు, క్రైస్తవుఁడు, శూరుఁడు కాంతామణి యను విచక్షణలేక గౌరవసభ్యత్వముల కాలవాలమగు ప్రతిష్ఠలమునందును, 'రిచర్డురాజు కృతఘ్నుఁడు కుపితుఁ'డని గాన మొనరింతురని యెఱుంగుము. నీయశ మెఱుంగని దేశములు గలవేని, యందుఁగూడ నీ దుర్యశము ఘోషించుఁగాక."

తురుష్కవైద్యుఁడు సాహసియై యట్లు పలుక, నాంగ్లరాజు క్రోధఘూర్ణమానహర్యక్షసన్నిభముగ నంగలు వైచి యాతని డాసి యిట్లు గర్జించెను—"దుష్టమ్లేచ్ఛాధమా! నన్నే యిటు లందువా!

బ్రతుకుపై రోసితే?''

"తెగవేయుము! మదాలాపము లొక్కొకటి మధుమక్షికము వలె నిన్ను గారించునేని, నీ యీకృత్యము నిన్ను మఱియు బాధింపఁ గలదు—నీ హీనత్వము హేయతరంబగు.''

నృపాలుఁ డుగ్రుఁడై వెనుదిరిగి, భుజములు కట్టుకొని వడివడి పచారుచేసెను. "కృతఘ్నుఁడ, గుప్తితుఁడనా! భీరుఁడ, మ్లేచ్ఛుఁడ ననినటులె! హాకీమ్! వరము గోరితివి: అంతకంటె మత్కిరీటాభరణములు గోరితివేని బాగుండెడిని. ఐనను, గాదనఁజాలను. ఈ స్కాటును గైకొనుము. ఈ పత్రము జూపుదేని యధికారి వానిని నీ యధీను నొనరించును.''

రిచర్డు రెండు పంక్తులు లిఖించి యా పత్రము వైద్యున కొసఁగెను.—

"నీ బానిసగ గ్రహించి వీని నీ యిచ్ఛకు వచ్చువిధమునఁ బాలింపుము. రిచర్డుకంట బడనంతవరకుమాత్ర మెఱిఁగి వాఁ డప్రమత్తుఁ డగుగాక. హాకీమ్! నీవు వివేకవంతుఁడవు. మా గౌరవము సుందరాంగులగు నబల లందు నిక్షిప్తమై యుండు; వీఁడు సాహసియై వారిని డాసెను.—ని న్నీవిషయము హెచ్చరించుట యనవసరము.''

తురుష్కుఁడు తొంటియట్లు వినమ్రుఁడై యిట్లు లనెను—
"ఉత్తమ రత్నకంబళము కళంకిత మగునేని, యజ్ఞుఁ డామచ్చయే జూపును; జ్ఞాని యద్దానిం దన వస్త్రముతోడ నాచ్ఛాదించును. ప్రభుచిత్త మాలించితి; ఆలించుట యాజ్ఞాపాలన మొనరించుటయే.''

"వాఁడు నాకంటఁ బడుట యపాయకరమని హెచ్చరింపుము. నా కొనరింపవలసిన పని మఱేమైన నున్నచో సెలవిమ్ము.''

"నృపాలా! సఫలీకృత మనోరథుఁడనైతి. యూధులు తొల్లి భాగ్యహీనులై నిర్జల మరుభూములందుఁ బరిభ్రమించుచు నధికదాహా

ర్తులై శోషిల్లు సమయమున దైవాంశసంభవుఁడగు వారి నాయ కుఁడు—'మోసా' దైవచింతాపరుఁడై తనదండమున నొక పరుష శిలాఖండము గొట్టినంతనే వెలువడిన యవిరళజలధార బోలిన భవ దీయ వితరణము మదీయవాంఛాపాత్రమును నింపివైచెను."

నృపాలుఁడు మందహాస మొనరించి యిటులనెను.—"వైద్యుఁడా! తీవ్రఘాతమునఁగాని యాజలోత్పత్తి కాలేదు గదా. అటుఁగాక, అట్టి బాధకము లేక, నిరంతరాయమానమగు సహజజలధారవలె నీకే దేని యుపకారము సేయఁగోరెదను."

"నృపాలా! నీజయహస్త మందిమ్ము. ఆదంబేకు మగుడ వర మర్థింపవలసిన యవసర మరుదెంచునేని, కోరి వడయఁగలఁడు."

నృపాలుఁ డందుల కియ్యకొని, "శిక్షాపాత్రులగు నేరస్థులను మాత్రము గోరకుండ, క్రమవిధమున నియమితమగు నీరోగులసంఖ్య పూరించుకొందు వేని, నే నమితసంతుష్టాంతరంగుఁడనై నీఋణము వేఱువిధమునఁ దీర్పఁగలను."

ధీర్ఘాయుష్మంతుఁడవు గమ్మని రాజును దీవించి, సవినయముగఁ బ్రణామమాచరించి హాకీము నిష్క్రమించెను. విషయమట్లు పరిణ మించుట పూర్తిగ సహింపని యట్లు లామహామ్మదీయుని వంకఁ దిల కించి తిలకించి నృపాలుఁ డిట్లు చింతించెను.—

"వీని చలము విపరీతము. ద్రోహియై మరణశిక్షకుఁ బాల్పడిన స్కాట్లాండు దేశపుఁ గణతుని రక్షించుటకు వీఁ డేల పూనుకొనెనో గ్రాహ్యము కాకున్నది. సరె, బ్రతుక నిమ్ము! లోకమునకు మఱి యొకధీరుఁడు దక్కెను. ఇఁక నీవిషయము విస్మరించి, యాస్ట్రియను సంగతి దలపవలయు. ఓరీ! లోయప్రభు వెక్కడ?"

రాజాజ్ఞ యగుటచేత లోయప్రభువు తన మహాకాయము మార్గ మును జీకటిసేయ, రాజసమక్షమున కరుదెంచెను. ఆవెనుక, మేషాజిన

ధారియై యభినవభూతమువలె నున్న యెంగాడీస్వామి యనివారి తుఁడై ప్రవేశించెను. ఆంగ్లనృపాలుఁడు వానిం దిలకింపకయే యుచ్చస్వరమున నాంగ్లప్రభుతోడ నిట్టులనెను.

"లోయప్రభూ ! ఆస్ట్రియా ప్రభువనువాని గుడారమునకు మాగధ కాహళంబులతోడ నీకుఁ జనుపోయి, వాఁడు బహుళ సామంతశూర జన పరివృతుఁడై యుంటగాంచి,—వాఁడు పశుప్రాయుఁడగుటచేత దైవసంప్రార్థన మాలింపకయే యుదయభోజన మారగించుచు, వాని పరిజను లచటనేయుందురు,—గౌరవము భావింపక యందుఁ జొరఁబడి, నాకు మాఱుగ విస్పష్టముగ నిట్టులనుము.—నీచేతనే, లేక, నీప్రేరణముననే మఱియొకనిచేత నాంగ్లపతాక మపహృతమాయెను. కావున, నీముఖ్యసామంతు లనాచ్ఛాదితశిరస్కులై చూచుచుండ నీవా కేతన మొక గంటలోపున సమర్పింపవలయు: సమర్పించుటయే గాక, నీపతాకముం దలక్రిందుగ నాప్రక్క నిలుపవలయు: మఱియు నాంగ్లపతాకాపహరణ మొనరించిన నరాధము శిర మచటనే యొక శూలముపై నిలుపవలయు. మా యాదేశము సకాలమున సంపూర్ణముగ నెఱవేఱునేని, పాలస్థానదేశోద్ధరణకై మన మొనరించిన పవిత్ర సంకల్పము దలంచి నీనేరము సైరింతుము."

"నృపాలా! అతఁ డొకవేళ నేర మొప్పుకొనఁడేని, యేమి చేయవలయు?"

"వాఁడు ద్రోహియని మేము ఋజువుచేతుమని తెల్పుము. బలవంతులగు నిరువురు యోధులతోడనైన రా సిద్ధము—లక్ష్యము లేదు. నే నొక్కఁడ నేలనో, యశ్వారోహణ మొనరించియో, తన యిచ్చకువచ్చు స్థలమునఁ దన యిచ్చకువచ్చు నాయుధములు బూని వానిం దెగటార్చి, వాని ద్రోహము ధృవపఱతునని చెప్పుము."

"నృపాలా! క్రైస్తవరాజన్యులు మహామ్మదీయ విచ్ఛేదన పర

తంత్రులై తత్సమయబద్ధులై యుంట దలంపవా ?"

"నీవు మ దాజ్ఞాబద్ధుఁడవని తలంపవా ? ఎంత విపరీతము ! బాలురు వినోదార్థము పక్షి వెంట్రుకల నెగురనూదునట్లు జనులంత చులకనగా మమ్ముఁ గార్యవిముఖుల నొనరింపఁ బ్రయత్నింతురు. మన మతయుద్ధసమయమందువా ? అయ్యాది మహమ్మదీయులను భంజించుట కొఱకే గదా. కాని, క్రైస్తవనాయకు లిపుడు యుద్ధము విరమింప, మన సమయమేడ ? మఱియుఁ బ్రతినాయకుఁడును దనక్షేమమే చూచుకొనుటలేదా ? అందఱు స్వార్థపరులగు నపుడు నేనును స్వార్థపరుఁడనే యగుదును. నేఁ గోరునది ప్రతిష్ఠ. నేను గౌరవార్థినై యీదూరదేశ మగుదెంచితి. మహమ్మదీయ విధ్వంసకుఁడనై క్రైస్తవ ప్రతిష్ఠా సంస్థాపకుడనై యశోపార్జన మొనరింపఁజాలకపోయినఁ బోదును గాక—తుచ్ఛుఁడగు నాస్ట్రియా నాయకుఁడు సకల క్రైస్తవరాజన్య సాహాయ్యుఁడై నిలిచినను బోరి యఖర్వగౌరవసమన్వితుఁడనై యుండుఁగాక !"

నృపాలుఁ డట్లు పలుకు నపుడేమియు ననఁజాలక, ఆంగ్లప్రభువు తత్కార్యభారము వహించి వెడలఁబోయెను : తన యసమ్మతి దాపఁజాలక తదనుగుణముగ నాతఁడు భుజము లెగురవైచెను. కాని, ఎంగాడీస్వామి దైవ సందేశభారధురంధరుఁడై కేవల నరపాలకులను దృణీకరించువాని వోలె రిచర్డును సమీపించెను. సంస్కారవిరహితములై జడలుగట్టిన శిరోజములు, అందుకుఁదగిన జీబుగడ్డము, మేషాజినధారణము, సంకుచితలక్షణములతో నొప్పు భయద కృశీభూతశరీరము, కట్టంపుఁ గనుబొమలనుండి యున్మత్తసన్నిభతీక్ష్ణముతో దీపించు కనుగవయును జూడ, బ్రజాపీడన మొనరించు రాజాధములను మందలించుటకొఱకుఁ దమ యరణ్యావాసములు వీడి యాకస్మికముగ నరు

దెంచు తొంటి * యూధఋషులు జ్ఞప్తికి రాఁగలరు. ఆంగ్లనృపా లుఁడు పదనుదప్పి విరసముగ నుండు నప్పుడైనను మతాచార్యాది పుణ్యజనులను సంభావించును. కావున, నాతని యాకస్మికాగమనము సహింపనివాఁడయ్యు నెంగాడీస్వామిని సగౌరవముగా నాహ్వానించెను. తదాహ్వానముతోఁ బాటు, సత్వరము తన సందేశము గొంపోవలయు నని యాతఁడు లోయప్రభునకు సన్నగూడ నొనరించెను.

కాని, యెంగాడీస్వామి యమితోద్రేక పూరితచిత్తుఁడై చేతులు ద్రిప్పుచు, రాజాజ్ఞాబద్ధుఁడై వెడలకుండిన లోయప్రభువుకు వారించెను.—

"పవిత్రాశయబద్ధులై, సోదరప్రాయులై మనవలసిన ప్రసిద్ధక్రై స్తవనాయకు లీపగిదిఁ బరస్పరవిరోధులగుట దుస్సహము. ఈ యప వి(త్రఘాతుక సందేశము నే నొల్లను. క్రైస్తవభ్రాతృత్వము భగ్న మొనరించువాఁడు పాపాత్ముఁడు! ఆంగ్లనృపాలా! నీ యపవిత్ర సందేశ ముపసంహరింపుము. మరణాపాయములు నిన్నంటియున్నవి! కటారి నీ కంఠమునకు సన్నిహితమై యున్నది!"

"మరణాపాయములు రిచర్డు క్రీడాసహచరులు. అనేకఖడ్గములు తృణీకరించిన పరాక్రమశాలి యొక కటారి లెక్కసేయునే?"

ఆంగ్లనృపాలుఁడట్లు సగర్వముగఁ బలుక సన్న్యాసి యిట్టులనెను— "నీవు మారణాపాయ పరివృతుఁడవు.—మరణానంతరము దైవవిమర్శ నము!—"

"పూజ్యుఁడా! నీవు సాధుజనుఁడ వని పవిత్రభావముతోడ గౌర వింతును.—"

"వలదు! నన్ను గౌరవింపవలదు! అంతకంటె అమృతసముద్ర ప్రాం తమున దేవులాడు దుష్టతమకీటకమును గౌరవింపుము. ఎవ్వఁడు గౌర వార్హుఁడో వానిని గౌరవింపుము. నే నెవ్వని యాజ్ఞనలు నివేదింతునో

* పాలస్థానమునకు యూధదేశమను నామాంతరము గలదు.

యా పరమాత్మని గౌరవింపుము: ఏని పవిత్రధామ ముద్ధరింపఁ గం కణధారణ మొనరించితివో యాతని గౌరవింపుము. సకలక్రైస్తవ రాజన్యక్షేమము కరుఁడవై నీ వొనరించిన సమయము గౌరవింపుము. పవిత్రవంతమగు క్రైస్తవసౌహార్దము మాత్రము ఛిన్న పఱుపకుము."

ఆ వక్తయిట్లు సావేశముగాఁ బలుక, నృపాలుఁడిట్లు బదులాడెను.

"సాధుపూరుషా! మీరు మతాధిపతులగుటచేతఁ దన్మాహాత్మ్యము బురస్కరించుకొని యహంకారము బూనుదురు. మాదు చిత్తశుద్ధి కొఱకు మీరు వహించుబాధ్యత నేను గాదనను. మేము మా గౌరవము రక్షించుకొనఁ బూనునపుడు మీరు వారింపకుందురు గాక."

"అహంకారమా! ఘంటికుని చేతిఘంటకు నహంకారమా? పరమాత్మనాజ్ఞను ఘోషించు నీ క్షుద్ర కాహాళమున కహంకారమా? నృపాలా! మోఁకరించి ప్రార్థింతును. క్రైస్తవాన్వయక్షేమము, నీ దేశక్షేమముఁ నీ క్షేమమును దలంపుము."

అట్లనుచు మోఁకరించు స్వామిని లేవ వలయునని నృపాలుఁడు నిర్బంధపఱచెను.—"లెమ్ము, లెమ్ము! దైవచింతావసరంబున నమ్మ మాయెడు జానువు మా యెడ నటులాచరించుట యనుచితము. మహనీయా! మాకు రాఁగల యాపద యెద్ది? మొన్నఁ దలయెత్తిన యా ష్టిమూనాయకునిగాంచి భయపడుటకు నాంగ్లపౌరమ మడుగంటెనే?"

"నృపాలా! మదీయనక్షత్రశాలయం దప్రమత్తుఁడనై గ్రహగమన పరీక్ష యొనరించితి.ఒక గ్రహము నిన్ను దుష్టముగఁ జూచుచున్నది.—నీ యశోభాగ్యములకుఁ జాలప్రమాదము,—శనిగ్రహప్రభావమున నీకు ఘోరాపాయము రానున్నది—నీ యహంకార ముడిగి విధ్యుక్తధర్మానుష్ఠాన మొనరింపవేని నశింతువు."

"ఛీ! ఇట్టి యనాగరిక విశ్వాసములు క్రైస్తవులకు దూరములు. ఇట్టి శాస్త్ర మభ్యసింపరాదు; బుద్ధిమంతులు దీనిని బాటింపరు.

వృద్ధుఁడా! నీ మతి పోయెను.”

“రాజా! నా మతి పోలేదు. నా కంతటి సౌఖ్యములేదు. నా యవస్థ నాకుఁ దెలియును. నా కవసరములేదు గాని క్రైస్తవ హితాచరణార్థము నా కొకింత వివేకము మిగిలియున్నది. తన కొఱకుఁగాక యన్యజనక్షేమము కొఱకు దీపము దాల్చు నంధుఁడను నేను. క్రైస్తవాన్వయము గుఱించియు నీ మతయుద్ధము గుఱించియు నన్ను బ్రశ్నింతువేని, నా విజ్ఞానము వాగ్వైభవమును నరయఁగలవు. దురంతదుఃఖితాత్ముఁడనగు నన్ను గుఱించి యడుగుదువా — వెఱ్ఱివానివలె నసంబద్ధముగఁ బ్రలాపింతును.”

“ఆర్యా! క్రైస్తవసౌహార్ధము భగ్నపఱచు వాఁడఁగాను. కాని, నాకు ఘటిల్లిన యన్యాయమునకు బరాభవమునకు వారొనరించు పరిహారమేమి?”

“ఆ విషయ మరసియే యరుదెంచితిని. ఫ్రాన్సు దేశాధీశుఁడగు ఫిలుప్పు క్రైస్తవరాజన్య సంఘమును రయమ్మున రావించెను. సభికు లీవిషయ మాలోచించిరి. తత్పరిణామ మెఱింగించుటకే నే నరుదెంచితిని.

“విపరీతము! కళంకి తాంగ్ల గౌరవము గుఱించి రిచర్డు పరోక్షమున నన్యులు ప్రసంగించుటయా!”

“నిన్నుఁ దామే తృప్తిపఱుపఁ గోరుచున్నారు. ఆంగ్లధ్వజము జార్జిదిబ్బపైఁ బ్రతిష్ఠించుటకును, అట్టి ద్రోహ మొనరించిన దురాత్ముని బహిష్కరించుటకును, ఆ కంటకుని బట్టి యిచ్చువానికి ఘనమగు బహుమాన మొసంగుటకును, ఆ ద్రోహి మాంసమును నక్కలకు గ్రద్దలకు వైచుటకును క్రైస్తవరాజన్యు లేకగ్రీవముగ సమ్మతించిరి.”

“ప్రబలానుమానాస్పదుఁడగు నాస్ట్రియా మాట?”

“యెరూసలేము నగరాధ్యక్షుఁడు శాసించు విధమున నాస్ట్రియా

రాజన్యుఁడు ప్రమాణమాచరించి తదుచితముగఁ దన నిర్దోషత్వము స్థిరపఱచుకొనును."

"ద్వంద్వయుద్ధ మొనరించి యాతఁడు వాదు మాపుకొనునా?"

"అసంభవము. మతయుద్ధసమయ బద్ధుఁ డటు లొనరింపరాదు. మఱియు, రాజసభ—"

"మహమ్మదీయునితోడఁ గాని మఱెవ్వనితోడఁ గాని పోరాడ నీయరు. కాని, ఆర్యా! నా యొనరింపఁదలఁచిన కార్యమునందలి యవివేకము వ్యక్తపఱచితివి, చాలు. నీటియందు దీపము వెలిగింప వచ్చునుగాని, దుష్టభీరువు నందొక పౌరుషకణము ప్రభవింపఁజేయుట యసాధ్యము. ఆస్ట్రియా నాయకుఁడు గౌరవశూన్యుఁడు. ఐనను, వాఁడొకప్రమాణ మొనరించి తన నిర్దోషత్వము ప్రకటింపవలయు. ఈ ద్రోహి తానొక సదాచారివలె * దప్తలోహగోళము బట్టునపుడు, వాని నికృష్టహస్తము చురచుర గాలుటగాంచి యెంత యానందింతును—"

ఆంగ్లనృపాలుఁడా పగిది నప్పుడే భయంకరానంద మనుభవింపు చుండ, నాతని సన్యాసి వారించి యిటులనెను.—"చాలు! రాజా! పరస్పరదూషణ ప్రియులగు నృపాలుర నెవ్వరు గౌరవింతురు. ఆహా! నీ వంటి యుదారపురుషుఁడు, నీ వంటి స్తవనీయమానరాజగుణావిరాజితుఁడు, నీ యట్టి క్రైస్తవ జగదైకశూరుఁడు, చిత్తము ప్రశాంతముగ నుండు సమయమునఁ గ్రైస్తవప్రపంచమును బాలింపఁజాలు వివేకవంతుఁడు, మృగరాజువలె ధైర్యసాహసోదారలక్షణ సంపన్నుఁడయ్యు దాదృశముగఁ గ్రూరోద్రేక సంకలితుఁడు గూడ నగుట శోచనీయము.—" సన్యాసి యధోనయనుఁడై చింతాపరుఁడై మగుడ

* నేరమారోపింపఁ బడువార లట్టు లమానుష కార్యము లొనరించుట నాఁటి సాంప్రదాయము. బాధపడువాఁడు ద్రోహి.

నిటులనెను. "సర్వజ్ఞుఁడగు దైవము నీ ఘోరమరణము నొకింత నిలిపి యుంచెను. లయదేవత విచ్చుకత్తి దాల్చి వేచియున్నది. సింహహృదయుఁడగు రిచర్డ్చిరకాలమున మిత్తివాతఁబడును."

"ఇంత శీఘ్రముగనే? ఔఁగాక. నా జీవితమల్పమైనను, ఉచ్చగనుండుఁగాక!"

నృపాలుఁ డట్లు పలుక, నలవాటులేని యొక బాష్పబిందువు సన్యాసి తీక్ష్ణనయనమునఁ దోఁచినటులాయెను.—"ఆహా! ఉదారమనస్కుఁడా! నీ జీవితము హ్రస్వమై సంతాపకరమై, కష్టభూయిష్ఠమై, కారాగృహవాసానుభూతమై యుండు:-ప్రజాజ్ఞానాభివృద్ధికొఱకేమియు నొనరింపక, ప్రజాసౌఖ్యము కొఱకుఁ బాటుపడక, ప్రజాభిమానదూరుఁడవై, నిరంతరాయమానమగు సంగ్రామ లోలత్వమునఁ బ్రజలు పీడింపఁబడుటచేత నీకొఱకు దుఃఖించు వా రెవ్వరులేక, సంతానములేక మరణింతువు."

"యశోరహితుఁడఁ గానుగదా! మదీయ హృదయరాజ్ఞి నాకై పరితపించుఁజాలు. పురుషున కీరెంటను నెంత యానందజనకములో నీ వెఱుంగవు, గ్రహింపనేరవు."

"చారణప్రశంసయు గాంతాప్రేమయు నెఱుంగనా? గ్రహింపనేరనా?"—ఆంగ్లనృపాలు నాపగిది బ్రతినిరసన మొనరించు సన్యాసి స్వరము రిచర్డు ననుకరించెనో యన నావేశపూరిత మాయెను. తన జీర్ణభుజము చాపి యాతఁడు మగుడ నిటులనెను.—"ఆంగ్లరాజా! నీనాళములయందు నుడికెడు రక్తము నాయందు మందీభవించిన రుధిరముకంటె బ్రశస్తముకాదు. నిజశౌర్యగుణప్రభావమున యశస్సాంద్రుఁడైన సాధుపురుషుఁడు 'గాడ్రేఫ్' నామధేయుని వంశజుఁడను. నేను—ఈప్రపంచమున నుండినపుడు, ఆల్బరికు—"

"ఎవని యశోత్కర్షము దేశదేశములు మ్రోఁగెనో, యా మహనీయుఁడవేనా! అట్టులే యగునా? అట్లు కాఁజాలునా? శూరశ్రేణి

యను నంబరమునుండి యిట్టి తేజోవంతుఁడు చ్యుతుఁడగు నపుడు తదంగారశేషము లెందుఁ బడినో తెలియక పోయెనే!"

"నృపాలా! చ్యుతనక్షత్రము బరిశీలింతువేని, యొక నికృష్టరాశి గోచరించును. ఆ హేయపదార్థమే యాకసమున నమరిన కాలము నందు వైభవముతోడ దీపించెను. నీ వహంకార ముడిగి మతశిక్షా బద్ధుఁడవగుదు వను విశ్వాసమువలన మదీయ భయంకరజీవితరహా స్యము వెల్లడించెదను. ఇంతకాలము నాహృదయమున నడంగి నన్ను దహించివైచుచున్న నారహస్యము నీక్షేమముకొఱకుఁ దెలుపువాఁడ, విచారము నిస్పృహయును ఈయభాగ్యునకు నిరర్థకమైనను నీవంటి ధూర్తోదారస్వభావునకుఁ బ్రయోజనకారి కావచ్చును. చిరకాల మడఁగియున్న గాయములు జూపెదను—ఈ దౌర్భాగ్యుఁడు మర ణించునట్లు రుధిరము స్రవించిన స్రవించుఁగాక!"

ఆల్బరికు నామధేయుఁడు రాజవంశజుఁడు, మహాశూరుఁడు. ఆతఁ డొనరించిన కార్యములు చారణులు నానాదేశములందు శ్లాఘనీయ ముగ గాన మొనరించుటచేత, నాశూరాగ్రణి కీర్తి జగద్విఖ్యాత మాయెను. రిచర్డు నృపాలుఁడు తనబాల్యమునం దాతనికీర్తి కలాప మాలించియుండెను. తానే యాపురుషుఁడనని యెంగాడీసన్యాసి తెల్పి నంతనే రిచర్డు విభ్రమచేతస్కుఁడాయెను. ఆస్వామి తన దుఃఖగాధ వినిపించెను.—

"నావంశము గుఱించియు, భాగ్యము గుఱించియు, పరాక్రమము గుఱించియు, ఆలోచనాకౌశలము గుఱించియు నేఁ జెప్పుట యనవ సరము. నన్ను వివాహ మాడవలయునని ప్రసిద్ధవంశభవకాంతామణు లెందఱో యువ్విళులూరుచుండ, నాచిత్తము కొండొక మచ్చెకంటిపై లగ్నమాయెను. ఆపె జనకుఁడొక సామాన్యసైనికుఁడు. తనవంటి పేద వాని పట్టి నాయట్టి రాజవంశజుని ప్రేమించి భార్య కాఁగోరుట యవి

వేకము నసంబద్ధము నని యెంచి యాతఁడు విముఖుఁడాయెను. కాని, నాప్రణయము నిశ్చలమై మఱలకుండెను. నే నపుడు యుద్ధమునకుఁ బోవలసి వచ్చెను. చిత్తము మదీయ హృదయాపహారిణిపై నిల్పి, సంగ్రామ నిమగ్నుఁడ నైతి. కదనము ముగిసినంతనే రయమ్మున నింటి కరుదెంచి చూడ నాకన్నియ కానరాకపోయెను. నన్ను వారించుట యసాధ్యమని గ్రహించి యామెజనకుఁ డామె నొక సన్న్యాసినీ మఠము నందుఁ బ్రవేశపెట్టెను. పిడుగువంటి యావార్త వీనులఁ బడినంతనే ప్రపంచముపై రోసి, నేనును వేఱొక మఠమునందుఁ జేరితిని. సైతాను ప్రేరణమున నాశాపరుఁడనై గర్విష్ఠనై రాజ్యమునందు వలెనే మఠము నందుఁగూడ మదీయ ప్రతిభావిశేషమున నగ్రస్థానము గాంచితిని. నావంటి వివేకవంతుఁడు లేఁడని పేరు వడసితిని. నావంటివాఁడు ధర్మచ్యుతుఁడగుట యసంభవమని గర్వించితి—నాతోడివారలు గూడ నట్టులే విశ్వసించిరి. ఆకారణమున నేనొక సన్న్యాసినీమఠమునకు నియోగింపఁ బడితిని. నాకాంత యందే యుండెను. ఇఁక నేమి చెప్పుదును? ధర్మము పటాపంచలాయెను. ఆసన్న్యాసిని తా నొనరించిన ఘోరాపరాధము భరింపఁజాలక యాత్మహత్య యొనరించి యెంగాడీ గృహాగర్భమున నిశ్చల నిద్రాధీనయై యున్నది. ఈ నికృష్టమానవుఁడు విశీర్ణహృదయుఁడై యా సమాధిమీఁదనే మూల్గుచు నఱచుచు నుండు.”

“భాగ్యహీనుఁడా! నీదురవస్థ నాకిపుడు గ్రాహ్యమాయెను. నీవొనరించిన నేరమునకు శిక్ష యనుభవింప లేదా?”

“మదీయ వంశోన్నతి దలంచి నన్ను మననిచ్చిరి. గమనింపుము. కృశీభూతమై జీవరహితమైన యీ తనువునందు రెండుగుణములు మాత్రము గలవు. అపరిమిత్తుఁడనై యెరూసలేము నగర ముద్ధరించుటకుఁ బాటుపడుట యొకటి. నేఁ జూడరాని పవిత్రాస్థికలు గనిపెట్ట

కొని నాదౌర్భాగ్యము దలంచుకొనుచు నిరంతరాయమానదుఃఖ నిమగ్నుఁడ నగుట రెండవది. నామీఁద జాలి పడవలదు. నాయట్టి యధమునిపైఁ జాలిబూనుట పాపావహము. ననుఁజూచి కనికరము పడక బాగుపడుము. నీవు క్రైస్తవ జగదైకశూరుఁడవు, ఈమహా కార్యమునకు నాయకుఁడవు—ఇతరక్రైస్తవనృపాలుర కసాధ్యమగు భయంకరోన్నతశిఖరమున నున్నవాఁడవు. గర్విష్ఠుఁడవు, నియమ రహితుఁడవు, క్రూరాత్ముఁడవు. పుత్రికలను బోలిన యీదోషములు వర్జింపవలయు; నీవు చేరఁదీసిన యీ దయ్యములను బాఱఁద్రోలుము— గర్వరహితుఁడవై, భోగరహితుఁడవై క్రౌర్యరహితుఁడవై యుండుము."

ఆధోరణి యున్మత్తలక్షణము కావలయునని రిచర్డు విముఖుఁ డాయెను. ఐనను, ఆసన్న్యాసి దూషణాలాపము చిత్తము నొకింత కారిం చుటచే నృపాలుఁ డొకింత నిందాగర్భితముగ నిట్టులనెను.—"కొలది కాలము క్రిందటనే నావివాహమాయెను. ఐనను, నాకుఁ జక్కనిసుతుల నరసితివి. కూతుండ్రు చిరకాలము కన్యాత్వముననే యుండరు గదా. తనూజాతలకుఁ దగువరుల నరయుట జనకునకుఁ గర్తవ్యము. దైవ సేవాపరాయణులగు మతాధిపతులకంటె నర్హు లెవ్వరు? కావున, గర్వమనెడు కన్నియను ఆచార్యులకును, భోగకన్యను సన్న్యాసులకును, క్రౌరకన్యను సన్న్యాసి శూరులకును నర్పింతును."

"ఆహా! కఠినహృదయుఁడా! నీయెడ హితము, నిదర్శనముగూడ నిరర్థకములు: దైవసమ్మతమగు విధమునఁ జరింతువేని, కొంతకాల ముండఁగలవు. నాతావున కిఁక నేఁ బోవలయు, నే నెవ్వఁడను, సూర్య కిరములుగొని వానినొక సూక్ష్మప్రదేశమునఁ గేంద్రీకరించి యట నుండు పదార్థమును దహింపుచు, తాను మాత్రము చెడక చల్లగనే యుండు కాచమువంటి వాఁడను—దైవకరుణాకిరణములు నాపైఁబడి, నానుండి ప్రసరించును. ధనికులు విందు నిరాకరించిరి; పేదలనే పిలువ

వలయు..."

సన్యాసి యా తెఱఁగున నఱచుచు నవ్వలకుఁ బోయెను.

"ఈతఁ డున్మత్తుఁడు!"—సన్యాసి నిరసనచే నుడికిన రాజచిత్త మొకింత సేదదేఱెను. "లోయా! ఈస్వామి వెంటఁ బొమ్ము—అపాయము కలుగకుండ చూడుము. మనసైనికులు మతయుద్ధసమయబద్ధులయ్యు నింద్రజాలకాదులను మాత్రము గౌరవింతురు; సాధుజనులను గారింతురు."

రాజాజ్ఞాబద్ధుఁడై లోయప్రభువు వెడలెను. ఎంగాడీస్వామి చెప్పిన జోస్యము రిచర్డు చిత్తమును గలంచుచుండెను.—"నాకై దుఃఖించువా రెవ్వఁడు లేక, సంతానము లేక, అకాలమున మరణింప వలయునా? ఈశిక్ష దారుణము! కాని, యీతఁ డున్మత్తుడుగదా. ఉన్మత్తప్రలాపములు లెక్కింపరాదు. కాని, పరమాత్మునిముందు జ్ఞాని యజ్ఞాని యగు; అజ్ఞాని జ్ఞాని యగు. కావుననే, యున్మత్తులకు భావికాలరహస్యమును విజ్ఞానమును దైవము స్ఫురింపఁజేయునని సారసేనులు విశ్వసింతురు. ఈస్వామి నక్షత్రగమనపరిశీలన దక్షుఁడనియు నందురు. ఈ మహామ్మదీయప్రాంతమునం దీవిద్య ప్రబలము. ఐనను, పోయిన నాపతాకము గుఱించి ప్రశ్నింపవలసినది—లోయా! అరుదెంచితివా? ఈయున్మత్తాచార్యుని గుఱించి విశేషమేమి?"

"రాజా! ఉన్మత్తుఁడందువా? అట్టి వక్త యింకొకఁడు లేఁడని చెప్పవలయు. ఈ స్థలము వీడిన యనంతర మాతఁడొక యున్నత ప్రదేశమారోహించి సైనికుల కుపన్యసించెను. వాని సామర్థ్య మద్వితీయము. సన్యాసికేకలు విని భయభ్రాంతులై వేనవేలు సైనికులరుదెంచిరి. వా రొకజాతివారు కారు. వారందఱకుఁ దెలియునట్లు వారి వారి భాషలన్నిటియందు నుపన్యసింపుచు నే జాతివారికిఁ దెలుపవలసిన విధమున నా జాతికి బోధపఱచుచు నందఱియందును మతో

త్సాహ మద్భుతముగ రగులఁగొలిపెను."

అంత నృపాలుఁ 'డిట్లు చింతించెను. ఈతఁడు మహోదారుఁడు. ఆ వంశజుఁ డన్యథా యెట్లుండును? తా నొనరించిన దోషము దలంచి యాతఁడు నిరాశావేశమునఁ గడు బాధ పడువాఁడు. జగద్గురువగు పోపు * తోడ సంప్రతించి యాతని పాపము శమింపఁ జేతును."

అంతలో బైరునగరాచార్యుఁ డరుదెంచెనని నృపాలునకు విన్నవించిరి. నృపాలుఁడు రోగార్తుఁడై యుండిన కాలమున సంభవించిన రాజకీయవిషయములు వ్యక్తపఱచుటకును, క్రైస్తవరాజసభ వేఱొక విషయము గుఱించి రహస్యముగ నాలోచించి యేర్పఱచికొనిన యభిప్రాయము నివేదించుటకును నాయాచార్యుఁడు నియోగింపఁబడెను.

## ౧౬

క్రైస్తవరాజ సభాసందేశము వహించినవాఁడు బైరునగరాచార్యుఁ డగుట మేలాయెను. అన్యుఁడాయెనేని, యీ విషయము గదిపినంతనే యాంగ్లరాజు దురంతమగు నాగ్రహముచే మండిపడెడువాఁడు. నేర్పరియగు నాచార్యునకు సహితము కష్టముగనే యుండెను. తురుష్కుల మదమడంచి పాలస్థానముజయించి క్రైస్తవమతోద్ధారకుఁడని ప్రఖ్యాతిగాంచ నాశించియున్న మహాశూరునకు ఘోరముగ నాశాభంగమాయెను.

ఆచార్య సందేశము నందలి సారాంశము గమనింతము. సలాద్దీను

---

* క్రైస్తవజగద్గురు వగు 'పోపును' దైవప్రతినిధిగ నాఁటిజనులు సంభావించుచుండిరి. ఆతఁడు పరిహారపత్రిక యొసంగునేని, దోషియగు మానవుఁడు దోషరహితుఁ డగునని వారు విశ్వసించిరి. రిచర్డువిశ్వాసమును దత్కాలోచితమె.

తన శతజాతులను గూర్చుకొని మహాసైన్యసమేతుఁడై రానుండెను. క్రైస్తవులస్థితి యీ సరికే యపారకరముగ నుండెను. క్రైస్తవనృపాలురు వేర్వేఱు కారణములచేతఁగూడ విముఖులై తమ యుద్యమము విడనాడి తమ తమ దేశములకుఁ బోవుటకుఁ గృతనిశ్చయులై యుండిరి. ఫ్రాన్సుదేశాధీశుఁడగు ఫిలిప్పు వారలకు మార్గదర్శి. ఆతఁడు రిచర్డుపై నభిమానముగలవానివలె నటించుచు, నాతఁడారోగ్యవంతుఁడై యింగ్లాండునకుఁ బ్రయాణమగువఱకుఁ దాను గనిపట్టి యుందునని పలుకుచునే స్వీయదేశనిర్గమ నాభిలాష స్పష్టముగఁ బ్రకటించెను. ఆతని సామంతుఁడగు నొక నాయకుఁడగు గూడ నాతని ననుకరించుటకే నిశ్చయించుకొనెను. ఆంగ్లరాజుచే నవమానితుఁడైన యాస్ట్రియా నృపాలుఁడు లీపాలుఁడుమాత్ర మన్యథాచరించునా ? ధూర్తుఁడగు నాంగ్లనృపాలుని నాయకత్వమున కొడఁబడియుండ నొల్లక యాతఁడును యుద్ధవిముఖుఁడాయెను. తక్కుంగల వారల యభిమతముగూడ నట్టులే యుండెను. ఇఁక నాంగ్లరాజొక్కఁడే మహమ్మదీయ విధ్వంసమునకుఁ గడంగవలయును. యుద్ధప్రియులగు సైనికులాతని సైన్యము జేరవచ్చును. మాంటు సరాటు ప్రభువగు కాన్రేడును, సన్యాసిశూరులునుగూడ నాతనికిఁ దోడ్పడవచ్చును. కాని, వారు మతయుద్ధసమయబద్ధులై మహమ్మదీయులతోడ యుద్ధమొనరింపవలసిన వారలయ్యు, స్వార్థపరులై తామాప్రాంతమున స్వతంత్రరాజ్యములు స్థాపింపవలయునని హేయముగ నాశించి, రిచర్డుమొదలగు నృపాలురు పాలస్థానము జయింపరాదనియే చూచుచుండిరిగదా. అట్టివారలను రిచర్డురాజెట్లు విశ్వసింపఁగలఁడు ?

ఆంగ్లనృపాలునకా విషయములు సువ్యక్తములు. కాన నాతఁడు తొలుత నాగ్రహావేశమున గర్జించినను, ఖిన్నుఁడై, యవనత శిరస్కుఁడై, బంధీకృతభుజుఁడై యాచార్యుని ప్రసంగమునిశ్చలముగ నాలించెను.

'ఇతరనృపాలురు విముఖులగుటకు నీ ధూర్తప్రవర్తన మొక ముఖ్యకారణ' మని యాతఁడల్లన సూచించినను గూడ, నాంగ్లరాజు సహించి యూరకుండెను. అనంతర మాతఁడిట్టులనెను.—

"ఆర్యా! కొన్నియెడల నేను దోషినే యగుదును. ఆ మాత్రపు నేరమున కింతటి ఘోరశిక్షయా? నేను ధూర్తుఁడనని, సన్నిహితమగు మహావిజయము గోల్పోవలయునా? అసంభవము! నేఁ గోల్పోవను. ఇదె నా ప్రతిజ్ఞ!—యెరూసలేము నగరముపైఁ గ్రైస్తవచిహ్నము స్థాపించెదను. లేదేని, రిచర్డు సమాధిపై నయ్యది స్థాపితము కావలయును!"

"నీవు సాధింతువుగాక. కాని, క్రైస్తవ రుధిర మొక్కచుక్కయైనను స్రవింపరాదు."

అట్లు పలుకు నాచార్యుని భావము గ్రహించి, నృపాలుఁడిట్టులనెను. "సంధిగురించి ప్రశంసింతువు—తెలిసినది. కాని, మ్లేచ్ఛుల రుధిరము గూడ స్రవింపరాదు కదా."

"భుజబలము చేతను, నీ యశఃప్రభావముచేతను సలాఉద్దీ నిట్లు సమ్మతింపవలసిన వాఁడగుట శ్రేయోదాయకము కదా.—పవిత్ర సమాధి మనయధీనము జేయవలయు; క్రైస్తవ తైర్థికులు పాలస్థానమునందు సుఖముగా విహరించుట కవకాశముండవలయు; అపాయము వొరయకుండ వారు సురక్షితముగ నుండజాలుటకు బలిష్ఠదుర్గములు నెలకొల్పవలయు; తత్ప్రజాక్షేమమున కంతకంటె ముఖ్యమైనది—రిచర్డునకు ఎరూసలేము నగర 'రాజరక్షకుఁ'డను బిరుదము నొసంగవలయు."

నయనము లసాధారణ వికాసముతోడ దీపింప నాంగ్లనృపాలుఁ డిట్టులనెను.—"ఏమి! నే—నే—నేను పవిత్రనగరమునకు రాజరక్షకుఁడనా! శాత్రవుని జయించియైనను ఇంతకంటె లాభము గాంచుట

యసంభవము—ఈ మనసులేని మిత్రబృందముతోడ నీపాటి సాధించుటయే కష్టము. కాని, పాలస్థానము నందింకను మన యధికారము సలాఉద్దీను నిలుపుకొనును గదా ?”

“రిచర్డునకు సహాధికారియై, స్నేహసమయ బద్ధుఁడై యుండును. వైవాహికసంబంధము నెఱపుటకు వీలగునేని పరాక్రమశాలి యగు రిచర్డునకు సలాఉద్దీను బందుగు కూడనగును.”

“వైవాహిక సంబంధమునవా!”—రిచర్డు విస్మయపడెను. ఐనను, ఆ విస్మయము టైరునగరాచార్యుఁ డనుకొనినంత మిక్కుటముగ వ్యక్తము కాలేదు. “హా! మశ్శోస్నరి మేరీ కావలయు. ఇది స్వప్నమా? నాతోడ నెవ్వరైనఁ జెప్పిరా? ఈజ్వరమువలన నాశిరమింకను బలహీనముగ నున్నది—కలఁగియున్నది. ఇట్టి వైపరీత్యము గుఱించి ప్రసంగించిన వాఁడు స్కాచిశూరుఁడో, హాకీమో, ఎంగాడీస్వామియో?”

“ఎంగాడీస్వామియే కావచ్చును—ఏమన నాతఁ డీసందర్భమునఁ జాల శ్రమపడెను. క్రైస్తవనాయకులు సమరవిముఖులై, తమ పవిత్ర సంకల్పము వలంపక తమతమ దేశములకుఁ బోనుండుట చూచి, ఎంగాడీస్వామివారితోడను మ్లేచ్ఛునితోడను గూడ పలుసారులు సంప్రతించి, క్రైస్తవాశయ మీపాటియైన నెఱవేఱు గదా యని యిట్టి సంధి ప్రసగించెను.”

“ఏమి! మద్బాంధవి నొక మ్లేచ్ఛున కీయవలయునా!” రిచర్డు నయనములు తీక్ష్ణములాయెను. ఆతని యాగ్రహము మఱలింపనెంచి టైరాచార్యుఁ డిట్లులనెను.—

“పోపు సమ్మతింపవలయును. పూజ్యుఁడగు నెంగాడీస్వామియే పోపును సందర్శించి యనుజ్ఞ వడయఁగలఁడు.”

“ఏమి? ముందు మేము సమ్మతింపవలదా?”

నృపాలా! ని సమ్మతిమీఁదనే—నీవు పూర్ణముగ నంగీకరించిన

యనంతరమే.''

"మ్లేచ్ఛుని వివాహామాడుట కంగీకరింతునా?" రిచర్డుస్వరము తిరస్కారము సూచింపక యనుమానగ్రస్తమైనటు లుండెను. "తన యెరపై లఘించు సింహామువలె నేఁ దోలుత నీ తీరమున నుఱికినప్పు డిట్టి సంబంధము గుఱించి కలనైనఁ దలంచితినా! కానిమ్ము. సావధానమనస్కుఁడనై నీ సందేశము పూర్తిగ నాలింతును.''

తన కార్యమంత సులభముగ నుండునని యెఱుంగని యాచార్యుఁడు విస్మయానందకలంగితచిత్తుఁడై యా విషయము గుఱించి యింకను వాకొనెను. అట్టి సంబంధములు స్పెయినుదేశమునందుఁ బ్రాయికముగా సంభవించుచుండెనని యాతఁడు పలికెను. సలాఉద్దీనుతోడ రిచర్డు సంబంధము నెఱపునేని, క్రైస్తవాన్వయమున కపార లాభము ప్రాపించుననియు, నంతకంటెను మహాద్భుతము యెద్దియన—మ్లేచ్ఛరాజు స్వీయమతత్యాగ మొనరించి పవిత్రక్రైస్తవ మతస్వీకార మొనరింప వచ్చుననియు నాతఁడు కడు నావేశముతోడ వాదించెను. ఆంగ్లరాజిట్టు లనెను—"సలాఉద్దీను క్రైస్తవుఁడగునా? ఆతఁ డట్టి యభిలాష వ్యక్తపఱచెనా? అట్టులగు నేని, నిర్వక్ర పరాక్రమౌదార్య గుణవిరాజితుఁ డగు సలా ఉద్దీను, సుల్తానుగాక, యొక పేదమానవుఁ డగుఁగాక—ఆతనికే మదీయసోదరిని భార్యగా నొసంగుదును.''

ఆచార్యుఁ డందులకు స్పష్టముగా బదులాడలేదు.—"సలాఉద్దీను నా బోటి యుపన్యాసకుల ప్రసంగములు శ్రద్ధమెయి నాలించుచుండెను. ఆ వైఖరి గమనింప, కుమతాగ్నిదగ్ధము కావలయు నింధనముం దీసి రక్షించుట సాధ్యమని విశ్వసింతును. మఱియుఁ ద్రికాలవేదియగు ఎంగాడీస్వామి నక్షత్రగమనము బరిశీలించి యిందు దృఢ విశ్వాసము గలిగియున్నాఁడు.''

రిచర్డు చింతాసంక్షుభిత మనస్కుఁడై యవనతవదనుఁడై యిట్లు

లనెను.—

"ఈనృపాలుర జడత్వము నాకును జగిలినటులున్నది. ఎవ్వఁడేని సాహసియై యిట్టి ప్రసంగమెత్తెనేని, వాని నాక్షణమ ఖండించియుందును. మతోద్యోగి యాయెనేని, వానిపై నుమిసియుందును. ఇపుడేలకో యీవిషయము నా కంత విపరీతముగఁ దోఁపకున్నది. క్రైస్తవ నాయకులు పవిత్రశూరధర్మము మఱచి దైవమును విస్మరించి మిత్రద్రోహ మొనరించుటకు సంసిద్ధులుగదా. అటుగాక, ధీరుఁడై, శూరుఁడై, పరాక్రమశాలియగు శాత్రవుని సాభిమానముగ గౌరవింపఁగల మేటి యుదారవంతుఁడై యొప్పు సలాఉద్దీనును సోదరప్రాయునిగఁ బరిగణించి యా సద్గుణ గరిష్ఠునితోడ బాంధవ్య మేల చేయరాదు? ఐనను, శాంతచిత్తుఁడనై క్రైస్తవరాజన్యుల సౌభ్రాతము నిలిపి యుంచుటకు మఱియొక్కసారి ప్రయత్నించి చూచెదను. నా యత్నము భగ్నమగునేని, నీ సందేశము గుఱించి యోచింతము. అంతవఱకు నా యిష్టాయిష్టములు దెలుపఁజాలను. ఆచార్యా! వేళయైనది— క్రైస్తవ రాజసభకు బోదము, రమ్ము. రిచర్డు ధూర్తుఁడు గర్వియనని భావింతువుగదా—ఆతఁ డెంతటి వినయశీలుఁడో, తృణప్రాయముగ, నెంతదీనముగ నుండునో కాంతువు, రమ్ము."

రిచర్డు శీఘ్రముగ వస్త్రధారణ మొనరించి, శిరమున నొక సువర్ణ వలయము తప్ప యితర రాజచిహ్నములు దాల్పకయే పైరునగ రాచార్యునితోడ సభాభవనమునకుఁ బోయెను. క్రైస్తవనాయకులు రిచర్డు కొఱకే నిరీక్షించుచుండిరి.

రాజసభాగార మొక విశాలపటమందిరము. సిలువచిహ్నాదీపితమగు దీర్ఘ కేతన మా ముందు స్థాపితమై యుండెను. శీర్ణశిరోజియు, శీర్ణ వస్త్రయు నగు నొక యబలారూపము క్రైస్తవమత నికృష్టావస్థకు సాక్షీభూతముగ మఱియొక పతాకముపైఁ జిత్రింపఁబడి యుండెను.

క్రైస్తవనాయకులు ప్రసంగవశమున నొకపుడు కోపోద్రిక్తులై తీవ్రముగ బరస్పరదూషణ మొనరించిరు. కావున నన్న్యు లాయా విషయము లరయరా దని యచటి ద్వారపాలకు లప్రమత్తులై పెరవార లా పొలిమేరకు రాకుండ కాచుచుండిరి.

మతయుద్ధ సమయబద్ధులగు రాజన్యులు రిచర్డు రాకకై సభామందిరమున నిరీక్షించుచుండిరి. రిచర్డువైరు లా పాటియాలస్యము సహింపక ఆ యాంగ్లరాజు గర్వాతిశయమున నే యింకను రాకుండెనని నిరసింపఁదొడగిరి. కలుషాత్ములగు నా నాయకులు తమ తమ దోషములు మఱచి, యత్యల్పవిషయములను మహానేరములుగ నుదహరింపుచు నేకకంఠమున రిచర్డునృపాలుని దూషింపఁగడంగిరి. మహాశూరుఁడగు రిచర్డు గుణశాలి, సర్వజనవంద్యుఁడు; క్రైస్తవరాజన్యుల హృదయములకు గూడ సహజముగ నట్టులే స్ఫురించుచుండెను. కాని, వారి చిత్తములు స్వార్థపరత్వ కళంకితము లగుటచేత నిజహృదయ ప్రభూత గౌరవభావము నడంచి, యా మహనీయుని దూషించుటకు వారు సంసిద్ధు లగుచుండిరి.

ఆంగ్లనృపాలు నధికముగ గౌరవింపక, కేవల సామాన్యసభ్యత్వమునకు లోపము లేకుండ, విరసముగ నాతనికి స్వాగత మీయవలయునని క్రైస్తవరాజన్యులు కృతనిశ్చయులై యుండిరి. కాని, యా గంభీరోదారమూర్తిని గాంచినంతనే వారి చిత్తములు విభ్రాంతములాయెను. ఆ మూర్తియు, రోగకారణమున వన్నె దొఱంగిన వదనమును, ఉజ్జ్వల నక్షత్రద్వయమువలె దీపించు గన్నుగవయును గాంచినంతనే, యా మహాపురుషుని యమానుష బలసాహసకృత్యములు చిత్తమున నొక్కసారి ముప్పిరిగొన, నా రాజ కదంబమంతయు నేకాభిప్రాయ ప్రేరితమై నిలుచుండి, రిచర్డు నృపాలునకు సుస్వాగత మొసఁగెను. అసూయాపరుఁడగు ఫ్రెంచి రాజును, క్రోధావమాన ఘూర్ణితుఁడగు

నాస్ట్రి యారాజునుగూడఁ దమచిత్తమై కల్యము మఱచిపోయిరి. "రిచర్డు నృపాలుని దైవము రక్షించుగాక!—పరాక్రమశాలియగు సింహహృదయుఁడు దీర్ఘాయుష్మంతుఁ డగుఁ గాక!—" అని సకలరాజన్యులును గౌరవోత్సాహపూరితహృదయులై యేకకంఠమున నఱచిరి.

మేఘరహితగ్రీష్మప్రభాతమున నుదయించు సూర్యునివలెఁ దన వదనము వినిర్మలముగ సువ్యక్తముగఁ దోఁప, నాంగ్లరాజు వారలం దఱకుఁ బ్రణామము లొనరించి, మతయుద్ధ సమయబద్ధమగు భ్రాతృవర్గమును మగుడఁ గాంచఁగలిగినందులకు సంతసము వెలిబుచ్చి, తోడనే యిటులనెను.—

"మీరు క్రైస్తవాన్వయ క్షేమంకరులరై తత్కార్యసాధనాలోచనాయత్తచిత్తులరై యుండ, నేఁ గాలహరణ మొనరించుట యుక్తము కాకున్నను, నొక్కింత మాటాడఁ గోరెదను"—రాజన్యులందఱు నాసీనులై ప్రశాంతముగ నుండిరి.

"నేఁడొక గొప్ప మతోత్సవము. క్రైస్తవులు పరస్పరనేరములు పరస్పరము నివేదించి పరస్పరస్నేహితులగుట కిది మహాసమయము. ఉదారరాజన్యులారా! రిచర్డు సైనికుఁడు; సైనికుఁడు కార్యశూరుఁడు గాని, మాటలందు నేర్పరి కాఁడు; ఆతని పలుకులు సైనికోద్యోగానుసరసముగ మోటుగ నుండు. కాని, రిచర్డు ధూర్తుఁడని మీరు కార్యవిముఖులగుట పాడిగాదు. ఒకసైనికుఁ డనాలోచితముగఁ బ్రవర్తించెనని, మీరీపవిత్రోద్యమము వీడకుఁడు: అసాధారణ కీర్తిదాయకమగు నీమహాకార్యము పూర్తిగ నిర్వర్తింపకుండ, వెనుకకు మఱలకుఁడు. పాలస్థానము నుద్ధరించుట మీ కవశ్యకర్తవ్యము: రిచర్డుపైఁ గినిసి, ధర్మము త్యజింపకుఁడు. రిచర్డు మీయం దెవ్వనికైన నపచారమొనరించెనేని, యుచిత పరిహారమొనరించుట కాతఁడు సంసిద్ధుఁడు. ఫ్రాన్సు సోదరా! నీయెడ నపరాధమొనరించితినా?"

అట్లు ధారాళముగఁ బ్రశ్నించి యాంగ్లనృపాలుఁడు చాపిన కరం బందుకొని, స్వతంత్రభూపాలున కుచితమగు గంభీరస్వరమున ఫిలిప్పిట్టు లనెను.

"ఫ్రెంచినృపాలుఁడు పరిహారము గోరఁడు. పరాక్రమశాలియగు మదీయ సోదరునిపై ద్వేషమూని యేమేని యొనరించువాఁడఁ గాను. నేనొకవేళ నీయుద్యమమున యథావిధముగఁ బాల్గొనక యన్యథా చరింపవలసి వచ్చునేని, మదీయ రాజ్యపరిస్థితులే యందులకుఁ గారణ మగును."

అనంతర మాంగ్లనృపాలుఁడు ధారాళముగ నాస్ట్రియా నాయకుని డాయ, నాతఁడు తోలుబొమ్మవలె నప్రయత్నముగా నిలుచుండెను.—"ఇంగ్లాండు పరాభవించెనని యాస్ట్రియా భావించును. ఆస్ట్రియా యపరాధమాచరించెనని యింగ్లాండు తలంచును. కావున, మనమిరువురమును క్రైస్తవప్రపంచక్షేమము దలంచి, పరస్పరనేరములు సైరించుకొని, పరస్పరము సఖ్యపడుట వాంఛనీయము. మనయాశయము కడుంగడు నుత్కృష్టము. మన యల్పకలహములు తిరస్కరించుకొని, పవిత్రోద్యమము విడనాడుట యసంబద్ధము. కావున నాంగ్లపతాకము తనవద్ద నుండునేని యాస్ట్రియానృపాలుఁ డిచ్చివేయుఁ గాక: ఆస్ట్రియాపతాకము నవమానించినందుల కనుతాప మందుదును."

ఆస్ట్రియారాజచిత్తము విపరీతముగ సంక్షోభించెను: అవమానానలముచే మానస ముడుకుచున్నను, ఆంగ్లనృపాలుని సౌమ్యగంభీరాలాపము లాలించి సంభ్రమాకులుఁడై మాటాడనేరక యవనతవదనుఁడై యచేతనుఁ డాయెను. అట్టిమౌనము ప్రమాదకరమని యెంచి యెహూసలేము నగరాచార్యుఁ డిట్టులనెను.—

"పతాకాపహరణము గుఱించి తానేమియు నెఱుంగ ననియు, నందుఁ బరోక్షముగఁ గాని ప్రత్యక్షముగఁ గాని తనకెట్టి సంబంధ

మును లేదనియు, నాస్ట్రియారాజు ప్రమాణమాచరించి మాయెదుటఁ దెలిపెను." రిచర్డిట్టులనెను.—

"అట్టులగునేని మేము కడు నపరాధ మొనరించితిమి. ఆస్ట్రియా నృపాలుఁడు క్షమింపవలయునని యర్థింతుము. మన పునస్స్నేహము నకు సాక్షీభూతముగ సత్కారం బొసంగువాఁడ.—ఏమి! మత్సమరాహ్వానమును స్నేహాహ్వానమును గూడ నాస్ట్రియారాజు నిరాకరించునా? యుద్ధమొనరించుటకు, స్నేహ మొనరించుటకును మేము కామా? కానిమ్ము. మేము ధూర్తులమై యొనరించిన దాని కీయవమానము తగిన ప్రాయశ్చిత్తమని గణించి యూరకుందుము."

ఆంగ్లనృపాలుఁ డట్లు కడునుదారముగఁ బలికి, నిరసనము జూపక, గంభీరముగ నాస్ట్రియా నాయకుని వీడెను. ఉపాధ్యాయుని కఠినవీక్షణము మఱలినంతనే సంతసించు బాలకుని చందమున నాంగ్లనృపాల వీక్షణము మఱలినంతనే నాస్ట్రియా నాయకుఁడు సేద దేఱెను. రిచర్డు తక్కుంగలవారి నొక్కొక్కని సంబోధించి తానెవ్వని కెట్టి యపచార మొనరించినను, పరిహారము గోరువా రున్నను దెలుపవలయునని సవినయముగఁ బలికెను. అంతఁ డక్కురియగు 'కాన్రేడు' ఇట్టు లనెను:

"నీపై నెట్టి నేరము మోపువారము కాము. కాని, ఆంగ్లనృపాలుఁడు తానొక్కఁడే యశోపార్జన మొనరించుకొని, యీపవిత్ర సమరమునఁ దామును బ్రతిష్ఠగాంచ నాశించియున్న యితరనాయకుల కేమియు మిగులకుండ చేయుచున్నాఁడు."

ఆవెనుక సన్యాసి శూరనాయకుఁడు లేచి యిట్టులనెను.—

"నృపాలా! తెలుపమంటివి కావునఁ దెలిపెద, నాలింపుము. నే నారోపించు నేరము కాన్రేడుదహరించిన దానివంటిది కాక, తీవ్రతరమైనది. ఈమహాసభయందు నిండఱు రాజన్యులు మౌనము వహించియుండ, నావంటి సన్యాసిశూరుఁడు వాకొనుట యనుచితముగఁ గాన్పించును.

ఇందనేక నీపైఁ గినిసియు, నీయెదుట మాటాడఁజాలక యున్న వారు. పక్షమున నీయెదుటఁ బ్రత్యక్షముగ వారి మనోభావము వ్యక్తప ట వారికి నీకును గూడ క్షేమకరము: ఆంగ్లనృపాలుని పరాక్ర ము నాతఁడు సాధించిన విజయములును మేము కొనియాడుదుము. కాని, రిచర్డు ప్రతిసమయము నందును మాకంటె నధికుని వోలెఁ బ్రవర్తించుట స్వతంత్రరాజన్యులకు దుస్సహము. ధైర్యము నందు, కార్యదీక్షయందు, భాగ్యమునందు, నధికారమునందును నాంగ్లనృపాలుఁడు మేటియని మేమే యంగీకరింతుము గాక. అటు గాక సర్వాధిక్యము నీవాక్రమించినచో, నీమిత్రులమగు మేము యథా స్వాతంత్ర్యము గోల్పోదుము: మాప్రజాళి కాంచుచుండ మాగౌరవాధికారములు కళంకితము లగును. రిచర్డు యథార్థమాలింప నోరెరు గాన నిట్లు చెప్పవలసి వచ్చెను—విస్మయాగ్రహపరుఁడు గాకుండుఁ గాక: మావంటి నిస్సంగుల మొకరియాజ్ఞలకు బద్ధులముగాక కేవల పారమార్థికచింతాపరాయణులమై మన పవిత్రదేవళాధికార విస్తరణము కొఱకును, ఎరకై యిందందు బరిభ్రమించు సైతానును నిరోధించుటకును మాత్రము పాటు పడుదుము. ఈసభాసదులు మోమాటమున మాటాడనేరక యున్నవారు, కాని, వారందఱు మదభిప్రాయబద్ధులనియే నిబ్బరముగఁ జెప్పఁగలను."

అమారీశూరుఁ డట్లు ప్రత్యక్షముగ సూటిగ రిచర్డున నిందింప, నా సభ్యు లంగీకార సూచకముగా గుసగుస లాడిరి. ఆంగ్లరాజవదన మాగ్రహారుణదీపిత మాయెను. చిత్తము క్రోధానల తప్తమైయున్నను, అట్టి యెడఁ తదావేశమున నేమియు నొనరింపరాదనియు, నేమియుఁ దీవ్రముగఁ బలుకరాదనియు నాతఁడు గుర్తించెను. నిజక్రూరవచోఘాతముల నాతేని క్రోధపరవశు నొనరించి యాతనిచేతఁ జిందులు త్రొక్కింపవలయుననియే సన్యాసిశూరుని యభిప్రాయము. చిత్త

మాగ్రహాధీన మగునపుడొక మంత్రము పఠింపు మని యొక యా
చార్యుఁడు రిచర్డున కుపదేశించెను. ఆతఁ డామంత్రము జపించి, యా
గ్రహముడిగి, యారంభమున మాత్రము గాఠిన్యము వహించిన స్వర
మున నాతఁడిట్టు లనెను—

"మా స్వభావము నందలి లోపములను మా సోదరు లింతతీవ్ర
ముగా విమర్శింతురా? మే మొకపుడు కార్యదీక్షాపరులమై మీతోడ
నాలోచించుట కవకాశము గాంచక తత్సమయానుకూలముగ మన
సేనలను శాసించియుందుము. అనాలోచితములగు నిట్టి నా యల్పపు
నేరములు ధర్మాశయబద్ధులరగు మీ హృదయముల నిట్లు గాఢముగ
నాటుకొని యుండునని తలంపనైతిని. నాపైఁ గినిసి ఫలోన్ముఖము
నకు వచ్చిన మహాకార్యము ద్యజింతురని తలంపనైతిని. మీ భుజ
బలమున నెరూసలేమునగరమార్గము నిష్కంటక మొనరించియు,
నిపుడు విముఖులగుదురని తలంపనైతిని. మత్కృతం బగు సేవఁ గాంచి
నా ధౌర్త్యము సైరింతురని చేలనై భావించితిని. ఆహా! తీక్ష్ణసమ
రావసరములందు సేనాముఖంబునను వెనుదిరుగునపుడు కొనయం
దును నుండువాఁడఁ గదా. శత్రుసంహార మొనరించి విజయము
గాంచుస్థలంబుల నేను మత్పతాకస్థాపన మొనరించి తదానందము
మాత్ర మనుభవింపుచుండ, విజయలాభ మన్యులు పంచుకొని యనుభ
వించిరిగాదె? జయించిన నగరము మన్నానూ కింతమైన నేను—
తదాధిపత్యము నేగ్రహింపలేదే. అతిసాహసంపుఁ గార్యములకుఁ బురి
కొల్పితినిగాక—యస్మత్సేనాముఖంబునఁ ద నదరూప సాహసము
తోడఁ బోరాడి మా యొడలి నెత్తురు రణావని నర్పించియుంటిమి.
యుద్ధసరభసంబున నొకవేళ మా సైనికులనే గాక యన్యులను గూడ
శాసించితిఁగాక—వారిని గూడ మా వారినివలెనే నోమి, వారి నృపా
లుర కసాధ్యమగు నాహారౌషధాది పదార్థములు గొని యిచ్చితినే.

కాని, మీ రందఱు విస్మరించిన విషయములు నేను సంస్మరించుట లజ్జాకరము. అంతకంటె, భావికార్యక్రమము గుఱించి విచారింతము గాక—" తదవసరావేశమున వదనము దీపింప నా తేఁడు మగుడ నిట్టు లనెను. "ఆంగ్లనృపాలు నాగ్రహాహంకారములు మీ పవిత్రోద్యమము నిఁక నిరోధింపనేరవు, నేరవు. నా కతంబున నఖిలక్రైస్తవసౌహార్దము భంగపడుట నాకు దుస్సహమని విశ్వసింపుఁడు. అవసరమగునేని, ఈ హస్తమును నా గెండవచేత ఖండించి, మీకు విశ్వాసము గలిగించు టకుసంసిద్ధుఁడను. ఈ సర్వ సేనాధిపత్యమే గాదు, మదీయసేనాధి పత్యముగూడ విడనాడెదను. మీకు నచ్చిన వారిని నాయకులుగా నియోగింతురుగాక. నే నధికార విరహితుఁడనై శూలాయుధుఁడనై సైనికధర్మము నిర్వర్తింతును. అట్లుగాక, మీ కోమలశరీరములకుఁ గవచధారణము బాధాకరమగు నేని, పది పదునైదువేల సైన్యము నా యధీన మొనరించి, మీ రీరణభూమినుండి తొలంగుఁడు,—" ఎరూసలేము నగరసంపాదనము నేన యొనరించి,—" నగరము తన యధీనమై నట్టులే, యందు నిజపతాకస్థాపన మొనరించి నట్టులే యాతఁడు చేతులు సారించెను— "నగరము మదధీనమగు నపుడు, అందు నా పేరు వ్రాయక, తన్మహత్కార్యసాధనోచితమగు నవకా శము నాకు దయచేసిన యుదారక్రైస్తవ రాజన్యుల నామాక్షరములే లిఖియింతును!"

యోధాగ్రేసరుఁడగు నాంగ్లనృపాలుఁ డాపగిది యోధజనోచిత ముగ గంభీరముగ, బలికినంతనే, సభికులు పెక్కండ్రు ప్రబోధము గాంచిరి. చచ్చిన పౌరుషోత్సాహములు మగుడ నలవడెను. అల్ప దోషములు పురస్కరించుకొని యంతటి మహాశూరునిపై రోసి కార్య విముఖులైనందులకు వారు చిన్నవోయిరి. ఒకరిని గాంచి యొకరు పౌరుషోజ్జ్వల చిత్తులైరి. తదావేశమున వారందఱు నేక కంఠమున

"సింహహృదయా! మహాశూరా! మమ్ము నడిపింపుము—ధీరులను శాసించుట కింతకంటె దక్షుఁ డెవ్వఁడు? ఎసూసలేము నగరమునకు మమ్ము నడుపుము. ఇయ్యది దైవసంకల్పము—దైవసంకల్పము! ఈ పవిత్రకార్యమునఁ దోడ్పడువారందఱు ధన్యులు!" అని మేఘగర్జన మొనరింపుచుఁ బిట్టుగఁ గరధ్వానముగూడఁ గావించిరి.

క్రైస్తవనాయక సభాంతరమున నాకస్మికముగాఁ జెలరేగిన యా మహాధ్వాన మాచుట్టుంగావలియుండు నాయుధీయుల కేగాక యచ్చటచట నున్న వివిధసైనిక జనంబులకుఁ గూడ వినవచ్చెను. వా రనేక కారణములచేత నుత్సాహరహితులై యుండిరి. కాని, మహాయోధుఁ డగు రిచర్డు పునరారోగ్యము గాంచి సభాభవనమున కరుదెంచెను. తదనంతర మా తావునుండి విజయధ్వానము వెలువడెను. తోడనే, సైనికులకు నూతనోత్సాహ మంకురింప, వారందఱు బరవశులై యిట్టు లఱచిరి—"దేవళము, దేవళము!—యుద్ధము, యుద్ధము!—శత్రువుల నిప్పుడే తాఁకవలయు! ఇది దైవసంకల్పము, దైవసంకల్పము!"

అవ్వలి కోలాహల మాలించినంతనే నాయకులు ద్విగుణీకృతోత్సాహసంభరితులైరి. ఉత్సాహము లేనివారుగూడఁ దోడివారికి వెఱచి యౌత్సుక్యము నటింపవలసిన వారైరి. యుద్ధవిరామానంతరము వెంటనే శాత్రవనిర్మూల మొనరింపవయునని తీవ్రాలాపము లాడువారలేగాని, వేఱు విధమాడువారలు లేరైరి. తదుచితసన్నాహములు రయమ్మున నొనరింపవలయునని చెప్పఁజొచ్చిరి. సభ ముగిసెను. సభికులందఱు నుత్సాహపూరితులైనట్టులే యుండిరి. కాని, యందు బహుజనోత్సాహము శీఘ్రముగఁ జల్లారెను; కొందఱియెడద నుత్సాహ మసలే లేదు.

అమారీ కాన్రేడులే యుత్సాహశూన్యులని పాఠకులు గ్రహించి

యుందురు. నాఁటి సభ కేవలము బ్రతికూలముగఁ బరిణమించుటచేత వా రెంతయు సంక్షోభించిరి. సన్యాసిశూరుఁ డిట్టులనెను—

"సింహము సాలెపట్టునువలె, రిచర్డు నీ నికృష్టమాయోపాయము లను సులువుగా భేదించునని చెప్పుచునే యుంటిని. ఆంగ్లరాజు మాటాడినఁ జాలును—నాతూలవలయాకృష్టములై వెండియు నట్టులే విడివడు గడ్డిపోఁచలవలె నల్పజ్ఞులగు క్రైస్తవరాజన్యులు గూడ నాతఁ డెటు లాడించిన నటులాడుదురు."

కానేర్రి డిట్లు బదులాడెను—

"పెనుగాలివీచి పోయిన పిదపఁ జెదరిన తృణములు యథానిశ్చలత్వము దాల్చుఁగదా."

"కాని, మఱియొక ప్రమాదము దలంపకుంటివి. ఈ నాయకుల యుత్సాహము చచ్చుఁగాక; ఈ మూఢ నాయకులందఱు దమకుఁ దోఁచినయట్టు లెట్టులో చేయుదురుగాక. అంతమాత్రమున నేమాయె ? ఇపుడు సంధిప్రయత్నములు జరుగుచుండెఁగదా. ఆంగ్ల నృపాలుఁ డట్టి సంధి యేవగించునని నీ వందువు, కాని, యాతఁ డియ్యకొని, తదనుగుణముగా నెరూసలేము నగరమునకు రాజు కావచ్చును."

సన్యాసి శూరుఁ డట్లు తన యనుమానము దెలుప, నాతని యనుచరుఁ డిట్టులనెను.—

"మహమ్మదుతోడు!—క్రైస్తవశపథములు రసహీనములాయెను. అభిమాన ధనుఁడగు రిచర్డు తన సోదరిని మ్లేచ్ఛరాజున కొసంగునా ? అసంభవము. సంధి దుస్సహము కావలయు ననియే యం దిట్టి కుతంత్రము జొప్పించితిని. ఆతఁ డాహవమున జయించినను, సంధివలనైనను ఎటులైనను, నాతఁడీ ప్రాంతమున మనకు రాజగుట సహింపఁజాలము."

అంత సన్యాసిశూరుఁ డిట్టులనెను.

"రిచర్డుస్వభావ మెఱుంగక నీ విట్టి తంత్రము పన్నితివి. నాకుఁ

దెలియును—పైరునగరపుఁ బ్రధానాచార్యుఁడు కొంచెము సూచించెను. నీ వెంతయో కష్టపడి యొనరించిన రెండవతంత్రము—ఆంగ్ల రాజపతాకాపహరణముగూడ నెట్లు విఫలమాయెనో తెలిసెఁగదా. మిత్రమా! నీ తెలివి తెల్లవాఱెను. ఇఁక నేఁ బ్రయత్నింపవలయు. 'చరఘటు' లను నొక మహమ్మదీయ జాతివారినిఁ దెలియుఁగదా?"

"తెలియును. ప్రాణము తెగించి యెంతయైనను జేయఁగల సాహసులు. వారును సన్యాసిశూరులవలె మతసేవాపరాయణులు. కాని, మీకును వారికిని గలభేద మేమన, వారి కార్యదీక్ష నిరంతరాయమానము."

అట్లు కానేరదు తనమిత్రు నధిక్షేపింప నమారీ యిట్టులనెను.

"అపహసించుటకు సమయముకాదు. ఆ చరఘటులలో నొకఁడు మహమ్మదీయ మతమునకు రిచర్డు ప్రధానవిరోధియని యెంచి, కడు క్రోధము వహించి, యాతని ఖండఖండములుగఁ జెండవలయునని నిరీక్షించుచున్నాఁడు."

"బాగు, బాగు."

"మన శూరుఁడొకఁడు వానిని బట్టి బంధించెను. వాఁడు తన దృఢసంకల్పము గుఱించి నాకుఁ దెలియఁబఱచెను."

"వాని సంకల్పము నిరోధించిన వారిని దైవము మన్నించుగాక."

"వాఁడు నా చెఱయందున్నవాఁడు—ప్రపంచముతో వానికి సంబంధము లేదు. కాని కారాగృహము నుండి తప్పించుకొన వచ్చును గదా—"

"ఔను. నిగళవిచ్ఛేద మొనరించి యెందఱు పాఱరు? కావుననే, శ్మశానమే యమోఘమైన చెఱయని యందురు."

"ఈ చరఘటుఁడు విడివడునేని, తన దారుణసంకల్పము మఱువక, వేఁటకుక్కవలెఁ బసిపీడక, పగసాధించును."

యుందురు. నాఁటి సభ కేవలము బ్రతికూలముగఁ బరిణమించుటచేత వా రెంతయు సంక్షోభించిరి. సన్యాసిశూరుఁ డిట్లులనెను—

"సింహము సాలెపట్టునువలె, రిచర్డు నీ నికృష్టమాయోపాయము లను సులువుగా భేదించునని చెప్పుచునే యుంటిని. ఆంగ్లరాజు మాటాడినఁ జాలును—నాతూలవలయాకృష్టములై వెండియు నట్టులే విడివడు గడ్డిపోఁచలవలె నల్పజ్ఞులగు క్రైస్తవరాజన్యులు గూడ నాతఁ డెటు లాడించిన నటులాడుదురు."

కానేరి డిట్లు బదులాడెను—

"పెనుగాలివీచి పోయిన పిదపఁ జెదరిన తృణములు యథానిశ్చలత్వము దాల్చుఁగదా."

"కాని, మఱియొక ప్రమాదము దలంపకుంటివి. ఈ నాయకుల యుత్సాహము చచ్చుగాక; ఈ మూఢ నాయకులందఱు దమకుఁ దోఁచినయట్టు లెట్టులో చేయుదురుగాక. అంతమాత్రమున నేమాయె? ఇపుడు సంధిప్రయత్నములు జరుగుచుండెఁగదా. ఆంగ్ల నృపాలుఁ డట్టి సంధి యేవగించునని నీ వందువు, కాని, యాతఁ డియ్యకొని, తదనుగుణముగా జెరూసలేము నగరమునకు రాజు కావచ్చును."

సన్యాసి శూరుఁ డట్లు తన యనుమానము దెలుప, నాతని యనుచరుఁ డిట్టులనెను.—

"మహమ్మదుతోడు!—క్రైస్తవశపథములు రసహీనములాయెను. అభిమాన ధనుఁడగు రిచర్డు తన సోదరిని మ్లేచ్ఛరాజున కొసంగునా? అసంభవము. సంధి దుస్సహము కావలయు ననియే యం దిట్టి కుతంత్రము జొప్పించితిని. ఆతఁ డాహవమున జయించినను, సంధివలనైనను ఎటులైనను, నాతఁడీ ప్రాంతమున మనకు రాజగుట సహింపఁజాలము."

అంత సన్యాసిశూరుఁ డిట్టులనెను.

"రిచర్డుస్వభావ మెఱుంగక నీ విట్టి తంత్రము పన్నితివి. నాకుఁ

దెలియును—బైరునగరపుఁ బ్రధానాచార్యుఁడు కొంచెము సూచించెను. నీ వెంతయో కష్టపడి యొనరించిన రెండవతంత్రము—ఆంగ్ల రాజపతాకాపహరణముగూడ నెట్లు విఫలమాయెనో తెలిసెఁగదా. మిత్రమా! నీ తెలివి తెల్లవాఱెను. ఇఁక నేఁ బ్రయత్నింపవలయు. 'చరఘటు' లను నొక మహమ్మదీయ జాతివారినిఁ దెలియుఁగదా!"

"తెలియును. ప్రాణము తెగించి యెంతయైనను జేయఁగల సాహసులు. వారును సన్యాసిశూరులవలె మతసేవాపరాయణులు. కాని, మీకును వారికిని గలభేద మేమన, వారి కార్యదీక్ష నిరంతరాయమైనము."

అట్లు కానేరదు తనమిత్రు నధిక్షేపింప నమారీ యిట్టులనెను.

"అపహసించుటకు సమయముకాదు. ఆ చరఘటులలో నొకఁడు మహమ్మదీయ మతమునకు రిచర్డు ప్రధానవిరోధియని యెంచి, కడు క్రోధము వహించి, యాతని ఖండఖండములుగఁ జెండవలయునని నిరీక్షించుచున్నాఁడు."

"బాగు, బాగు."

"మన శూరుఁడొకఁడు వానిని బట్టి బంధించెను. వాఁడు తన దృఢసంకల్పము గుఱించి నాకుఁ దెలియఁబఱచెను."

"వాని సంకల్పము నిరోధించిన వారిని దైవము మన్నించుగాక."

"వాఁడు నా చెఱయందున్నవాఁడు—ప్రపంచముతో వానికి సంబంధము లేదు. కాని కారాగృహము నుండి తప్పించుకొన వచ్చును గదా—"

"ఔను. నిగళవిచ్ఛేద మొనరించి యెందఱు పాఱరు? కావుననే, శ్మశానమే యమోఘమైన చెఱయని యందురు."

"ఈ చరఘటుఁడు విడివడునేని, తన దారుణసంకల్పము మఱువక, వేఁటకుక్కవలెఁ బసివీడక, పగసాధించును."

"ఇఁక జెప్పవలదు. నీ యూహ తెలిసె—భయంకరము. కాని, మన యవసరమిటు లున్నది."

"నీవు భద్రముగ నుండవలయునని హెచ్చరించువాఁడ. ఈ దారుణ కార్య మగునంతనే మహాసంక్షోభ ముత్పన్నమగును. తదవసర క్రోధావేశమున నాంగ్లసైనికు లెవ్వరిపైఁ బడుదురో యెఱుఁగరాదు. ఇందు మఱియొక ప్రమాదమున్నది. నా పరిచారకుఁ డొకఁ డీరహస్య మెఱుంగును, వాఁడు కేవలము మూర్ఖుఁడు. నేఁ జెప్పిన చొప్పున వర్తింపక, వాఁడు స్వతంత్రింపఁ గడఁగును. అట్టి వానిని వదల్చికొనిన బాగుండును. మా పవిత్రశూరశ్రేణి కీ కార్యము సులభసాధ్యము. కాని, యది వలదు. ఆ చరఘుని చెఱయం దొక కటారి యుండ వచ్చును, నా యనుచరుఁ డాహారము గొని యందుఁ బ్రవేశించునప్పు డా బాకుతో వానిని బొడిచి వాఁడు పాఱవచ్చును."

"నీ యుపాయము యుక్తియుక్తముగ నున్నది, కాని—"

"కాని గీనులు యవివేకులకే: బుద్ధిమంతులెన్నఁడు సంశయాత్ములై కార్యవిముఖులుగారు. కృతనిశ్చయులై కార్యమొనరింతురు."

## ౨౦

అమారీ తలపెట్టిన ఘాతుకకార్యము రిచర్డెఱుంగఁడు. తనపైఁ గినిసి, యుద్ధము విరమించి తమ తమ దేశములకుఁ బోనుండిన క్రైస్తవనాయకులు తన యుపన్యాస మాలించి మగుడ రణోత్సాహులగుటచేత నాంగ్లరాజు సంతుష్టాంతరంగుఁడాయెను. ఇఁకనాతఁడు నిజపతాకాపహరణము గుఱించియు, మేరీ కణతులకుఁ గల ప్రణయసంబంధము గుఱించియు విచారింపఁజాలెను. రాణి ప్రధానపరిచారిక యగు

కలశను గొనిరమ్మని యాతఁడు లోయప్రభు నంపెను.

లోయప్రభుని గాంచినంతనే రాజ్ఞీపరిచారికలు భయభ్రాంతలైరి. తా నేమి చెప్పవలయునో యెఱుంగక, కలశకంపితగాత్రయై రాణి నిట్లు ప్రశ్నించెను.—

"దేవీ! ఏమి చెప్పుదును? రాజు మసల నందఱను జంపివేయును."

లోయప్రభు విట్టులనెను—"కాంతా! భయమువలదు. ప్రధాన నేరస్థుఁడగు కణాతుని నృపాలుఁడు క్షమించి, వానిని హాకీమున కొసఁగెను. నీ యెడఁ గాఠిన్యము జూపఁడు.

అంత రాణి యిట్టులనెను—"ఏదియో యొక కథ కల్పింపుము. విషయవిమర్శ యొనరించుటకు రాజునకు వ్యవధిలేదు. అతఁడు బహు కార్య నిమగ్నుఁడు."

మేరీ యిట్లు వారించెను. "యథార్థము యథాక్రమముగ వర్ణింపుము. నీ వట్లు చేయనిచో, ఆ పని నేనే యొనరింతును."

లోయప్రభువు రాణితోఁడ నిట్టు లనెను.—"దేవీ! రాజ సోదరి చెప్పునదే సమంజసము. నీ వేమి చెప్పినను నృపాలుఁడు సానందముగా విశ్వసించును. కాని కలశ భద్రముగ నుండవలయు. అందు ముఖ్యముగా నీ విషయమునందు నృపాలుఁడు శ్రద్ధాళుఁడై విమర్శించును."

సంక్షుభితమానసయగు కలశ యిట్టులనెను—"లోయప్రభు పలుకు నిక్కము. నేనొక యుక్తి యల్లుదుఁగాక; కాని, నృపాలునితోఁడఁ జెప్పుటకు ధైర్యమెక్కడ?"

కావున యథార్థ మెఱిగించుటకే నిశ్చయించుకొని కలశ రాజసముక్షమునకు వెడలెను. ప్రణయబద్ధుఁడగు నృపాలుఁడు తనభార్యను దప్పక సైరించునని యెఱిఁగి, పతాకాపహరణోదంత మంతయు నామె విస్పష్టముగఁ దెలియఁబఱచెను. ఆంగ్లనృపాలుఁ డెంతటి శూరుఁడైనను యెంతటి యుగ్ర స్వభావుడైనను, భార్యపై నమితానురాగము గల

వాఁడు. ఆతఁడు భార్యాకరాధీనుఁడని చెప్పినఁ జెప్పవచ్చును. పిడుగు వంటి ప్రథమక్రోధ మప్పుడే చల్లారిపోయెను. గతజలసేతుబంధనమవి వేకము. కావున, ఆంగ్లనృపాలుఁ డెవ్వరిని శిక్షింపఁ దలంపలేదు. చిన నాఁటి నుండియు రాజాస్థానముల మెలంగినకలశ రాజచిత్తము గ్రహించి, సంతసించి,పిచ్చుకవలెఁ బాటి,రాణి కాసమాచారము తెలిపెను.నృపాలుఁ డనతికాలమున నరుదెంచునని కూడ నామె నివేదించెను. మఱియు నామె యిట్టులనెను—"దేవీ! ఇది యంతయు నీ వినోద ఫలితముగదా.నీ వందుల కనుతాపమందు నట్లు మాత్రము మందలించి, నృపాలుఁ డందఱను క్షమించును."

ఆంగ్లరాజ్ఞి నేదదేఱి యిట్టు లనెను. "ఓసీ! ఇదియా సమాచారము? రిచర్డు మహానాయకుఁడగుఁగాక—ఇందుఁ బరాభూతుఁడు గావలయు, చూడుము."

పరిచారికాముఖమున నృపాలుని హృదయము తెలిసినంతనే, బెరంజేరియా భయ ముడిగి, యానందోత్సాహపూరితచిత్తయై సముచితవస్త్రధారిణియై, నిజహృదయేశ్వరాగమనము నిరీక్షించుచుండెను.

నృపాలుఁ డరుదెంచెను. కాని, కలంగిన దేశము తా నేగునంతనే భయపడి సవినయముగ లోఁబడునని విశ్వసింప నయ్యది యాకస్మికముగఁ దిరుగఁబడునపు డా దేశాధీశుని యవస్థ యెటు లుండునో రిచర్డు నవస్థయు నటులే యుండెను. నవమోహనాంగి యగు రాణి తన యపూర్వవిలాసమహిమంబునఁ దన నాథుని సాధింపవచ్చునని నిబ్బరముగా నుండెను. అనివార్యమగు రాజాగ్రహము చల్లారెనని తెలిసెఁగదా. నృపాలుఁ డరుదెంచి యామెను మందలింపఁ గడంగెను. నేర మొనరించిన రాణి సహింపవలసినదే యైనను, ఆమె యెదురు తిరిగి తా నొనరించినది యొక చిన్న వినోదమని వాదించెను. ఆంగ్ల పతాకరక్షణ మొనరింపుచున్న కణతునిఁ దన గూఢారమునకుఁ గొని

రమ్మని యామె చెప్పలేదు. ఆమాట సత్యమె. రాజ్ఞీ దూతయగు నకటబనుఁడు స్వతంత్రించి యాపని యొనరించెను. పరలోకమునుండి మాత్రము వానిని మఱలింపవలయుననియు, జార్జిదిబ్బనుండి వానిని దింపవలదనియు దాను జెప్పియుంటినని బెరంజేరియా తన నాథుని తోడ నిబ్బరముగాఁ బలికెను. ఆమె యాతెఱఁగున వడివడి నాడుచు నిజవాగ్ధోరణిచే రిచర్డు నోఁగు గట్టివైచుటయేగాక, తానొక యల్ప శూరుని రక్షింపవలయునని ప్రార్థింప నాతఁడు దయారహితుఁడై యాపాటి చెల్లింపలేకపోయెనే యని నృపాలు నధిక్షేపించెను. తన కారణమున నొక సచ్ఛూరుఁడు దుర్మరణ మనుభవింపవలసిన దేగదా యను తలంపామె నిఁక నెల్లపుడు సునిశితముగ బాధించునని యామె విలపించెను. ఏనేర మొనరింపని యాశూరుఁడు వధింపఁబడెనేని, వాఁడు పిశాచరూపమున స్వప్నమందేగాక జాగ్రదవస్థయందుఁ గూడ నిరంతరము దను నంటియుండి విపరీతముగఁ గారించుచుండుఁ గదా యని యా కలకంఠి వెక్కివెక్కి యేడ్చెను.

సుందరాంగి యగు నాంగ్లరాజ్ఞి యావిధమున బాష్పధారార్ద్ర నయనయై విలపించుచుఁ బతి దూషణ మొనరించెను. ఆమె యంత మిక్కుటముగ బరివేదించుటకుఁ గారణ మేమన, దన నాథుఁడు తన కోరిక తప్పక చెల్లించునని యామె విశ్వసించెను. కాని, నృపాలుఁ డాగ్రహావేశమునఁ దనుఁ దృణీకరించి యా శూరుని సంహరించుటకుఁ గృతనిశ్చయుఁడై యుండెను. చిత్త మా కారణమునఁ బరిభవానల తప్తమగుటచేత, నా మానిని యూపగిది విలపించెను.

ఆంగ్లరాజు నవస్థ విపరీతముగ నుండెను. తను నత్యంతము ప్రేమించి, భగ్నపడి, యవిరళబాష్పజలములు విడుచుచు నాక్రోశించు కాంతతో వాదించుట కవకాశము లేకపోయెను. తన యధికారము బురస్కరించు కొని యామెను నుందలించుటకుఁ గూడ వీలు లేకపోయెను. ఇంకఁ

జేయునది లేక తానే పలు సమాధానము లొసఁగి నృపాలుఁ డామెను శాంతపఱుపవలసినవాఁ డాయెను. "దేవీ! కణతుఁడు సజీవుఁడై యున్నవాఁడు. నీ కతంబున వానికిఁ బ్రాణహాని ప్రాపించెనని బాధ పడక నిశ్చలచిత్తవు గమ్ము. దయామయుఁ డగు నరబ్బీవైద్యునకు వాని నొసంగితిని: వాని నాతఁడు చక్కఁగ సాఁకును."

స్కాచిశూరుఁడు జీవించెఁగదా యని రాణి సంతోషింపలేదు. తా నాతనియెదుట మోఁకరించి శూరుని రక్షింపవలయునని ప్రార్థించినపుడు నృపాలుఁడు నిరాకరించెను: ఒక మ్లేచ్ఛవైద్యుని మాట యాతఁడు చెల్లించెను. కాన నామె మగుడ క్రోధఘూర్ణమానమానసయై యాతని నధిక్షేపించెను. నృపాలుఁ డీఁక సహించియుంట కష్టతర మాయెను— "బెరంజేరియా! ఆ వైద్యుఁడు నాప్రాణము రక్షించెను. మత్ప్రాణ దాత యీ శూరునేగాక మతేమి కోరినను, ఇచ్చుటకు నీవు నిరాకరింతువా?"

తన నాథునిపై నింకను నాగ్రహము వహించియుండుట యనుచిత మని యెంచి యా వగలాడి యిట్టు లనెను—

"ప్రాణేశ్వరా! ఆ వైద్యపుంగవు నిటు నొనిరాకపోవు నే. శౌర్య జ్యోతి, ఆంగ్లదేశ ప్రాభవము, మదీయప్రాణము నగు రిచర్డురాజు నుద్ధరింపఁజాలిన యా మహనీయుని గాంచి నా కృతజ్ఞత వ్యక్తపఱచి యుందును."

ఈవిధమునఁ బ్రణయకలహ మంతరించెను. కాని, యెవ్వనినైన శిక్షింపకుండుట న్యాయము గాదు. ప్రధాన నేరస్థుఁడగు కణతుఁడు హకీము కారణమున క్షమింపఁబడెను. శూరుఁడు ప్రమత్తుఁ డగుటకు రాణియే కారణమైనను, ఆమెను శిక్షించుట యసంభవము. రాణిని వీడి మేరీని శిక్షింపఁ బూనుట యసంబద్ధము. ఇఁక నింక మిగిలిన వాఁడు హాస్యాంగుఁ డగు నకటఱనుఁడే. కావున వాఁడే శిక్షార్హుఁ

డాయెను. రాణికి వానిమీఁద విసువు గూడ జనించెను. ఐనను, వానిని గొరడాతో గొట్టింపవలయునని రాజు పలుక, దానే యాపని యొనరించియుంటినని బొంకి వాని నా ప్రమాదమునుండి రాణి రక్షించెను. విరామసమయము ముగియునంతనే క్రైస్తవరాజన్యులు మగుడ రణమాచరింపఁ గృతనిశ్చయులై యుండిరని సలాఉద్దీనుసుల్తానునకుఁ దెలుపవలయును. అతఁడంపిన హాకీము సాహాయ్యమునఁ దా మగుడ నారోగ్యభాగ్యము గాంచినందులకుఁ గృతజ్ఞతాపూర్వకముగా నా సందేశముతోఁ బాటు ఉపాయనములు గూడ సుల్తానునకుఁ బంపవలయునని యెంచి, యీ నికృష్టవ్రాంగులను గూడ—నకటబనుని, వాని భార్యను—నందుఁ జేర్చుటకు రిచర్డు నిశ్చయించెను.

రిచర్డు నాఁడు మఱియొక కాంతను మార్కొనవలసి యుండెను. కాని, యాతఁడొక నిశ్చలచిత్తుఁడు కాఁజాలెను. రాజబాంధవియగు మేరీ సౌందర్యవతియు రాజాదరణయోగ్యయు నై యున్నను, భార్యయు నుపభార్యయును గాదు కదా. కావున నాతఁడు భయపడవలసిన యవసరము లేదు. ఈవైపరీత్యమున కంతకును రాణియే కారణమై యుండ, రాజానుమానము మేరీమీఁదఁ బాఱియుండెను. ఆమెతోడ నేకాంతముగ మాటాడఁగోరి నృపాలుఁ డామె మందిరము ప్రవేశించెను. అయ్యది రాణిగది ప్రక్కనే యుండెను. రాణి పరిచారికలు దవ్వున నొకమూల మోఁకరించి యుండిరి. మేరీ యా పాదమస్తకమొక నల్లనిముసుఁగు దాల్చి, యలంకార రహితయై నిశ్చలచిత్తయై వేచియుండెను. ఏతెంచిన నృపాలునకు సవినయముగ స్వాగతమొసంగి, యనుజ్ఞవడసి యాసీనయై యాతఁడు మాటాడువఱకు నామె మౌనము వహించెను.

రాజామెతోడ జనవుగ సంభాషింపుట యలవాటు; కాని, మేరీ ప్రవర్తనము విరసముగ నుండుటచేత రిచర్డు తొట్రిలి యిటు లనెను.—

"మాసోదరి మాపైఁ గినిసి యున్నది. నీప్రవర్తన మెల్లపుడు నిర్వక్రమని యెఱింగియు ననివార్యమగు పరిస్థితులం బట్టి నిను నవమానింపవలసి వచ్చెను. మానవులు భ్రమనూకృష్టులై ఛాయలు జూచి పదార్థము లనుకొందురు. నన్ను క్షమింతువా!"

"రిచర్డు నారాజరాజు క్షమింపవలయు గాని మఱియొకరు క్షమించుటకు నిరాకరింపఁ గలరా!"

"మత్ప్రియబాంధవీ! ఇంతటి నిశ్చలత యేడ? నీవీపగిది విషాదాయత్తచిత్తవు గానేల? ఈయుసుఁగు క్రొత్తవిధవకును దన ప్రణయింగోల్పోయిన కామినికిని మాత్రమే తగును గాని, నీకుఁగాదు. మేరీ! ఎఱుంగదు గదా, విచారావసరము తొలంగెనని, ఇఁక యథోత్సాహినివి గమ్మా. ఇంక నీవిచార మెందులకు!"

"ఎందులకా? అస్మద్వంశగౌరవ మంతరించి నందులకు."

మేరీ యట్లు వాడిగఁ బలికినంతనే రిచర్డు కుపితుఁడాయెను. ఐనను, సహించుకొని యాతఁడు ప్రశ్నింప, నాకన్నియ యిట్టులనెను.—

"నేరస్థుని శిక్షించుటయో క్షమించుటయో తగునుగాని ప్రఖ్యాతకైస్త్వశూరులను మ్లేచ్ఛశృంఖలాబద్ధుల నొనరించుట యనుచితము. ప్రాణదానమొనరించి స్వాతంత్ర్యవిరహితు నొనరించుట యధర్మము. మరణశిక్ష విధించుట దారుణమైనను, న్యాయమని చెప్పవచ్చును, గాని బానిసనొనరించి దేశభ్రష్టునొనరించుట కేవలము క్రూరము."

"మత్ప్రియబాంధవీ! దూరస్థుఁడగు ప్రణయి ప్రణయికాఁడనియే, వాఁడిఁక లేఁడనియే తలంతువు కాఁబోలు. ఇంతమాత్రమున మించిపోవునది లేదు. లోక మెఱుంగరాని రహస్యము నీప్రియుఁ డెఱుఁగునేని, నీకయ్యది బాధాకరమగునేని, చెప్పుము : పదిమంది రౌతులీక్షణమపోయి వానిని సంహరింతురు."

నృపాలుఁ డట్టు లెక్కసక్కెములాడుటచేత నాతనిసోదరి క్రోధా

రుణవదనుఁడై యిట్టులనెను.—"ఇట్టి యసంబద్ధహేళనము చాలు! క్రోధాతిరేకముల నీవెంతటి యకార్యము నొనరించి యుంటివో యెఱుంగకుంటివి. మన పవిత్రోద్యమమున కాధారభూతమగు నొకమేటి యంగమును ఖండించితివి; ఒక ప్రఖ్యాతక్రైస్తవశూరుని మనబలము నుండి తొలగించి, యూదైవసేవాపరాయణుని మహమ్మదీయుల హస్తగత మొనరించితివి. రాజా! నీవలెనే యనుమానకళంకితులగు తోడినాయకు లేమందురో తలంపవైతివి. తనఖ్యాతి కొఱంతవడునని వెఱచియే, సింహబలుఁడీ శూరాగ్రేసరుని బహిష్కరించెనని నిరసించుట కవకాశ మొసఁగితివి."

"నేనా—నేనా!"—రిచర్డు మానసమొంతయుఁ గలంగెను.—"నాకు మత్సరమా! నారాజత్వ మటుంచి, సాధారణశూరునివలె రంగమున మత్పరాక్రమము బ్రదర్శించి, ఏమానవునకైనను భయపడననియు, నసూయాపరుఁడఁ గాననియు వ్యక్తము చేయుటకు సంసిద్ధుఁడను. మేరీ! నీవిటులు వాకొనుచున్నను, నీచిత్తవృత్తి మఱియొకగతి నున్నది. ప్రియవియోగజనితాగ్రహ విషాదసంక్షుభితమనస్కవై నీబందుగుని దూషింపకుము."

"ప్రియవియోగమా?—కానిమ్ము. నాకతనమున నిట్టి దురవస్థకుఁ బాల్పడినవాఁడు నాప్రియుఁడేయగుఁ గాక. నాకట్టి గౌరవమున కర్హత లేకున్నను, నేనొక దివ్వెవలె శూరజనోచితముగఁ బ్రథితపథంబున నడిపింపఁజాలితిని. నీవు రాజువైననుసరె, మేము పరస్పరగౌరవములు మఱచి చరించితిమనుట యనృతము."

"మత్ప్రియబాంధవీ! నేనటులాడలేదు. రాజపుత్రివైనను, ఉత్తమశూరుని గౌరవింపవచ్చును. నీవు నటులే యొనరించితివి. ఇందు దొసగు లేదు. కాని, ప్రణయవ్యాపారము నేనెఱుంగనిది కాదు. మొదట మూకీభావము—దవ్వుననుండియే వినయగౌరవములు ప్రకటీకృత

మగును. కాని, యవకాశములు చిక్కినపుడు, చనవధికమగును; ఆపై—కాని, ప్రపంచమంతటికంటెను వివేకవంతురాలనని విఱ్ఱవీఁగు నీతో వాదించుట వ్యర్థము.”

“నాకు యశోహాని వొరయని హితమొసంగుదేని, మనసార నాలింతును.”

“రాజు లాజ్ఞాపింతురు: హితమొసంగరు.”

“సుల్తానులు నిశ్చయముగ నాజ్ఞాపింతురు, వారు పాలించువారు బానిసలు గదా.”

“మేరీ! స్కాటునంత యధికముగ మన్నింతువుగదా—సుల్తానుపై గల దురభిప్రాయము మఱల్చికొందువు, గమనింపుము. స్కాటులను బాలించు ‘విలియము’కంటె సలాఉద్దీనే సత్యవంతుఁడు. స్కాటురాజు మనకు సాహాయ్యముగ నొకసైన్య మంపుదునని నమ్మించి, ద్రోహియై మోసపుచ్చెను. స్కాటులు ద్రోహులు. మేరీ! విశ్వాసఘాతుకుఁడగు స్కాటును విస్మరించి, విశ్వాసబద్ధుఁడగు తురుష్కుని గణింపఁగలవు.”

“వలదు, వలదు! మహమ్మదీయమతమును బాలస్థానమునుండి పాఱఁద్రోల నరుదెంచిన రిచర్డు మహమ్మదీయ మతావలంబన మొనరింపకుండుఁ గాక.”

రాజసోదరి యటులనుచున్నను సరకుసేయక, తనమాట యమోఘమని పలికి, రిచర్డు వెడలెను. కాని, తత్ప్రసంగపరిణామ మాతనికిఁ దృప్తికరముగ లేకపోయెను.

కణతుఁడు మ్లేచ్ఛదాసుఁడై మూఁడుదినము లాయెను. నాల్గవ దినము సాయంసమయమున నాంగ్లరాజు సుఖాసీనుఁ డాయెను. ప్రచండ కార్యము దలపెట్టిన రిచర్డునకు యథాజవసత్త్వము లలవడు చుండెను. అట్టి తమతేని కుల్లాసముగొలుప నింగ్లాండు దేశమునుండి యరుదెంచెనో యన, నసాధారణ శీతలానిలములు వీవదొడఁగెను. అచట మఱి

న్వారులేరు. సేనాసంచయ మొనరించుటకు లోయప్రభువు వేఱొక ప్రదేశమునకుఁ బోయెను. యుద్ధసమయ మాసన్నమగుటచేత నితర పరిచారకులు వివిధకార్యనిమగ్నులై యుండిరి. సైనికులప్రమత్తులై సందడులొనరింపు చుండిరి. గుఱ్ఱములాడములు మొదలగు నినుపసామగ్రి తయారుచేయు కమ్మరులు, తదితరులును గూడ మిక్కిలి పాటు పడుచుండిరి. యుద్ధప్రియుఁడగు రిచర్డున కట్టి కలకలము కడుంగడు నానంద మొసంగుచుండెను. భావి విజయసూచకములగు నాయా ధ్వానముల నాతఁడు నిజకర్ణపుటంబున సానందముగాఁ ద్రావుచు విజయకృత్యములు గాంచుచుండ, నొకసేవకుఁ డరుదెంచి, సలాఉద్దీను ఒకదూత నంపెనని విన్నవించెను. అనుజ్ఞాతుఁడై పరిచారకుఁడు వానిని బ్రవేశపెట్టెను.

సలాఉద్దీను సుల్తాను దూత మూపునకు నీగ్రోబానిసవలె నుండెను. కాని, వాని సమున్నతమూర్తియు వైభవాస్పదమగు గాంభీర్యమును జూడ, మసిబొగ్గువలె నల్లగ నున్నను, నీగ్రోజాతికి విరుద్ధముగ నుండెను. కాటుకవంటి నల్లని కురులపైఁ బాలవంటి తెల్లని పాగా యుండెను. మోఁకాలువఱకు నున్న చిఱుతపులితోలు కబ్బా తొడిగి, యాతఁడాపై నొక యంగీ ధరించెను. అందు భుజస్కంధములు మాత్ర మడంగియుండెను. పాదరక్షలు, వెండిపట్టి, వెండి కండకడియములు గూడ నాతఁడు ధరించెను. అనాచ్ఛాదితములగు భుజములు జంఘలును నిబ్బరముగఁ దోఁచుచుండెను. తిన్నని పట్టాకత్తి సాముపొరగప్పిన యొరయందుండి వాని నడుమున వ్రేలాడుచుండెను. దక్షిణహస్తమున నొకచేయీఁటె మెఱయుచుండెను. ప్రశస్తమైన పెద్ద వేఁటకుక్కను బంగారు పట్టుత్రాళ్లతో నల్లిన గొలుసునకుఁ గట్టి దానిని వాఁడు వామహస్తమునఁ బట్టియుండెను.

రాజసన్నిధి కరుదెంచినంతనే తనయాచారముచొప్పున నతివిన

యముతోడ సాష్టాంగ మాచరించి, మోమున భూమి స్పృశియించి, యల్లన లేచి యొక మోకాలుపై నిలిచి, పట్టురుమాలునం దుండిన బంగరువస్త్రమును గూడ విప్పి యందలి సుల్తాను లేఖను వాఁడు సమర్పించెను—

"రాజరాజగు సలాఉద్దీను ఆంగ్లేయసింహమగు రిచర్డురాజునకు వ్రాయున దేమన—మీకు మాతోడి సఖ్యము మాని యుద్ధ మొనరించుటకే సిద్ధపడఁచినట్లు మీ సందేశమువలనఁ దెలిసెను. మదీయ సేనానివహములతోడ మిము దాఁకునపుడు మీ యవివేకము తెల్లము కాఁగలదు. దేవుని ప్రవక్తయగు మహమ్మదును, ఆతని దైవమగు నల్లాయును మన తగవు పరిష్కరింపఁగలరు. నీ వంపిన బహుమాన ములు స్మరణీయములు. అందు, నా యపూర్వప్రహాస్వాంగులను ముఖ్యముగఁ బేర్కొనఁదగును. మేమును నీ కొక బహుమాన మంపితిమి. ఈ నీగ్రోబానిస పేరు జోహాకు. వీని శరీరచ్ఛాయ జూచి నిరసింపరాదు. నల్లనిపండ్లు కడు మధురముగ నుండుఁ గదా. సుప్రసిద్ధయోధుఁడగు రుస్తుమువలె నీ బానిస కడు బలాఢ్యుఁడు: స్వామిభక్తిపరాయణుఁడు: మంత్రివలె నాలోచన నేయుటకు యోగ్యుఁడు. వానితో సంభాషింపఁ జాలు దేని, వాని గుణములు నీకుఁ దెలియఁగలవు. దైవవశమున వానిమాట పడిపోయెను. జోహాకు నీ కచిరకాలమున గొప్ప సేవ యొనరించునని విశ్వసింతుము. పూజ్యుఁడగు మహమ్మదు కృపాతిశయమున నీవు సత్య మరయుదువుగాక. నీ వట్టి ప్రబోధము గాంచవేని, అల్లా నీకుఁ బూర్ణారోగ్యము బ్రసాదించుఁగాక; రణరంగము నందు మన బలాబలములు వ్యక్తమగుఁగాక."

లేఖాపఠనము ముగిసినంతనే రిచర్డు నీగ్రోబానిసను బరికించెను. వాఁడు చేతులు గట్టుకొని, యధోముఖుఁడై ప్రశస్తశిలావిగ్రహము వలె నుండెను. కండరములు చక్కఁగ నేర్పడి పరిపుష్టిగ నుండినవాని

మూర్తి కెంతయు సంతసించి, యాంగ్ల రాజు సామాన్య భాషయం దిట్లు ప్రశ్నించెను—“నీవు మ్లేచ్ఛుఁడవా?”

అందులకుఁ బ్రత్యుత్తరముగా వాఁడు తన శిర మాడించి, వ్రేలు నుదురుపైఁ జేర్చి, క్రైస్తవజనోచితముగ శిలువ నభినయించి, సవినయముగ యథావిశ్వాసత దాల్చెను. రా జిట్టు లనెను—

“నీగ్రో క్రైస్తవుఁడవు గావలయును. ఈ మహమ్మదీయులు నీ నాలుక గోసియుందురు.”

అట్లు కాదని వాఁడు వాలిన తలయూఁపి, చేయి మెత్తి యాకసము జూపించెను.

“గ్రహించితిని. ఇది కేవలము దైవికము, మానవకృతము గాదందువు. కవచాదిపరికరములు శుభ్రము సేయఁగలవా? అవసరమగు నప్పుడు నాకుఁ దొడిగింపఁగలవా?”

నృపాలుఁ డట్లు ప్రశ్నింప, నీగ్రో హర్షసాభిప్రాయముగాఁ దల యూఁచి, చయ్యనఁ బోయి యా వంత వ్రేలాడు చర్మ తనుత్రాణము, శిరస్త్రాణమును నేర్పరివలెఁ బట్టెను. రాజు సంతోషించెను.

“ఓరీ! నీవు పనికివత్తువు. నా యంతఃపురముననే యుండి నను గనిపెట్టికొని యుండుము. రాజాధిరాజగు సలాహుద్దీను బాపిన బహుమానమును సముచితముగ గణించితినని యాతఁడు దెలిసికొనుఁగాక. నీవు మాటాడనేరకుండుట యొకవిధమున మేలె. మదీయరహస్యములు వెల్లడింపఁజాలవు; ఏదియో యసంబద్ధముగ మాటాడి, నన్ను నాగ్రహపరవశు నొనరింపకుందువు.”

నీగ్రో బానిస యంతఁ గృతజ్ఞతాపూర్వకముగాఁ దన మోము నేలఁ దాఁకునట్లు సాష్టాంగ మాచరించి, యనంతరము కొంతదవ్వున నిలిచి ప్రభునాజ్ఞకై వేచియుండెను. ఆతఁ డిట్లనెను—

„నీయుద్యోగ మిప్పుడే యారంభింపవలయు. అల్లదె నా డాలుపైఁ

చిన్నఁబుచ్చఁబడిరి. కాననమునందు సలాఉద్దీను ముఖమున సారింప వలసిన యీ కేడేఁబు మా యిరువురి గౌరవమునవలెనే నిష్కళంకముగ రాజిల్లవలయు.”

అంతలో, 'నెవిల్' యను నాంగ్లశూరుఁ డరుదెంచి యింగ్లాండు దేశమునుండి వచ్చిన లేఖాసంపుటము నృపాలునకు సమర్పించెను.

“ఇంగ్లాండునుండి—మన యింగ్లాండునుండియేనా!”—ఆంగ్లరాజు విషాద నిశ్శ్వాసములఁ డామెను. “తను తేఁడు వ్యాధిగ్రస్తుఁడై కుమిత్రజనమధ్యస్థుఁడై యెట్టి బాధలు పడుచుండెనో మన దేశస్థులెఱుంగరుగదా. హా! ఈ లేఖావృత్తాంతము దుస్సహమే! మా దేశమునఁ గూడఁ గలహములు చెలరేఁగెనా—నెవిల్! పొమ్ము—నే నీవార్తలను బరిశీలించికొనవలయును.”

ఆంగ్లశూరుఁడు వెడలెను. రిచర్డు కడు దుఃఖకరములగు తన దేశ వార్తల పఠియింపఁ దొడఁగెను. రాజసోదరులు పరస్పర కలహనిమగ్నులైరి. వారిరువురును గలసి దేశపరిపాలనాధురంధరులగు నుత్తమాధికారులతోఁ గలహించిరి. జమీందారులు కర్షకులను బీడించిరి. వారు నిగ్రహఁబడుటచేత దేశ మరాజకభూయిష్ఠ మాయెను. తన దేశ మట్టి దురవస్థకుఁ బాల్పడెనని నృపాలుఁ డెంతయుఁ జింతించెను. ఇంగ్లాండు దేశ చిరవైరులగు ఫ్రాన్సు స్కాట్లాండు దేశస్థులు తమ పగ దీర్చుకొనుట కిదియే సమయమని గండెత్తఁగలరు. దేశావస్థ యంత నికృష్టముగ నుండెను. రిచర్డు తత్క్షణ మరుదెంచినగాని యిన్నిగండములు గడియవని యాతని మిత్రులు హిత మొసఁగిరి. అట్టి దుర్వార్తలను బునఃపునఃపఠన మొనరింపుచు నాంగ్లరాజు దురంతబాధితాత్ముఁడై యుండెను. ఆతఁడు శీతలానిలము ననుభవించుటకొఱకు వివృతమైన మందిర బాహ్యద్వారమున సుఖాసీనుఁడై యుండెను. కావలి యున్న యాయుధీయులను గాంచఁజాలియున్నను, నిజమనోభవా

లోచనానలతప్తుఁడైన తేఁడేమియుఁ గానక పూర్తిగ మైమఱచి యుండెను.

క్రొత్తగ నరుదెంచిన నీగ్రోబానిస యొక మూల వెనుదిరిగి, రాజు నియోగించిన పని యొనరించుచుండెను. నృపాలుని డాలు బట్టి జోహాకు కడు మెలఁకువతోడ శుభ్రపఱచుచుండెను. ఈ కేడెము కడు బెద్దది. ఇందు రాజలాంఛనము లేవియు నుండవు. కావున, దుర్గాక్రమణ సమయములందు ముందు నిలుచుట కియ్యది యనుకూలముగ నుండెను. అద్దమువలె నిర్మలముగఁ దళతళలాడునట్టులా డాలును జోహాకు శుభ్రము చేసెను. వాని శ్వాన మన్యులకుఁ గానరాకుండ వాని వెనుక నుండెను.

నృపాలుఁడును నూతనపరిచారకుఁడును నట్లు తమ కార్యములందు నిమగ్నులై యుండిన సమయమున నవ్వల నేమాయెనో యరయుదము. ఒక క్రొత్తపాత్ర రంగమునఁ దోఁచెను. నృపాలుఁడు విచారాక్రాంత చిత్తుఁడై మౌనము వహించి యుండుటచేత నటఁ గావలియున్న భటులు గూడఁ దదనుగుణముగ సందడి సేయక తిరుగాడుచుండిరి. వారు సుమారిరువదిమంది యుందురు. నూతనపాత్ర చల్లగ వారిలోఁ గలసిపోయెను. కొందఱు భటులు జూదమాడుచుండిరి. మఱికొందఱు రానున్న యుద్ధము గుఱించి గుసగుసలాడుచుండిరి. ఇంకను గొందఱు ముసుఁగులు తన్ని నిద్రించుచుండిరి.

అట్లు కావలియున్న యాంగ్లభటులు కనిపట్టకుండ ప్రవేశించిన వాఁడు ముదుసలి తురుష్కుఁడు, అల్పకాయుఁడు. ఎడారులందు నివసించు నొకానొక జాతివారివలె వాఁడు నికృష్టముగ నుండెను. అట్టివారలేగాక, ప్రాచ్యదేశముల నుండు వివిధజాతులవారును, వర్తకులును, వేశ్యలునుగూడ క్రైస్తవ శిబిరముల కరుదెంచుచుండిరి. క్రైస్తవనాయకులు విషయలాలసులై ప్రమత్తులగుటచేత, వారి శిబిరము

లిట్టివారలకు నాలవాలములాయెను. ఈ క్రొత్త వాఁడింతవఱకు మాసిన యాకుపచ్చని పాగా పెట్టుకొని యుండెను. వానిఁగాక యెవ్వఁడో గమనించినంతనే వాఁడు తనపాగా విసరికొట్టును. వెంటనే, కనుబొమలు లేని కండ్లును, గడ్డములేని గడ్డమును బహిర్వ్యక్తములాయెను. అట్టి యాకృతి పరయాచకులు వైతురు. మిణుకు మిణుకులాడు నల్లని చిన్న కండ్లు, అందులకు సరిపోయిన వికారవదనమును జూచినంతనే యాంగ్ల సైనికులు సంతోషపరవశులై వాని చుట్టును మూఁగి యిట్టులనిరి—

"ఓరీ! ఆడుము, గెంతుము. లేదేని, బొంగరమువలె గిఱ్ఱునఁ దిరుగునట్లు మా కంటి నారితోఁ గొట్టఁగలము." తూనీఁగనో పక్షి కులాయముతో పట్టు బాలురవలె నా సైనికులానందపరవశులై యీ తెఱఁగున నఱచిరి.

అట్టిపనుల కలవాటు పడినవానివలె నా మహమ్మదీయుఁడుఁ దిగ్గున లేచెను. వాఁడు ముదుసలియై చివికి చూచుటకుఁ గడు బలహీనముగ నున్నను, గాలిచే గిరిగిరిఁ దిరుగు పండుటాకువలె నతిసులువుగా గిఱ్ఱున నాడెను. వెంట్రుకలు లేని బోడితల మీఁద, దయ్యము తనముష్టితో వానిని వృథముగఁ బడినట్లు, వాని పిలక నిగిడియుండెను. నిక్కముగ వానిని దయ్యమో మఱి యే యమానుషశక్తియో యావేశించినట్టులే యుండెను. లేని యెడల, కాలివేలి కొనయైనను నేలను దాఁకనట్టులా బక్క ముదుసలి యట్టి యపూర్వ పరిభ్రమణము లొనరింపుచు నృత్యముచేయుట యసాధ్యము. ఆ యాట కొక తీరులేదు. ముందుకు, వెనుకకు ప్రక్కకు ఛంగు ఛంగున దూఁకుచు, నెగురుచు, ప్రేక్షకు లెవ్వరు గనిపట్టకుండ వాఁడు క్రమముగా రాజమందిరద్వారము సమీపించుచుఁ గడు పెద్దగంతులు రెండు మూఁడువైచి, యలసి నేలపైఁ బడిపోయెను. ఆ స్థలమునకు నృపాలుని శిబిరద్వారము ముప్పది గజములుండును.

వాఁడు నేలఁబడుట గాంచి యొకఁడు జలమిమ్మని కేకవైచెను. అతి మిక్కుటముగా నలసినవానికి నీరమెందుల కని రెండవాఁ డధిక్షేపించెను. ఈ మ్లేచ్ఛుఁడు క్రైస్తవజనోచితముగా ద్రాక్షరసమారగింప వలయునని మూఁడవవాఁ డనెను.

ఆంగ్లసైనికు లట్లు వాదించుకొనుచు నా పకీరు చుట్టును మూఁగిరి. వాని నొకఁడు లేవదీసెను. మఱియొకఁడు మధుకలశము వాని నోటి కందిచ్చెను. మహమ్మదీయుఁడు మాటాడ నేరకున్నను, మధువు నిషిద్ధమని యెఱిఁగిన వాఁడగుటచేత వలదని చేయూఁపెను. కాని క్రైస్తవసైనికు లంతమాత్రమున వీడువారు కారు. వాని ననేకవిధముల నపహసించిరి. మ్లేచ్ఛుని నోరు బాకుతో విడఁదీసి యందు మధువందీయ వలయునని యొకఁడు పలికెను.

మధుసేవ తనకిఁక తప్పదని కాఁబోలు, మహమ్మదీయుఁడు నోరు తెఱచి యా పెద్ద పాత్రయందలి ద్రవమంతయుఁ ద్రావివైచి, నిట్టూర్పు విడుచుచు దైవము దయామయుఁ డనుకొనెను. తదవసరానందాతిరేకమున సైనికులు నృపాలునిఁ గలంపక గొల్లున నఱచిరి. రాజు వారిని సక్రోధముగా గద్దించెను.

రిచర్డు స్వభావ మెఱింగిన సైనికుల కోలాహలము తత్క్షణము కట్టిపోయెను. ఆ రాజు సాధారణముగా వారితోఁ గలసి మెలసియుండువాఁడైనను, ఒక్కొకప్పుడు మాత్రము సహించువాఁడు కాఁడు. కావున వారు భయకంపితులై తమతోఁబాటు నా మహమ్మదీయునిఁ గూడఁ గొని పోవలయునని ప్రయత్నించిరి. కాని, మధురసము తలకెక్కుట చేతనో, లేక, కడు నలసియుండుట చేతనోగాని యెంత యీడ్చినను వాఁడు కదలలేదు. ఒక సైనికుఁడు తన యనుచరులతో మెల్లగ నిట్లనెను —"మీరు వట్టిమూర్ఖులు—ఈ మ్లేచ్ఛు నిటనుండనిండు—వీని కొఱకు సందడిసేయుచు మనమిచట నాలసింతుమేని, రాజు కోపాధిక

మున మనలను జంపఁగలఁడు. వీఁడొక్క నిమిషమున రాయివలె నిద్రించును. రండు, పోదము."

ఆ సమయముననే, నృపాలుఁడొకఁడు దిరిగి యొక తీక్ష్ణవీక్షణము బఱపెను. సైనికులా క్షణము దవ్వునకుఁ బోయిరి. మ్లేచ్ఛుఁడణుమాత్రము చలింపక శిలావిగ్రహమువలె నిశ్చలముగ నుండెను. ఆ ప్రదేశమంతయుఁ బ్రశాంతముగ నుండెను.

౨౧

ఆంగ్లనృపాలుఁడు యథావిధమున లేఖాపరిశీలన మొనరింపుచుఁ దదాలోచనా నిమగ్నుఁడాయెను. ఆతఁడు ద్వారమున వెనుదిరిగియుండెను. జోహను నామధేయుఁడగు నీగ్రో బానిస యా విధమున డాలు శుభ్రము చేయుచుండెను. సుమారు డెబ్బదిగజముల దూరమున నాయుధీయు లుండిరి. అందుఁ గొందఱు నిలుచుండిరి; కొందఱు పచ్చికపై హాయిగఁ గూర్చుండిరి, మఱికొందఱు మాటాడక యాటలాడుకొనుచుండిరి. సైనికుల వినోదార్థము గెంతి గెంతి, వారి కూర్మి నాతిశయమున బాగుగఁ దాగి, చినిఁగిన బట్టలమూటవలె జీవరహితముగ బడియున్న మహమ్మదీయుఁడా నడుమనుండెను. ఆ ప్రదేశమంతయుఁ గడు నిశ్శబ్దముగ నుండెను.

నీగ్రోబానిస చేతియందలి డాలు కళంకరహితముగ, సుస్నిగ్ధముగ, నద్దమువలె నుండెను. తత్సాహాయ్యమునఁ దన వెనుక నేమగుచుండెనో యాతఁడరయఁ జాలెను. అందుఁ జూచుకొలఁది నాతనివిస్మయ మధిక తరమాయెను. విస్మయమేగాదు; వాఁడు భయాక్రాంత చిత్తుఁడు గూడ నాయెను. చచ్చినట్లు పడియుండిన వింత మ్లేచ్ఛుఁడు మెల్లగఁ దలయెత్తి, కడుభద్రముగఁ జుట్టును బరికించెను. తన జాడ

యెవ్వరు గనిపెట్టలేరని సంతసించి, శిరమువాల్చి, యప్రయత్నముగాఁ గాలునట్లు దొరలి దొరలి నృపాలుని డాయుచు, తన యునికి తెలిసె నేమోయని యనుమానించినపుడు, చచ్చినట్లు నిలిచిపోయెడు సాలె పురుగువలె, వాఁడు నడుమ నడుమ నాగుచుండెను. నీగ్రో పరిచారకుఁడా కారణమున ననుమానగ్రస్తుఁడై, యప్రమత్తుఁడై వాని నరయుచు, దదవసరానుకూలముగ మెలంగుటకు సంసిద్ధుఁడై యుండెను.

మ్లేచ్ఛుఁడు పామువలె, నత్తవలె, నల్ల నల్లనఁ బ్రాఁకి ప్రాఁకి రాజునకుఁ బదిగజములు దూరము జేరినంతనే, చయ్యనలేచి, వ్యాఘ్రమువలె నొక్క యుదుటన లంఘించి, రిచర్డు చెంతకనిలిచి, రయమ్మున బాకు దీసి, క్రూరముగఁ జేయెత్తెను. ఎంతలో నెంతటి ప్రమాదము! బహుసహస్రసైన్యము లుండియుఁ దమ నృపాలు నొక్క యధమాత్ముని బాఱినుండి కాపాడలేక పోయెనే! మహాశూరుఁడగు నాంగ్లరాజు తన సేనామధ్యమున నొక హంతకునిచేఁ దెగటారవలసినదే గదా. ఇట్టి దారుణ సాహసమొనరించినవాఁడు సన్యాసిశూరుఁడగు అమారీ నియోగించిన చరఘుటుఁడే! ఱెప్పవాల్పక డాలువంటు వానిచర్యలను బరిశీలింపుచుండిన నీగ్రో పరిచారకుఁడా క్షణముపోయి, యా దురాత్ముడెత్తిన చేయి యట్టులే గట్టిగఁ బట్టెను. తన కార్యమట్లు భంగపడుట సహింపక వాఁడా బానిసమీఁదనే కసిదీర్చుకొన నెంచి వానినే బొడువఁ గడంగెను. నీగ్రో పరిచారకుఁడు కడు బలవంతుఁడు. వాని భూరిబలముచే జరఘుటుఁడు గొబ్బున నేలపైఁ బడెను. ఐనను, నీగ్రో వానిభుజమున నొక చిన్నగాయము తగిలెను. ఇంతలో నృపాలుఁడు మేల్కాంచి విషయము గుర్తించియు విస్మయపడక, ఆ చెంతనున్న ముక్కాలిపీట సారించి, 'ఓరి శునకమా!' యనుచు నా కంటకుని శిరస్సు తునియలగు నట్లు మోఁదెను. 'అల్లా అక్బరు' అని యఱచి నృపాలచరణముల మ్రోలవాఁడు మరణించెను.

సైనికులంతలో నాయకుజూచి భయవిహ్వలులై సందడినొనరింప, నృపాలుఁడు వారినిట్లు నిందించెను.—"భటులారా! శిబిరరక్షణము చక్కగా నొనరించిరి. తెల్లారి చేయవలసిన పని నేఁడే చేయవలసెఁగా. చాలు! ఈ యసంబద్ధసంరంభము వలదు. చచ్చిన తురుష్కునెన్నఁడు జూడలేదా? ఈ కళేబర మవ్వల బారవేయుఁడు: శిరము ఖండించి, సుల్తానునకు ముఖముచూపి శూలాగ్రమునఁ బ్రదర్శింపుఁడు. వీనిని నియోగించిన దుష్టుఁడు తన దుష్టసంకల్పమెట్లు పరిణమించెనో యెఱుంగుఁ గాక."—నృపాలుఁ డంతలోఁ దనయుని గాంచెను. "ఏమిది? గాయము తగిలెనే—ఈ యాయుధము విషసంకలితము. నా దేహ, బాకు దాచుకొనినంత మాత్రమున నింతటి పృథగాత్రున కింతటి క్షతి యేర్పడుట యసంభవము. సైనికులారా! మీయం దెవ్వఁడేని సమీపించి యీ గాయమునందలి విషము బీల్చివేయుఁడు. విషము రక్తమునఁ గలసిన యపాయకరముగాని పెదవుల కంటినను భయములేదు."

సైనికులు వెఱపెఱుంగని ధైర్యవంతులైనను, తమ నృపాలుఁడే యాజ్ఞాపించుచున్నను, ఈసందర్భమున భయభ్రాంతులై యొకరి నొకరు చూచుచుండ, రిచర్డిట్లనెను.—"ఏమి! మీ యధరములంత కోమలములా, లేక, మృత్యువునకు వెఱచి సంశయించెదరా?"

అట్లు గిరసించు నృపాలునిదృష్టి యెవ్వనిపై బడెనో వాఁడిట్లు బదులాడెను.—"మానవుఁడు చచ్చునని వెఱదీయము. కాని, బజారునందుఁ బశువువలెఁ గ్రయవిక్రయ మొనరింపఁబడు నీగ్రోబానిస కొఱకు నోటితో విషముంటి హీనముగ మరణించుట మాత్రము సహింపను."

"ఫలము దినుమనునంత సులువుగా నృపాలుఁడు విషము బీల్చుమను చున్నాఁడు." అని మఱియొకఁడు గొణఁగెను.

"నేఁజేయ నిచ్ఛగింపని పని యన్యులకుఁ జెప్పను"—నృపాలుఁ డట్లు పలుకుచు, వలదు వలదని సైనికులు హాహాకారము లొనరించి నను సరకుసేయక తన యధరోష్ఠములతోడనే నీగ్రోపరిచారకుని గాయమునందలి విషము బీల్చివైచెను. నృపాలుఁ డట్లు మఱియొక సారి యటు లొనరింపఁబోయెను. కాని, నీగ్రో కలవరపడి, కృతనిశ్చయుఁడై సగౌరవముగా నాతని వారించి తనశరీరముపై నొకవస్త్రము గప్పికొనెను. అవసరమగు నెడల తామే యాపని గావింతుమని యత్యాతురమునఁ బలికి సైనికులు తమతేని బ్రతిమాలిరి. ఆసమయమున కే యరుదెంచిన నెవిల్ యను నుద్యోగికూడ రిచర్డును వారించెను. నృపాలుఁ డిట్టులనెను.—

"అపాయము తొలంగెను. ఈగంద్రగోళ మనవసరము. రక్తము స్రవింపలేదు, గాయ మత్యల్పముగఁ గగిలి యుండును. క్రోధఘూర్ణిత మార్జాలము తన నిశితనఖంబుల నింతకంటె వాడిగ నొప్పించి యుండును. నా గుఱించియా—ప్రమాదము లేదు; ఐనను, ఈ యౌషధము పుకిలింతు. చాలు."

రిచర్డు భూతదయాపరతంత్రుఁడై కృతజ్ఞుఁడునై యటు లొనరించెను. కాని, యొక క్షుద్రునకట్టి సేవయొనరించినందు కాతఁ డొకింత లజ్జించి యుండును. కాని, తన యపాయము గుఱించి యింకను బరామర్శించు నాంగ్లోద్యోగిని గఠినముగ వారించి రాజిట్టులనెను.—

"చాలు!—ఈవిషయమిఁక దలఁప వలదు. వైరులు విషబాణములు ప్రయోగించునపుడు మనసైనికులు మందబుద్ధులై ఢీల్లవడి యుండక యేమిచేయవలయునో గ్రహింతురుగాక. ఓయీ! ఈ నీగ్రోను నీ బసకుఁ గొనిపొమ్ము—నాయభిప్రాయము మాఱెను. వీని కేమి కావలయునో శ్రద్ధగ నరయుము.—రహస్య మిటురమ్ము—ఇటు లున్నను వీనియందు విశేషము గలదు. కావున, శిబిరము వీడకుండ

మాత్రము కనిపెట్టుచు యథేచ్ఛగా నుండనిమ్ము.—మాంసభక్షకులారా! మధుపాన మత్తులారా! ఆంగ్లసైనికాధములారా! ఇయ్యది మీస్వదేశము కాదు. ఈ దేశస్థులు కొట్టుటకు ముందు హెచ్చరింపరు; కుత్తుక లుత్తరించుటకు ముందు కరము కరము గీలింపరు. మన దేశమునందు శాత్రవుఁడు పౌరుషవంతుఁడై విచ్చుకత్తిం జేఁబూని తన శత్రుత్వము బ్రకటించును. ఈదేశమునం దటుగాదు. మేఁకవన్నె బెబ్బులులవలె డాసి శత్రుసంహార మొనరింతురు. కావున మీరప్రమత్తతతో మెలఁగవలయు. మితపాన మొనరించి కండ్లు తెఱచి భద్రముగ నుండుఁడు, లేదేని మీవిశాలోదరములు కీఁచు మనునట్లు లాహారము తగ్గింతును. పొండు, శిబిరరక్షణము శ్రద్ధగా నొనరింపుఁడు.".

సైనికులు భయలజ్జావినమ్రులై తమతమ తావులకుఁ బోయిరి. ప్రమత్తులైన సైనికులను, శిక్షింపకుండుట యనుచితమని 'నెవిలు' చెప్పఁబోయెను. నృపాలుఁ డాతని వారించి యిట్టు లనెను—

"ఓయీ! ఆ విషయ మెత్తకుము. అస్మద్దేశపతాక మపహృతమైనపుడే సహించి యూరకుండి, నా కొదవిన చిన్న ప్రమాదమునకే శిక్షింపవలయునా? మన పతాక మెవ్వరో తస్కరించిరి. లేదేని, యొక విద్రోహి పరాధీన మొనరింపవలయును—వాని రుధిర మింకను స్రవింపలేదే. మిత్రమా! కృష్ణాంగా! నీవు రహస్యవివరణ మొనరింపఁజాలుదని సలాఉద్దీను సుల్తాను తెలిపియున్నాఁడు. ఆంగ్లపతాకమపహరించిన నరాధము నరయఁజాలుదేని, నీ యెత్తు బంగార మొసంగెద. ఏ మందువు?"

నీగ్రో మాటాఁడ నేరఁడు. ఐనను, మూఁగవారలకు సహజమగు విధమున నేమియో బెకబెకలాడి, చేతులు కట్టుకొని, భావగర్భితముగా నృపాలుని దిలకించి వాఁడు శిరము పంకించెను. సంతోషము నాతుర మును జిత్తమున ముప్పిరిగొన నాంగ్లరా జిట్లనెను—

"ఏమి! రహస్యభేదన మొనరింపఁగలవా?"

నీగ్రో మఱల నంగీకారము దెల్పెను.

"కాని, మన యభిప్రాయములు పరస్పర మెట్లు గ్రహింపఁజాలుదుము,—వ్రాయఁగలవా?"

వ్రాయఁగలనని నీగ్రో తలయూఁప, రా జిట్టులనెను—"సేవకులారా! లేఖనా పరికరములు తెండు. ఆహా! నా తండ్రి శిబిరమున సర్వదా సిద్ధముగనుండెనే. ఎచటనున్నవో! సర్వదాహకంబగు సూర్యాతపంబునకు సిరా యెండిపోయె నేమొ. నెవిల్! ఈ నీగ్రో యమూల్యమైన వాఁడుసుమా."

అంత నా యాంగ్లోద్యోగి యిట్లులనెను—

"దేవా! నా యల్పాభిప్రాయము విన్నవింతు జిత్తగింపుము. వీఁడొక మాంత్రికుఁడు గావలయు. మాంత్రికులు పిశాచారాధకులు. వీని హితమాలించుట యపాయకరము—"

"చాలు. హరిణమును బట్టుచున్న జాగిలమునైన వారింపఁగలవు. కాని, యాంగ్ల గౌరవ పునరుద్ధరణోత్సాహి యగు రిచర్డును మాత్రము వారింపఁజాలవు."

నీగ్రో పరిచారకుఁ డంతలోఁ దాను వ్రాయవలసిన సమాచారము వ్రాసెను. వాని చుఱుకుఁదనము జూడ వ్రాఁతయందు నేర్పరివలెనుండెను. మఱియొకటి. వివిధక్రైస్తవదేశస్థులు మహమ్మదీయులును గూడ నెఱింగియుండిన సామాన్యభాషయందే నృపాలుఁ డింతవఱకును మాటాడుచుండెను. కాని, నీగ్రో వ్రాసినది యా బాసకాదు. అట్టి సామాన్యులకుఁ దెలియని ఫ్రెంచిభాషయం దాతఁడు లిఖించెను.—

"జిగీషువగు నాంగ్లనృపాలునకు—దీనాతి దీనాత్మకుఁడగు నీ బానిస వ్రాయువిన్నపమేమన—రహస్యములు ముద్రిత దైవమంజూషసన్నిభములైనను, విజ్ఞానసాధనమునఁ దెఱవనగును. నీ బానిసను

సముచితస్థానమున నిలిపి క్రైస్తవనాయకుల నటఁ బ్రవేశపెట్టుము. నీ కపరాధ మాచరించిన నరాధముఁ డందుండునేని,—వాఁ డేడు ముసుఁగులు వైచికొని యెంత ప్రచ్ఛన్నముగ నున్నను సరే—ముహూర్త మాత్రమునఁ బట్టి, యా ముచ్చు నప్పగింతును."

ఆంగ్లనృపాలుఁ డపరిమితానంద భరితుఁడాయెను—"ఆహా! నీ పలుకు లెంతయు సమయోచితములు. నెవిల్! ఎఱుంగుదుగదా—మనము సేనాపరిశీలన మొనరించు సమయమున, మన దేశమున కొదవిన యగౌరవమునకుఁ బరిహారముగా, మన పతాకము జార్జిదిబ్బమీఁద యథావిధమున నెగురుచుండఁ గ్రైస్తవరాజన్యు లెల్లరు సక్రమముగా సగౌరవముగా సలాము లాచరించుటకు నొడఁబడియుండిరి. పతాకాపహర్తయుఁ దప్పక యరుదెంచును—ఇట్టి మహాసమయమున వెనుదీసిన యెడలఁ దన ద్రోహము వ్యక్తమగుఁ నని తప్పక యేతెంచును. ఈ నల్లవాని నట నుంతము—ద్రోహి పట్టు వడునా—చూతువుగాక."

నృపాలుఁ డంత యుత్సాహకరముగ నుండెను. కాని యాంగ్లోద్యోగి చిత్తమింకను భయానుమాన బాధితమై యుండెను.—"దేవా! ఇందలి ప్రమాదము గమనింపుము. క్రైస్తవనాయకులకు దైవికముగా సఖ్యమేర్పడెను. ఈ నీగ్రోభానిసమాట విశ్వసించి, మానిన గాయములు మగుడ రేఁపెదవా? క్రైస్తవరాజన్యులు నీకుఁ ఘటిల్లిన యవమానమున కనుతాపమంది తత్పరిహారపూర్వకముగా నాంగ్లపతాకమును గౌరవించుట కొడఁబడియుండ, నా సమయమున మగుడఁ గలహబీజములు నాటుట పాడియగునా? మతయుద్ధ దీక్షాబద్ధులై యరుదెంచిన నాయకుల ప్రోల నీవు గావించిన ప్రకటన కియ్యది విరుద్ధమనీ చెప్పవలయు, క్షమింపుము."

అట్లు హితమొనరింపఁ గడంగిన యాంగ్లోద్యోగిని దీవ్రముగ వారించి నృపాలుఁ డిట్టులనెను.—

"నెవిల్ ! ప్రభుభక్తి పారవశ్యమున నుచితా నుచితములు మఱచితివి. మత్పతాకాపహరణ మొనరించిన నరాధము నరయుటకుఁ బ్రయత్నింపవలదా ? నేఁ బ్రయత్నింపనని వానితోఁ జెప్పలేదే. అంతకంటె మద్రాజ్యమును—ప్రాణమునైనఁ ద్యజించియుందును. మత్ప్రకటనలన్నియుఁ దన్నియనుబద్ధములు. ఆస్త్రీయా నృపాలుఁడు ధారాళముగఁ దననేర మొప్పుకొనెనేని, క్రైస్తవభ్రాతృత్వము దలంచి క్షమింతును."

ఆంగ్లోద్యోగి తత్తరంబున నిట్టులనెను.

"కాని, సలాఉద్దీను పంపిన మాయావిని విశ్వసింపనగునా ?"

"చాలు! నీ వొక మేధావంతుఁడ వనుకొందువుకాని, వట్టి మూఢుఁడవు. నా మాట మఱవక వీనిని భద్రముగ నరయుము,—ఇటులున్నను, వీనియందు విశేషము గలదు. ఓయీ, కృష్ణాంగా! నీవు చెప్పిన కార్యమొనరించుటకు సంసిద్ధుఁడవై యుండుము. సాధింతువేని, కోరిన బహుమానము వడయఁగలవు. ఏమి ! వీఁ డింకను వ్రాయునే."

నృపాలుఁడనినట్లు వాఁడు మఱియొక పత్రము వ్రాసి నృపాలున కందిచ్చెను!—"సేవకుఁడు రాజాజ్ఞాబద్ధుఁడు. తదాజ్ఞానిర్వహణమే సేవకుని ధర్మము. సేవకుఁడు బహుమానము గోరఁడు."

నృపాలుఁడు సంతసించి తత్సమయోచితముగాఁ దనయుద్యోగితోడ భాషింప, నీగ్రోబానిస కలవరపడినటు లాయెను. నృపాలుఁడు కనిపట్టెను. ఉద్యోగి యేమియు నెఱుంగఁజాలక యిటులనెను.— "పాపమీ బానిస రాజవీక్షణము భరింపఁజాలక కలంగియుండును. మఱియొకటి కాదు."

ఇంకను లేఖాపఠన మొనరించు నృపాలుఁడా పత్రమును వ్రేలితోఁ గొట్టి యిట్టులనెను.—

"హా! సలాఉద్దీను మత్సోదరికి సందేశ మంపెననియుఁ దానా సందేశము మేరీ కెఱింగించుట కనుజ్ఞ యొసఁగవలయుననియు వీఁడు వ్రాయును. నెవిల్! ఈ పాటి కోరిక కేమందువు?"

"నృపాలా! నీ చిత్తము, నీవెట్లులైనఁ జేయవచ్చును. కాని, నీవే యిట్టి సందేశము సుల్తానున కంపుదేని, మన భటుఁ డాక్షణమ తెగ టారుట తథ్యము."

ఉద్యోగి యీ పగిది బదులాడ, రాజు మగుడ నిటులనెను. "సూర్యాతపతప్తలగు సుల్తానుసుందరులు నా కేడ; తన ప్రభుసందేశ మెఱిఁగించిన యీ నాప్రాణరక్షకుని శిక్షించుట యసంబద్ధము. నెవిల్! నీ కొక రహస్యము దెల్పెద—ఈ నీలమంత్రి యాలించినను బ్రమాదములేదు—మూఁగ గదా.—పదునైదు దినములనుండియు నా యవస్థ విపరీతముగ నున్నది. మంత్రబద్ధుఁడ నేమో యని తోఁచుచున్నది. మంత్రవిముక్తుఁడఁ గావలయు. ఒకఁడొక యుపకార మొనరించునేని, ఆ యుపకారి మఱునిముసముననే గొప్ప యపకార మాచరించు. మఱియు, మహాద్రోహ మొనరించు నపకారి మహోపకార మొనరించి మత్కృతజ్ఞతకుఁ బాత్రుఁడగు. రాజ్యపరిపాలనా ధురంధరుఁడ నగు నా యధికారమెట్లు నిరర్థకమాయెనో చూచితివా? నేరస్థుని శిక్షింపఁజాలను, ఉపకారిని బహూకరింపఁజాలను. నన్నే గ్రహము దాపురించెనో యయ్యది వీడవలయు. ఈ లోపున సుల్తాను సందేశము గుఱించి చెప్పవలసినది యొక్కటె. ఈ కృష్ణాంగుని కోరిక కడు సాహసమైనది: తాఁ బూనుకొనిన రహస్యశోధన మొనరింపఁ జాలునేని, మా దయకుఁ బాత్రుఁడు గాఁ గలఁడు. అంతవఱకు వీనిని సగౌరవముగా నరయవలయు సుమా. మఱియొకటి, రహస్మ స్వామియో, ఉన్మత్తుఁడో, మఱియెవ్వఁడో—ఆ యెంగాడీసన్యాసినితో నే మాటాడ వలయు. వానిని రహస్యముగాఁ బంపుము."

నీగ్రోబానిసకు సన్న యొనరించి, యాంగ్లోద్యోగి వానితోఁబాటు రాజశిబిరమునుండి వెడలెను. నృపాలుని వైఖరి యాతనికి దుర్గ్రాహ్య మాయెను. తా ననుదినము గాంచు రిచర్డు నాఁడాతనికి విపరీతముగఁ గాన్పించెను. తనచిత్త మెట్లులున్న నట్లు రాజు వర్తించుచు. భావో ద్రేక మడంచుట యాతని స్వభావముగాదు. కాన నాతని చిత్తవృత్తి సువ్యక్తము. ఆగ్రహాదిరసము లెంతకాలముండునో చెప్పుట కష్టము గాని యాతని చిత్తవృత్తి మాత్రము విస్పష్టము. ఆతని ప్రవర్తన కేవలము చిత్తగమనము ననుసరించి యుండును. అట్టి నృపాలుఁడీ సమయమున మాత్రము కడు గంభీరముగ, గుట్టుగ నుండెను. ఎంత ప్రయత్నించి చూచినను నృపాలుఁడు నీగ్రోబానిసపై దయగలిగి యుం డెనో వేఱువిధమున నుండెనో యాతనికిఁ దెలియకుండెను. క్రూర కర వాలమునఁ దెగటారవలసిన నృపాలుని వాఁడు రక్షించినచో, వాఁడు విషప్రభావమున మరణింపకుండ నృపాలుఁడు రక్షించెఁ గదా. అంత మాత్రమునఁ దన ఋణము తీఱెనో లేదో యెఱుఁగక నృపాలుఁడు డోలాయమానుఁడై యాసేవకునిఁ దన కప్పగించెనని యాంగ్లోద్యోగి తలంచెను. నీగ్రోపరిచారకునకు ఫ్రెంచిభాష యెట్లు తెలిసెనో కాని, ఆంగ్లేయభాషమాత్రము తెలిసి యుండదని నృపాలుఁడు విశ్వసించెను. ఏమన, తాను తనయుద్యోగితో సంభాషించినపుడు రిచర్డు నీగ్రోను గనిపట్టుచునే యుండెను. తద్భాషా పరిచయమున్నవాఁడు తనకు సంబంధించిన సంభాషణ యాలించియు నిర్వికారముగ నుండుట యసంభవము.

మనమిఁక వెనుకకు మఱలి గతవృత్తాంత మరయవలయును. మత యుద్ధ సమయబద్ధుఁడై యరుదెంచి యద్భుత బలపరాక్రమములు ప్రదర్శించి యశస్సాంద్రుఁడైన స్కాచిశూరుఁడు తుదకెట్లు క్రూరవిధి వశమున బహిష్కృతుఁడై హాకీమునకు దాసుఁడాయెనో పాఠకు లెఱింగియే యున్నారు. చిత్రకలాంఛనుఁ డగు కణతుఁడు తన క్రొత్త స్వామియగు హాకీమువెంట నాతని గుడారమునకుఁ బోయెను. ఆతని యనుచరులందఱు నట జిన్నగుడారములు వైచికొని యుండిరి. స్కాచి శూరుని స్థితి వర్ణనాతీతము. ఉత్తుంగ పర్వతాగ్రమునుండి పడి పుణ్యా వశమునఁ బ్రాణావశిష్టుఁడై తనకెంతటి యపాయము వాటిల్లెనో యెఱుంగనేరక యెట్టులెటులో తనుఁ దా నీడ్చుకొని పోవువాని వలె మనశూరుఁ డుండెను. గుడారము జేరినంతనే కొండొక పరిచారకుఁడు చూపిన మహిషస్నిగ్ధచర్మచ్ఛదంబగు తల్పమున వ్రాలి, నిజకరద్వం ద్వమున మోము మాటుపఱచి, గర్భనిర్భేదనమగునో యనునట్లు శూరుఁడు కడు మూల్గెను. ప్రయాణసన్నాహములు చేయించుచుఁ దన భృత్యవర్గము నాజ్ఞాపించుచుండిన హాకీము తద్విలాప మాలించి, జాలిగొని, యాతని నూఱడింపఁ గడంగెను.

“మిత్రమా! ఊఱడిల్లుము. మాకవీశ్వరుఁ డేమనునో వింటివా— ‘మానవుఁడు ఘోరమానసవికారాధీనుఁడై కుందుటకంటె దయా హృదయుఁడగు ప్రభునాశ్రయించుట మేలు’—కావున, ధైర్యము వహింపుము, నిను దాసునిఁగా గ్రహించిన వాఁడు సోదరునివలె సాఁకు నని యెఱుంగుము.”

హాకీము నౌదార్యము ప్రశంసనీయముగదా. శూరుఁడు కృతజ్ఞతా

పూర్వకముగా మాటాడఁ బ్రయత్నించెను. కాని, చిత్తము వివిధరస ప్రపూర్ణమగుటచేత నాతఁడు మాటాడనేరక యవ్యక్తముగఁ గొంచెము గొణఁగెను. అట్టి సమయమునఁ దా నుపశమింపఁబూనుట యనుచిత మనియాతఁడు గ్రహించెను: రేపటి ప్రయాణమునకు వలయు సన్నాహములు పూర్తికావలయునని తనభటులను మగుడ హెచ్చరించి, భోజనమారగించుటకుఁ దివాస్పై హాకీమాసీనుఁ డాయెను. తదనంతర మాయూపదార్థములు స్కాచిశూరునకుఁ గూడ వడ్డించిరి. తెలవాఱునంతనే ప్రయాణమనియు, మజిలీ చేయుసరికిఁ జాలకాల మగుననియు, కావున భుజింపవలయు ననియు హాకీము బానిస లెంతచెప్పినను, నిజ మనోవ్యథానలతప్తుఁడగు శూరుఁడు వినఁజాలక, చల్లని జలము మాత్రము ద్రావెను.

భోజనానంతరము హాకీము ప్రార్థన యొనరించి నిద్రాపరుఁడాయెను. కాని, శూరునకు నిద్రాసౌఖ్యము సున్నగదా. వివిధ తీవ్రాలోచన లాతని చిత్తమును దహించివేయుచునే యుండెను. అర్థరాత్ర మాయెను. ఆ సమయమున హాకీము కింకరులు సంచలింప నారంభించిరి. వారు మాటాడక, సందడి యొనరింపక, తిరుగాడు చుండిరి. ప్రయాణము కొఱకుఁ దమ సామగ్రి లొట్టియల కెత్తుచుండిరని యాతఁడు గ్రహించెను. మూఁడుగంట లగుసరికి నొక యుద్యోగి యేతెంచి శూరుని లేపెను. ఆతఁడు మాటాడక మహమ్మదీయుని వెంబడించెను. వివిధ భారధురంధరములగు నుష్ట్రములు వెన్నెలయందు వేచియుండెను. భారమింకను బడవలసి యుండుటచేత నొక్కటిమాత్ర మింకను మోఁకరించియే యుండెను.

ఒంటెల కొకింతదూరమునఁ గొన్ని యశ్వములు ప్రయాణసన్నద్ధములై యుండెను. కణతుఁడు లేచుసరికిఁ బరుండియుండిన హాకీము రయమ్మున నరుదెంచి, తనగౌరవమునకుఁ భంగము కలుగని యధిక

లాఘవముతోడ నొకహయము నధిరోహించెను. ఆతఁడు సన్నయొన రింప, మఱియొక యశ్వము శూరునిచెంతకుఁ దేఁబడెను. హాకీము వివిధ క్రైస్తవశిబిరము లతిక్రమింపవలయును. ఆ సమయమున నాతని కపాయము వొరయకుండ మార్గము జూపుటకై యాంగ్లోద్యోగి యొకఁడు వేచియుండెను. అంతలో, వారు విడిసిన గుడారము గూడ నతిశీఘ్రముగ విడఁదీసి భటు లొంటెపై నైచిరి. "జలసమృద్ధంబగు స్థలమున రక్షించు మహాత్ముఁడే యీ మరుస్థలమునఁ గూడ మార్గదర్శకుఁడై రక్షించుఁగాక"—యను భావముగల కొరానుగీత మొకటి హాకీము గంభీరముగా నాలపించినంతనే ప్రయాణ మారంభమాయెను.

హాకీము సపరివారముగాఁ బోవుచుండెను. అందందుఁ గావలి యుండు క్రైస్తవభటులు వారినిఁ బరామర్శించి పోనిచ్చిరి. అన్యమత స్థులను సహింపనేరని కొందఱు మాత్రము మహాత్ముదును దూషింపఁ జొచ్చిరి. ఇట్టులా క్రైస్తవస్కంధావారము గడిచిన యనంతరము హాకీము పరిజనులు సైనికజనోచితముగా వ్యూహము దీఱిరి. ఇరువురో ముగ్గురో యాశ్వికులు ముందుండిరి. ఒకరిద్దఱు వెనుక నప్రమత్తులై యుండిరి. అవసరమగు తావులందుఁ బ్రక్కలను గూడఁ గాచుకొను చుండిరి. కణతుఁ డొకసారి వెనుదిరిగిచూడ గ్రైస్తవకేతనము లవ్యక్తముగ గోచరించెను. ఆహా! తత్పతాకము లాశ్రయించుకొనియే గదా యాతఁ డధికతర యశోవంతుఁడు కా గోరెను! క్రైస్తవశూరాగ్రగణ్యుల గుడారములును—మేరీ యావాసము గూడ గోచరించెను.

తదాలోచనమునఁ గణతుఁడు సహజముగా దుఃఖితాత్ముఁడై యుండ, హాకీము కనిపెట్టి యథావిధమున నిట్టులనెను.—"ముందుకుఁ బ్రయాణమొనరించు వాఁడు వెనుకకుఁ జూచుట యవివేకము.—" ఆ హెచ్చరిక సార్థకమగునట్లు కణతుని యశ్వము ప్రమాదకరముగాఁ ద్రుళ్లెను—శూరుఁడు భూపతనుఁడు గావలసినదె. కాన నాతఁడప్రమ

త్తుఁడై తన తేజిని శాసింపఁ దొడఁగెను. జాగరూకతతోడ ఖలీనము బట్టవలయుఁ గాని యయ్యది నిక్కముగ నుత్తమాశ్వము. హాకీ మిట్లనెను.—

"ఈహాయము సంగతి మానవుని భాగ్యమువంటిది. మానవుఁడత్యధికభాగ్యవంతుఁడగు నప్పుడే దురదృష్టమున కెడమీయకుండ యప్రమత్తుఁడై వివేకముతోడఁ జరింపవలయు. అట్టులే, యీతురంగ మత్యంతజవంబున హాయిగఁ బోవునప్పుడే కాతు క్రిందబడకుండ భద్రముగ నుండవలయు."

భోజనాధికముచేఁ గడుపుతూఁగని వానికిఁ దేనెయైనను నసహ్యకరముగ నుండును. ఆ విధమున నే,పలువిధములగు కష్టములకుఁ బాల్పడి చివికి చివికియున్న శూరునకు మహమ్మదీయ వైద్యుని హితోపదేశములు దుస్సహము లాయెను. అతఁడు చీకాకుపడి యిట్టులనెను.—

"అదృష్టము చంచలమనుటకు నాకు వేఱు తార్కాణమేల—అనుభవైకవేద్యము గదా. అయ్యా, వైద్యుఁడా! మేమిరువురమును మొదలు విఱిగి చచ్చునట్లు నీ యశ్వము పడెనేని నిన్నెంతయు నభినందించి యుందును."

హాకీము కడు నిశ్చలముగ నిట్లు బదులాడెను—"సోదరా! అట్టులనుట యవివేకము. నాదు ప్రాయంపువారువమును నీ కొసఁగి, నీదు ముదుసలి తేజిని నేనేల గ్రహింపరాదని యాలోచించుచుంటివి. కాతు యౌవనవంతుఁ డగునేని తన దార్ఢ్యమువలన వృద్ధాశ్వము నందలి లోపములను సవరించుకొన వచ్చును. అట్టులే యుద్దండజవసత్వసంపన్నమగు యౌవనహాయమును శాసించుటకు వృద్ధజన సహజమగు నిశ్చలచిత్త మవసరము."

ఏలకో శూరుఁడు ప్రత్యుత్తర మీయలేదు. ఎంత యోదార్చినను శూరుఁ డూఱటగాంచక పోవుటచేత విసిగి కాఁబోలు, హాకీమాతని

తోడ నిఁక మాటాడక, తనయనుచరు నొకని జీరి యిటులనెను.—
"హాసేన్! మన ప్రయాణము విస్మరింపఁజేయఁ జాలవా!"

హాసేను నామధేయుఁడు కథకుఁడు గవియునై పేరుగాంచెను. ప్రభు వటు లనినంతనే వాఁ డుత్సాహదీపిత నయనుఁడై యిటు లుపక్రమించెను.—

"జీవితసౌధాధినాథా! అఖిల భూతములను శాసింపఁజాలిన సులేమానుకంటెను గూడ ధిషణాభిరాముఁడవు. ధర్మశీలుఁడవై, యెందే గినను నాశోపశమనము లొడవించు సమర్థుఁడవై వెలయు నీకు గథాగేయములకుఁ గొఱఁత యేమి? పథికునకుఁ దత్ప్రాంతస్థజలయాత్రము నిరంతరము నీరమెట్టు లొసంగునో యట్టులే భవదీయ సేవకుని కథాప్రవాహము గూడ భవదీయవినోదార్థ మొనరింపఁ గలదు."

కథకుఁ డావిధమునఁ దనప్రభు నెంతయు నుగ్గడించి గొంతెత్తి కథ నారంభించెను. అయ్యది శృంగారరసప్రధానము. అందు నింద్రజాలము వీరరసముగూడఁ గలసి యుండెను. పారసీక కవీశ్వర విరచితపద్యభాగములు గూడ నాతఁడు సమయోచితముగా నచ్చటచ్చట నుదహరించుచుండెను. ఉష్ట్రపాలకులును, తదితరులును దప్ప రాఁగల పరిచారకులందఱు నేతెంచి యొకింతదవ్వున వానిచుట్టును మూఁగిరి. కథలెంతయుఁ బ్రీతికరములు. తమ స్వామియెడ వారు భయభక్తియుక్తులై యొక్కింత దవ్వున నుండిరి; కాదేని, వారాయుత్సాహమునఁ గథకుని పైఁ బడి యుందురు.

హాసేను కథాకథన మద్భుతము. మహమ్మదీయు లందఱు మైమఱచి యాలించుచుండిరి. ఆకథయుత్ప్రేక్షాతిశయోక్తులకుఁదావలమై యున్నను, క్రైస్తవశూర జనోచితముగా వీరరససంభరితమై యుండెను. కావున, భాష బాగుగఁ దెలియకున్నను, కణతుఁడు గూడ నాకర్ణించుటకుఁ గుతూహల పడవలసినదె. హాసేను కడు నద్భుత

ముగాఁ గథాగథన మొనరించెను. సమయోచితముగాఁ దన గానకళా నైపుణ్యముజూపి శ్రోతల నానందసాగరమున ముంచివైచెను. ఆతఁ డేరస మొలికించిన నారసమునకుఁ జొక్కి పరవశాత్ములై వారమందా నంద మనుభవించిరి. కథారసప్రేరణమున నవ్వుచు, గేరుచు, నేడ్చుచు నక్కజపడుచు, హాహాకారము లొనరించుచు, వేడి నిట్టూర్పులు విడుచుచు మహమ్మదీయభటులు రెండుగంటల కాలము సందడియొనరించినను, నాలింపనట్టులే శూరుఁడు కడు నిశ్చలముగ నుండెను.

నిజమనోభవాలోచనలచే నుడుకు వానికిఁ గథాశ్రవణ మేడ? ఆనంద మేడ? ఆ సమయమున శునకముయొక్క యార్తస్వరము మందముగ వినవచ్చెను. ఆనందమునఁ బాల్గొనని శూరుఁ డిపుడు చకితుఁడాయెను. అది పంజరబద్ధమై యొక యొంటెను వ్రేలాడుచుండెను. మృగయాకుశలుఁడగు శూరున కయ్యది తనశ్వానమే యని స్ఫురించెను. మఱియు, నయ్యది యుండుండి యాపగిది రోదించుట గాంచి, తన ప్రియశ్వానము తనయునికిఁ బసిపట్టెననియు, బసిపట్టి తను నా చెరనుండి తప్పింపవలయు ననియే దైన్యముగ నర్థించుచుండెననియు శూరుఁడు గ్రహింపఁజాలెను. గ్రహించి, యాతఁ డిట్లు విలపించెను.—

"ఆహా! ఎంత వెఱ్ఱిదానవు! నీకంటె దృఢతరముగ బంధీకృతుఁడైన భాగ్యహీనుఁడు నిన్నెటులు రక్షింపఁ గలఁడు? నీయాక్రందన మాలింపను; దానఁ బ్రకృతదురవస్థ మఱియు దుర్భరమగును...."

ఈవిధముగా రేయియును నరుణోదయకాలమును గూడ నతిక్రమించెను. అనంతర మనంతమగు ప్రాగ్దిశయందు రేఖామాత్రముగా సూర్యబింబము తోఁచెను. మంచుగ్రమ్మిన యా మరుభూమియందుఁ బ్రథమకిరణము మినుకు మినుకు లాడుచు వెలువడినంతనే హాకీము కథకుని దలంపక, మసీదు శిఖరాగ్రమున గర్జించు మతాధికారులవలె నా సైకతస్థలి పిక్కటిల్లునట్లు గంభీర దీనస్వరమున నిట్టు లుద్బోధిం

చెను.—

"దైవమును సంస్మరింపుఁడు! దైవమును సంస్మరింపుఁడు. భగవంతుఁ డేకేశ్వరుఁడై. భగవంతుని సంస్మరింపుఁడు! మహమ్మదు భగవంతుని ప్రవక్త. దైవమును సంస్మరింపుఁడు! కాలము మిమ్ము వీడి పర్విడుచున్నది. దైవమును సంస్మరింపుఁడు! దైవమును సంస్మరింపుఁడు! యుగాంత సమయమునందలి దైవవిచారణావసర మాసన్నమగుచున్నది!"

మహమ్మదీయు లంతఱు నాక్షణమ గుఱ్ఱములనుండి దిగి, మక్కావంకఁ దిరిగి ప్రార్థనయందు నిమగ్నులైరి. ఎడారియందు నీరముండదు కావున నిసుకతోడనే తదవసరకర్మములు వారు నిర్వర్తించిరి. సావేశముగాఁ బ్రార్థించు నా మహమ్మదీయుల గంభీరదీనాలాపములచే నా విశాలప్రదేశము ఘూర్ణిల్లెను. వారి ప్రార్థన శీఘ్రముగా ముగిసెను.

క్రైస్తవుఁడగు కణతునకు మహమ్మదీయుల చెయ్దములు దుస్సహములు. కాని, వారి యావేశ మకలంకమగుటచేత నాతఁ డసహ్యాభావము మఱచి తానును దైవప్రార్థన మొనరించుటకుఁ గుతూహలపడెను. క్రీస్తుజన్మభూమియగు నాసీమ మహమ్మదీయారాధన వలన నపవిత్రవంత మాయెనని యాతఁడు తలంచువాఁడు. అట్టివాఁ డాయవసరమునఁ బ్రార్థించుట కెట్లు పురికొల్పఁబడెనో యాతనికే తెలియకుండెను.

కణతుఁడు మ్లేచ్ఛజనమధ్యస్థుఁడై ప్రార్థన మొనరింపవలసి వచ్చెను. ఐనను, నాతఁడు నిశ్చలాత్ముఁడై దైవమును సంస్మరించెను. నిశితకష్టపరంపరచే సంక్షోభించు శూరునకు భగవద్ధ్యాన మవసరమై యుండెను. దాన నతఁ డూఱట గాంచెను: విధి యేమిపంచిన నటులాచరించుటకును, నెంతబాధించిన నంత సహించుటకును గూడ సంసిద్ధుఁడాయెను.

అంతలో సారసేనులు తమతమ యశ్వము లారోహించి మగుడఁ బ్రయాణమొనరింపఁ దొడఁగిరి. కథకుఁడగు హసేను మఱలఁ గథ సెప్ప నారంభించెను. కాని, వానిశ్రమ నిరర్థకమాయెను. పవ్వఁదవ్వల కేగుచు నప్రమత్తతతోడ మార్గపరిశీలన మొనరింపుచున్న యాశ్వికుఁ డొకఁడు వడివడి నరుదెంచి హాకీమున కేమియో చెప్పెను. తోడనే యాతఁడు నలుగురురౌతుల నంపెను. హాకీముబృంద మిరువది ముప్పది మంది యుందురు. వారంద ఱు ననిమిష నయనులై, తమనాయకుఁ డంపిన చారుల నరయుచు వారేమి సూచింతురోయని తత్తరపాటున నిరీక్షించుచుండిరి. ఇఁక హసేనుకథ వినువారు లేకపోవుటచేతను, దూరమున నేమియో పొడసూపుటచేతను గూడఁ గావలయు, నాతఁ డూరకుండెను. వారంద ఱు నిశ్శబ్దముగాఁ బోవుచుండిరి.

ఇంతవఱకుఁ జిన్నగుట్ట లడ్డముగ నుండుటవలన ముం దేముండెనో వారలకుఁ దెలియకపోయెను. కాని, వాని నతిక్రమించి నంతనే సంశయ నివారణమాయెను. వారినిఁ గలవరపఱచిన కారణము ప్రత్యక్షమాయెను. అనుభవజ్ఞుఁడగు స్కాచిశూరుఁడు పరికించి చూడ నొకమైలు దూరమునకుఁ బైగా నల్లని పదార్థమొండు వడివడి సంచలించుట గాన్పించెను. అదియొక యాశ్వికదళమనియు, దమ దళముకంటె గడు నధికమనియు నాతఁడు గ్రహింపఁజాలెను. సూర్యకిరణము లందుఁ దళతళ మెఱయుటచేత వారు తనుత్రాణాదికములను బూర్తిగఁ దాల్చిన క్రైస్తవసైనికులు గావలయు ననియు స్పష్టమాయెను. మహమ్మదీయులు భయవిహ్వాలులై తమనాయకునిఁ దిలకించిరి. కాని యాతఁడు ప్రార్థనావసరమున నెంత నిశ్చలముగ నుండెనో యిపుడుగూడ నంత నిశ్చలముగ నుండెను. ఐనను, చేయవలసిన ప్రయత్నమాతఁడు సత్వర మొనరించెను. ఆ క్రైస్తవదళమును సాధ్యమగునంత దగ్గఱగ సమీపించి, వారిసంఖ్యను వారి వైఖరిని బరిశీలింప వలయునని హాకీ మిరు

పురను నియోగించెను. కణతుఁడు శూరుఁడు గదా. అపాయము శూరుల నుత్సాహపఱచును. కావున, స్కాచిశూరుఁడు తొంటి ఖేద ముడిగి యుత్సాహవంతుఁడై యప్రమత్తుఁడై హాకీమును గాంచి యిటు లనెను.—"అయ్యది క్రైస్తవాశ్వికదళమువలె నున్నది. నీకు భయ మేల?"

"భయమా! వివేకి భగవంతునకు మాత్రము భయపడును: మఱియు, దుష్టులు తమశక్తికొలఁది దౌష్ట్యమొనరింతురని యెఱింగి యప్రమ త్తుఁడై యుండును."

హాకీమా తెఱంగునఁ బ్రశంసనీయముగఁ బలుక, శూరుఁడు మగుడ నిటులనెను.—"ఇప్పు డింకను యుద్ధవిరామ సమయముగదా. ఆ క్రైస్తవులేల యహితమాచరింతురు?"

హాకీమిట్లు బదులాడెను.—

"వారు సన్యాసిశూరులు. సన్యాసిశూరులు సత్యదూరులు—సమ యము ధర్మము విస్మరించి మహమ్మదీయులను గారింపఁ జూతురు. ఈదురాత్ములను మహమ్మదు నిర్మూలించుఁ గాక! శాంతి సమ యములందుఁ గూడఁ బోరాడుటకు వెనుదీయరు: అసత్యమే వారి ధర్మము. పాలస్థానముమీఁద దండెత్తువా రనేకులు గలరు గదా. వార లౌదార్యమెఱుంగని వారుకారు. రిచర్డుసింహము విజయము గాంచునంతనే శాత్రవుని వీడును: పిట్ట పట్టువడునంతనే ఫిలిప్పు గృధ్రము (ఫ్రెంచిరాజు) పక్షస్ఫాలన ముడుగును: ఆస్ట్రియను భల్లూకము తన యుదరము భారమగునంతనే నిదురించును. కాని, నిరంతరక్షుదార్త ములగు వృకములట్లు గాక, విరామమెఱుంగవు. ఈసన్యాసి సైనికు లట్టివారు. చూచితివా—వారిలోఁ గొందఱుఁ దూర్పుదెస ముందుగఁ బోవుచున్నారు. శీఘ్రతరముగఁ బ్రయాణమొనరించి మనము జల ప్రదేశము చేరకుండ యడ్డివేయుటయే యాదురాత్ముల తలంపు.

కాని యసాధ్యము. ఎడారియుద్ధమునందు వారికంటె నేనెక్కుడు ప్రవీణుఁడను.”

హాకీమట్లు పలికి తన ప్రధానోద్యోగితో నేమియో చెప్పెను. తదనంతర మాతనివైఖరి పూర్తిగ మాఱిపోయెను. అంతవఱకును ధ్యానపరుఁడై, ప్రశాంతచిత్తుఁడై మౌనివలె నుండిన హాకీముపుడు తీక్ష్ణనయనుఁడై దృఢసంకల్పధురీణుఁడై, యుప్రమత్తుఁడై కేవలమొక శూరునివలెఁ దోఁచెను. శూరునిఁ గాంచి యాతఁ డిట్టులనెను.—“నీవు నాప్రక్కనే యుండవలెను సుమా!”

కాని, కణతుని చిత్తముననొకయూహ జనించెను. తత్ప్రేరణమున నాతఁ డిట్టులనెను.—“వారు నాతోడి శూరులు; మతయుద్ధసమయబద్ధులు; క్రైస్తవులు. ఇఁక నీయొద్ద నుండఁ జాలను.”

“మూర్ఖా! వారి స్వభావమెఱుఁగవు: విరామసమయభంగ మొనవకుండ తొలుదొల్త నిన్నే చంపుదురు.”

హాకీమట్లు హెచ్చరింప, శూరుఁ డిట్లు బదులాడెను. —“అది నాయదృష్టము. ఏమైనను, వీలగునంతనే, మ్లేచ్ఛపాశ విముక్తుడనగుదును.”

“అట్లైన, నీవు నన్నంటియుండునట్లు బలాత్కరించెదఁ జూడుము.”

హాకీమట్లనినంతనే కణతుఁ డాగ్రహాపరవశుఁ డాయెను.—“బలాత్కరింతువా! నీవు నా కమితోపకార మొనరించి యుంటివి: నను శృంఖలాబద్ధు నొనరింపఁ జాలియు, నటు లొనరింపవైతివి. నీ విట్టి యుదారవంతుఁడ వగుటచేఁ గాని, కాదేని, నిరాయుధుఁడనైనను, నను బలాత్కరింపఁ జాలవని వ్యక్తపఱచి యుందును.”

“చాలు, చాలు. కాల మమూల్యము. కాలహారణ మొనరింప రాదు.” హాకీమట్లు పల్కుచు, భుజమెత్తి, కఠోరోచ్చస్వనంబున నుద్ఘోషించెను. అదియొక సాంకేతికము. తోడనే, తెగిన హారకుసునం బలి ముత్తెములవలె మహమ్మదీయులు గురుభూమియందనేకదిశలు

విచ్చి పాఱిరి. అనంతర మేమాయెనో కణతుండరయఁజాలక పోయెను. సైనికులు చెదరి పాఱినంతనే, హాకీము శూరుని గుఱ్ఱపుఁబగ్గముం దాఁ బట్టి తన హయము నగలించెను. తోడనే, యా తురంగములు రెండును మెఱపువలె నుఱికి యపూర్వజనంబునఁ బఱుగిడఁ జొచ్చెను. కణ తుఁడు శూరుఁడయ్యు, నట్టి యద్భుతజవం బెన్నడెఱుంగక విభ్రమచే తస్కుఁడాయెను. ఆ యోధజనుఁ డింతకుపూర్వ మనేక జవనాశ్వములు గాంచి యుండెను. కాని, ఈ వారువముముం దయ్యవి కూర్మప్రాయ ముగా నుండెను. శూరునకిపు డూపిరి దీయుటయే కనుంగడు గష్ట ముగ నుండెను. వారువము లిసుకను వెనుక కెగఁదన్నుచుఁ బాఱు చుండెను: ముందున్న మరుభూమిని మ్రింగివేయుచుండి నటు లుం డెను: నిమిష నిమిషమునకొక మైలు తఱిగి పోవుచుండెను: ఐనను, ఆ వారువములు జవసత్వములు గోల్పోవక, యథాసౌలభ్యముతోడ నుచ్ఛ్వాస నిశ్వాసములు గొనుచుండెను. తదపూర్వజవలాఘవములు జూడ నయ్యవి వాయువిహార మొనరించుచుండి నటులుండెను. తద ద్భుతజవోద్భూతవిభ్రమము దప్ప యాశ్వికునకు వేఱు బాధకము లేకపోయెను.

ఇట్టి విపరీతప్రయాణ మొకగంట పైగా సాగెను. శాత్రవులు కడు వెనుకఁ బడిరి. హాకీమపుడు వడి తగ్గించి, యశ్వములను సాధారణ జవమునఁ బోనిచ్చెను. శూరుఁడీ విపరీత జవంబున కోహటించి, కనఁ జాలక, వినఁజాలక, యూపిరి గొనఁజాలక సర్వవిధముల డీలువడి యుండ, హాకీము కేవల పాదచారియై సుఖయాన మొనరించువాని వలె యథానిశ్చల స్వరమున హయముల నుగ్గడింపఁ దొడఁగెను.——

"ఈ యశ్వములు పక్షిజాతిజములు. మాత్రవ క్తయగు మహాత్మ దధిరోహించు తురంగ మొక్కటి వినాజవంబున వీనిని మించినవి కాన రావు. సుగంధద్రవ్య బంధురమును, మేషమాంస సంకలితమును నగు

ప్రసిద్ధసువర్ణధాన్యము వీని యాహారము. ప్రాయము మీఱినను వీని జవము కొఱంత వడదు. శ్రీమంతులు తమ రాష్ట్రములు వెలయిచ్చియైనను ఈ భద్రాశ్వములను గొన నాకాంక్షింతురు. తనకు సన్నిహితుఁడును, ప్రఖ్యాతపూరుషుఁడును, పూజనీయుఁడును నగు 'ఆలీకి' మహమ్మదువారు బహుమానపురస్సరముగా నొక యశ్వము నొసంగ, నద్దానినుండియే యీజాతి ప్రభవించెను. మహమ్మదీయ మతేతరు లింతవఱకు నీజాతి యశ్వము నారోహింపలేదు. పాతికసంవత్సరములు గడచినను నీ హయ మెట్లు నవతారుణ్య జవసత్త్వములతో నొప్పాఱుచున్నదో చూచితివిగదా. వైరిని గవయుటకును, వెనుదిరిగి పాఱుటకును గూడ నత్యంతోపయుక్తములగు నుత్తమాశ్వములను బ్రసాదించిన మహమ్మదు చిరస్మరణీయుఁడు. తనుత్రాణాదిభారధురంధరులగు క్రైస్తవయోధులు తద్భారముననే యలసిపోయెదరు. మమ్ము బాధింపఁగడంగిన యా సన్న్యాసిశునకముల హయములు, పాదము లిసుకలోఁ గూరుకొనిపోవ, నుస్సురుస్సురని యెంతేని బాధపడియుండును. మన యశ్వములు చెక్కుచెదరక, యొక ఘర్మబిందువైనను జెమర్పక, యెంత స్నిగ్ధముగ నెంత శోభాయమానముగా నున్నవో చూడుము."

హకీము ప్రశంస ముగియుసరికి శూరుఁడు సేదదేఱెను. అశ్వము లాతని యభివర్ణనకుఁ దగియుండుట స్పష్టము, అనుభవవేద్యము. ఎడారియుద్ధముల కట్టి హయము లెంతయు నావశ్యకములు. ఐనను, తాను తదంగీకారము వెలుబుచ్చినచో మహమ్మదీయుఁ డింకను గర్వించునని యెంచి కణతుఁడు ప్రసంగము మార్చెను.

వారిపుడు ప్రవేశించిన ప్రాంతము కణతున కపరిచితము కాదు. ఒకయెడ నికృష్టజలరాశియగు మృతసముద్రము; వేఱొకయెడ నిట్టనిలువుగఁ దోఁచు పర్వతపంక్తి; యింకొకయెడ, దద్విశాల మరు

ప్రదేశమునఁ బచ్చగ శోభాయమానముగఁ గాన్పించు రెండుమూడు ఖర్జూరవృక్షములును జూడ నయ్యది తా నొక్కసారి విహరించిన ప్రదేశ మని శూరునకు స్ఫురించెను. ఆ భయదనిర్మక్షరంగమునఁ బరిభ్రమించియే, ‘యిల్దరీము’ ‘షేరుకూాపు’ అను నామములు గల యమీరు నొకని గాంచి, వానితోఁ బోరాడి సగౌరవముగా సఖ్యపడి, తుదకు ‘ఎడారివజ్ర’ మనెడు జలాశయముకడఁ గణతుఁడు హాయిగ విడియఁ జాలెను. ఆతఁడు మగుడ నా రమణీయప్రదేశమే చేరనుండెను. నాలు గైదు నిమిషములలో నా జలస్రావము దృగ్గోచర మాయెను. తోడనే వా రిరువురు నచట హయావరోహణ మొనరించిరి. ఇట సురక్షితముగా విశ్రాంతి గాంచవచ్చునని హాకీము పలికెను. పరిజను లనతికాలమున నరుదెంతురు గాన తమ రాయశ్వముల గుఱించి తలంప నవసరము లేదనియు నాతఁ డనెను.

అనంతరము హాకీము భోజన మమర్చి యిటు లనెను—“మిత్రమా! చింతావిదూరుఁడవై యీలోన భోజన మారగింపుము. మర్త్యుఁ డదృష్టదేవతా కరాధీనుఁడై సుఖదుఃఖము లనుభవించును. కాని, జ్ఞానియు, శూరుఁడును నట్లు తదధీనులుగాక స్వచ్ఛమనస్కులై యుండవలయు.”

తన మానసమునఁ గృతజ్ఞతాభావము ముప్పిరిగొన, శూరుఁడు భుజింపఁబోయెను. కాని, యెట్లు సాధ్యమగును? తొల్లి యాతఁడు క్రైస్తవరాజ సభానియుక్తుఁడై, కంటఁబడిన శాత్రవుని బ్రశంసనీయముగఁ దార్కొని యా తావుననే గదా సగర్వముగ విడిసెను. ఇపుడో! స్వాతంత్ర్యవిరహితుఁడై, మ్లేచ్ఛజనాధీనుఁడై, యధమాధముఁడై యా తావునకే యరుదేఱవలసివచ్చెను. తద్విషయస్ఫురణమునఁ నాతని మానసము గాఢవిషాదాక్రాంత మాయెను. నిరాహారత్వము, నిరుత్సాహము, పథశ్రమమువలనను శరీర మసలే కడు డస్సియుండుటచేత

నయన మెత్తవాతెను; శరీర ముష్ణమాయెను; నిశ్వాసము శీఘ్రతర మాయెను. వాని నాడి పరీక్షించి, హాకీ మిట్లనెను.—

"జాగరణమువలన మానసము వివేకవంత మగును. కాని, స్థూల మగు శరీర మట్లు గాదు. శరీరమునకు విశ్రాంతి యవసరము. నీ విఁక నిద్రింపవలయు. సంజీవిని గలిపిన యౌషధ మిచ్చెద, సేవించి నేద దేఱుము."

తోడనే రమ్యమగు రజతపేటిక యొండు తెఱచి, యందున్న స్ఫటికంపుఁ జిన్న సీసాయందు భద్రపఱచిన నల్లని ద్రవ మొక్కింత హాకీము కాంచనచషకంబున వైచి శూరున కొసంగెను.—

"మానవోపయోగార్థము పరమాత్ముఁడు ప్రసాదించిన వానిలో నిది యొకటి. మానవుఁడు దుర్బలుఁడై దుష్టుఁడై దుర్వినియోగ పఱచునెడ వికటించును. మీ మధుద్రవము వలెనె యిది ప్రబలగుణసమన్వితము: మనుజుని నిద్రాపరు నొనరించి హృదయ భార మపనయింపఁజాలును. కాని, ఎవ్వఁడేని కామాతురుఁడై తత్సేవన మొనరించునేని, శరీరబలమును మేధాబలమును గోల్పోయి నికృష్టావస్థకుఁ బాల్పడును. కాని, నీ కెంతయు నుపచరించుఁగాన నీ యౌషధము నిర్భయముగా సేవింపుము. ఉన్మాదుని చేతి కొఱవి కొంప గాల్చును; కాని, బుద్ధిమంతుఁడా వేడిమి క్రమముగా ననుభ వించునుగదా."

"వైద్యపుంగవా! నీనై పుణ్యము ప్రత్యక్షముగాఁ గాంచియుంటి;— నా కనుమాన మేల—" శూరుఁ డట్లు బదులాడి, నీరమున బోసిన ఆ యౌషధము ద్రావి దుప్పటి గప్పుకొని, నిద్ర నాకాంక్షింపుచు హాకీము చెప్పినచొప్పునఁ గరచరణములు జాఁపి శయనించెను. ఆతఁడు వెంటనే నిద్రాసౌఖ్య మనుభవింపలేదు. తొలుత మనోహరభావము లుదయించెను. అనంతరము, తా నెవ్వరో యింక నెఱింగియుండ, దన

యవస్థ, యూతని స్మృతిపథమునఁ దోఁచెను. తన యవస్థ యొక్క రంగస్థలమునఁ బ్రదర్శింపఁబడునప్పు డెట్టు లుండునో, లేక, శరీరపరిత్యక్తమగు నాత్మ పూర్వానుభవ మెట్లు స్మరించుకొనునో, శూరుని యవస్థయు నట్టులే భయవిషాదరహితముగనుండెను. అట్టిస్మరణ ముత్సాహశూన్యముగదా. శూరుని వర్తమానస్థితి జూడ, భావియు నటులే యుండునని స్ఫురింపక మానదు. ఐనను, ఆతఁడు స్వతంత్రశూరుఁడై యద్భుత బలపరాక్రమములు చూపిన సమయమునఁగూడఁ దలంపరాని భావిసౌభాగ్య మిపు డుదయించెను. ఆతఁ డిపుడు దేశబహిష్కృతుఁడై, హానిసీఁడై, తన ప్రేమైకనిధానమును మగుడ డాయు నవకాశము గానరాక యగౌరవపంకమునఁ బొరలాడుచున్నను, తానచిర కాలమునఁ ద ద్విపత్సాగరము గడచి సుఖింపఁగలనని యానందింపఁజాలెను. చిత్తము క్రమక్రమముగా మేఘావృతమై, సూర్యాస్తమయావసరకిరణవర్ణములవలె మందగింపఁజొచ్చెను, తుద కాతఁడు హాకీము చరణసమీపమున, జీవరహితకళేబరసన్నిభముగ గాఢనిద్రాపరుఁ డాయెను.

## ౨౩

తా నెంతకాలము నిద్రించెనో కనఁతుఁ డెఱుంగఁడు. కాని, యాతఁడు కను విచ్చి చూచినంతనే విభ్రాంతచిత్తుఁ డాయెను. ఆ ప్రదేశమంతయు నపూర్వశోభాయమానముగ నుండెను. ఎడారియందలి జలాశయప్రాంతమున నాతఁడు పచ్చికపై శయనించెఁగదా. ఇపు డా శూరుఁడు భోగుల కను వగునట్లు మృదులతల్పస్థుఁడై యుండెను. ఖర్జూరవృక్షముక్రింద విశ్రమించిన భాగ్యహీనుఁ డిపుడు ప్రశస్తమగు

పట్టువితానముక్రింద నుండెను. ప్రాగ్దేశమునఁ గాలిడినదాది దోమల చేతఁ బీడింపఁబడు శూరుఁ డిప్పుడు మశహారీపరిరక్షితుఁడై యుండెను. ఆతని కవచమును దదంతరమున నుండిన చర్మవస్త్రమునుఁ బోయి, లలితంపు నంబరమును, నాపై శయనయోగ్యమగు పట్టు పుట్టంబును శరీరము నాచ్ఛాదించెను. అదియొక కల యగునా? ఇంద్రజాలమా? తాను నిక్కముగ మేల్కాంచెనో లేదో యని యాతఁ డనిమిషనయనుఁడై చుట్టును బరికించెను. అంతయుఁ దత్సమానవైభవముతో రాజిల్లుచుండెను. సుందరదారునిర్మితమై రజితాచ్ఛాదితమైన కుండిక మజ్జనమునకు సిద్ధముగ నుండెను: అందలి తోయములు సుగంధ బంధురములై తావులు వెదచల్లు చుండెను. నీహారశీతలంబగు మధురపానీయ మాచెంతనే రజితపాత్రయందొక పీఠముపై నుండెను. శూరుఁ డది త్రావి దాహము దీర్చుకొనెను: ఔషధప్రభావ మింకను గొంత మిగిలియుండుటచేత శీతలజలంబుల స్నానమాడి హాయిగ సేద దేఱెను: తదనంతరము, బాహ్యప్రపంచ మెట్లులుండెనో—తానున్న తావువలెనే మాఱెనేమో—కనుఁగొన వలయునని రయమ్మున వస్త్రాచ్ఛాదనమొనరింప నుద్యుక్తుఁ డాయెను. కాని, యాతఁడెంత వెదకినను తన ముదుకదుస్తులు గానరాక, శ్రీమంతులగు నమీరులు దాల్చు నమూల్యవస్త్రములు, వంకకత్తి, బాకును గోచరించెను. కాని, హాకీము ప్రవర్తన దుర్గ్రాహ్యముగ నుండెను. ఆతఁడీ యపూర్వ భోగములేల కల్పింపవలయు? నిర్వ్యాజకారుణ్యమే కావలయు. కాని, యాతనిచిత్తమున నొక యనుమాన ముదయించెను. తాను స్వమతము వీడి మహమ్మదీయ మతావలంబన మొనరింపవలయు ననియే—తను నాకర్షించుటకే హాకీమట్టి రమ్యసన్నాహము లొనరించి యుండు నని శూరుఁ డనుమానించెను. క్రైస్తవులు యుద్ధమునఁ బట్టువడు నపుడు, వారు ధైర్యశాలులును ధీమంతులు నని యెఱింగి, వారి

కమూల్యోపాయనంబు లొసఁగి సలాఉద్దీను సుల్తాను వారిని దనమతమునఁ గలుపుకొనుచుండెను. శూరుఁడావిషయ మెఱుంగును. కాన, దన యనుమానము ధ్రువమని యెంచి, పశ్చాత్తాపపూర్వకముగా సిలువ వైచుకొని, మితాహారము మితపాన మొనరింపుచు భోగములందుఁ దగుల్కొనక యప్రమత్తతతోడ నుండవలయునని యాతఁడు కృతనిశ్చయుఁడాయెను. తాను జుట్టుకొనినవస్త్ర మువ్వలకేగుట కనుచితముగ నుండెను; మఱియు శిరమింకను భారముగ మందముగ నుండెను. కావున శూరుఁడు మగుడ నాతల్పమున వ్రాలి నిద్రాసతీభుజబంధితుఁడాయెను.

కాని, శీఘ్రముగ నిద్రాభంగమాయెను. కుశలసంప్రశ్న మొనరించుటకు హాకీ మరుదెంచి ద్వారమున వేచి, యిటులనెను.—"నేఁ బ్రవేశింపవచ్చునా?—ద్వారము సంవృతమై యున్నది."

శూరుఁ డిపుడు కేవల మొక బానిసయైనను, హాకీమంతటి గౌరవము జూపుట గణనీయము. ఐనను, తనయుపస్థతకు మఱుపునకు రాఁడని తెలుపఁగోరి శూరుఁ డిట్లు బదులాడెను.—"ప్రభువు తనసేవకావాసము జొచ్చుట కనుజ్ఞ యవసరము."

"నేను ప్రభునివలె రానియెడల?" హాకీమట్లు ప్రశ్నింపఁ శూరుఁడిటులనెను.—"వైద్యుఁడు రోగియొద్దకు నిరాఘాటముగా వచ్చును."

"నే నిపుడు వైద్యుఁడఁగూడఁ గాను. కాన నాప్రవేశమున కనుజ్ఞ దయచేయుము."

హాకీము మగుడ నట్లు పలుక, శూరుఁ డిటులనెను.—"మిత్రుఁడవు గదా. మిత్రుఁ డెల్లప్పుడు బ్రవేశార్హుఁడు."

హాకీమింకను సూటిగఁ బలుకఁడాయెను.—"మఱియు ననుజ్ఞ దయసేయవలయు—నేను మిత్రునివలెఁ గూడ రానియెడల?"

కణతుఁ డొకింత విసువున నిటులనెను.—"ఎటు లరుదెంచిన నేమి

నీకు స్వాగతము. నిను వారింపను, వారింపజాలను."

హాకీమిట్లు బదులాడెను.—

"ఇపు డరుదెంచువాఁ డుదారహృదయుఁ డగు భవత్పూర్వవైరి యని యెఱుంగుము."

అటులనుచు నాతఁడు ప్రవేశించెను. కణతుఁడు విస్మయాక్రాంత చిత్తుడాయెను. కంఠము వైద్యునిదే యైనను, మూర్తి యన్యథా గోచరించెను.

ఆ మూర్తియు, వస్త్రధారణమును, ముఖలక్షణములును జూడఁ, దా నానాఁడు మరుస్థలాంతర జలాశయప్రాంతమునఁ బోరాడిన మహమ్మదీయవీరుఁడే—ఇల్డరీమ్—షేకుకూఫే యని కణతుఁడు గ్రహింపఁ జాలెను. ఆతఁడు విభ్రమచేతస్కుఁడై, అయ్యది మాయాదృశ్య మగు నని యనిమిషనయనుఁడై చూచెను. ఆమూర్తి యటులే యుండి యిట్లు భాషించెను—

"ప్రఖ్యాతయోధున కిట్టి విస్మయ మేల? సైనికుఁడు వైద్యము గూడ నెఱుంగవలయు. సమర్థుఁడగు నాశ్వికుఁ డశ్వారోహణమే గాక తచ్చికిత్సయు నేర్వవలయు. కృపాణధారి తన్నిర్మాణము గూడ నభ్యసింపవలయు. శస్త్రాదిధారణ మొనరించువాఁడు తత్సంస్కారము నరయవలయు. మఱియు, రణరంగమున శాత్రవులను క్షతగాత్రుల నొనరించు యోధుఁడు తచ్చికిత్సానైపుణ్యము గూడ గ్రహించి యుండవలయు."

ఆ పలుకు లాలింపుచు శూరుఁడు పలుసారులు నయననిమీలన మొనరించెను. కనులు మూయునపుడు, ఉన్నతమగు టోపీ ధరించిన హాకీము మూర్తియే స్మృతిపథమునఁ దోఁచుచుండెను. కాని, కను విచ్చి చూడఁ గాన్పించునది వేఱొకమూర్తి. మణిమయోష్ణీషము, రజతవిరాజిత తనుత్రాణము, సముచితశ్మశ్రువు, వికసితవదనమును

యోధజనోచితముగ నుండెను. ఆతఁడు మగుడ నిటు లనెను.—

"ఇంకను నాశ్చర్యమా? లోకసంచార మొనరించియు, మానవులు తమ యాకృతికి భిన్నముగ నుందురని గ్రహింపఁజాలకపోతివి గదా. నీ విషయము దెలంపుము. నీవు నీవందువా?"

శూరుఁడు నిట్టూర్పు పుచ్చి యిటు లనెను—"ఆహా! కాను, కాను. క్రైస్తవాన్వయుఁడనను ద్రోహి యందురు. కాని, నాయందు లోప మున్నను, నిష్కల్మషుఁడను."

"నేను నటులే గణింతును. మున్న మనము కలసి భుజించియుంటిమి గదా. కాన, నిను మృత్యుముఖమునుండి తప్పించి యపవాదు గుండ దొలగింపవలయునని దృఢముగ సంకల్పించియే హకీము రూపమున నిను వశపఱచుకొంటిని. కాని, యింత పోద్దెక్కినను, నీ వింకను దల్పము వీడవేమి? లేక, మ త్పరిచారకు లొసఁగిన వస్త్రము లనర్హములా?"

అట్లు యిల్దరీము ప్రశ్నింప, శూరుఁ డిట్లు బదులాడెను.—"అనర్హములు గావు గాని యనుచితములు. ఇల్దరీమ్! నీ వుదారవంతుఁడవు. బానిసనగు నుడుపు లొసంగుము—సానందముగా ధరింతును. మహమ్మదీయ యోధజనోచితాడంబరవస్త్రధారణము మాత్ర మసహ్యము."

మహమ్మదీయప్రభు వాతని భావము గ్రహించి యిటు లనెను.— "మీ జాతివార లనుమానగ్రస్తులు. సలాఉద్దీను సుల్తాను స్వభావము మీ రెఱుంగరు. లంచములు గుడిపి వంచించుటకుఁ గాని, బలవంతపఱచుటకుఁ గాని సమ్మతింపఁడు. మహమ్మదీయమత ప్రాశస్త్య మరసి తదాశ్రయ మాకాంక్షించువారిని మాత్రము చేరఁదీయును. సోదరా! గమనింపుము. అంధుని యంధత్వము పాయునేని, యది కేవల దైవ కృప కావలయు. కాని, సాధారణవైద్యుఁ డట్టి కార్యము సాధింపఁ

జాలునా? చాలఁడు. వైద్యుఁడు తన యౌషధములచేతను సాధనములచేతను రోగిని మాత్రము కష్టపెట్టును: అంధుఁడట్టులే యంధకారమున మునిఁగి యుండును. మానవుని యవివేకాంధకారము నట్టిదే. ధనాశాపరులై క్రైస్తవులు కొందఱు మహమ్మదీయమతస్థు లగుదురేని, యా పాపఫలము వా రనుభవింతురుగాక. అయ్యది స్వయంకృతాపరాధమే—సుల్తాను నేర మావంతయు లేదు. అట్టి దురాత్ములు యూధక్రైస్తుజనులకంటెను, మాంత్రిక విగ్రహారాధకుల కంటెను నధఃపతితులై, భయంకర నరకమునందలి నికృష్టతరాఖాతమున నుండవలసినవారలై, రాక్షసశిరోనిర్మిత వృక్షఫలములు తినవలసి వచ్చును. కావున, ననుమాన ముడిగి యీ వస్త్రములు ధరింపుము. సుల్తాను శిబిరమునకు నగు దేఱుదేని, నీవస్త్రములు దాల్చుటనుచితము—అనుమానమునకే గాక పరాభవమునకుఁ గూడ నీవు పాల్పడుదువు."

శూరుఁ డిట్లు బదులాడెను.—"నేను సుల్తాను శిబిరమున కరుదెంతునేని;—అయ్యో! అరుదెంచుటకు, అరుదేరకుండుటకును స్వతంత్రుఁడనా? భవదాజ్ఞాబద్ధుఁడనై యెచటికైనఁ బోవలయుఁ గదా?"

"మిత్రమా! నీకు నిర్బంధములేదు. వాయువువలె స్వచ్ఛందముగా నుందువుగాక. నీ బలపరాక్రమములు నేఁ డొల్లి చవిజూచియుంటిని. అట్టి మేటియోధుఁ డొక క్షుద్రదాసునివలె మదధీనుఁడు గాఁజాలఁడు. ధనాధికారములు నిన్నాకర్షింపఁగలవేని, నాకు లోపములేదు. నాఁటి రేయి యాంగ్లపతాకరక్షణభారము వహించి, ప్రమత్తుఁడవై తత్పతాకము గోల్పోయినపుడు నిను గాంచియుంటిగదా: ఆసమయముననే, మరణమునకైన సిద్ధపడితివిగాని నేనెంత చెప్పినను ప్రాణరక్షణార్థము సుల్తాను నాశ్రయించుటకు సమ్మతింపవైతివి. అట్టి ధీరాత్ముఁ డిపుడు

బుద్ధిపూర్వకముగా స్వీయమతవిసర్జన మొనరించునని తలంపను.”

అట్లు లాడు హాకీముతోడ శూరుఁ డిట్లు బదులాడెను—“మహా నీయా! నీ యౌదార్య మనంతము—ఆత్మవంచనకరమగు పనులకు మాత్రము పురికొల్పకుము. అనర్హుఁడనైనను, నాపై నిట్టి యుత్కృష్టాభిమానము నిర్వ్యాజమానముగాఁ జూపినందుల కెంతయుఁ గృతజ్ఞుఁడను.”

ఇల్దరీ మిటు లనెను—“అనర్హుఁడవు గావు. ఆంగ్లరాజాస్థానము నలంకరించు నారీమణుల సౌందర్యాభివర్ణనము నీ ముఖమున నాలించియేగదా. వైద్యవేషధారివై యందుఁ బ్రవేశించితి. నీ ప్రశంస యతిశయోక్తి కాదు. స్వర్గమున నెన్నఁడో యనూనలావణ్యవతులను సందర్శింపఁజాలుదునని వింటిఁగాని, యట్టి మహాభాగ్య మాంగ్లరాజశిబిరముననే యనుభవవేద్యమాయెను.

మహమ్మదీయ ప్రభువు తత్సంస్మరణమున నుత్సాహవంతుఁడాయెను. కాని శూరుఁడగు కణతున కాధోరణి బాధాకరముగ నుండెను. సంక్షుభితమనస్కుఁడై, వివర్ణవదనుఁడై తదనుక్షణమే యరుణవదనుఁడై, మహమ్మదీయుఁడు వచించునది తనకు దురవగాహమని యాతఁడు పలుక, నిర్దరీమిటు లనెను.

“దురవగాహమా! నీవును రిచర్డుశిబిరమున నుంటివిగదా. ఆ నవమోహనాంగులను నీవు కాంచలేదా! నీ దృష్టియు మేధస్సును మందగించెఁగావలయు. నీ వపుడు మరణశిక్షకుఁ బాల్పడి వికలస్వాంతుడవై యుంటివి. నిక్కమె. కాని, నే నగుదునేని, మచ్ఛిరము విచ్ఛిన్నమై భూపతనము గానున్నను, మదంత్యదుర్భరవీక్షణము సానందముగఁ దదపూర్వసౌందర్యవిచక్షణాపరతంత్రమైయుండు—మచ్ఛిరమా దివ్యసుందరవిగ్రహములపొంతకే దొరల, బాధాసంచలితములగు నధరములా పూబోండ్ల చేలాంచలచుంబన సౌఖ్య మనుభవింపఁ గడం

గును. నిరుపమాన సౌందర్యరాశియగు నాంగ్లరాజ్ఞి జగదారాధ్యయై రాజిల్లుచున్నది. ఆ సుకుమార నీలనేత్రములు, ప్రకాశమాన కాంచనకేశపాశములును వర్ణనాతీతములు! మా ప్రవక్తతోడు— స్వర్గమున హీరపాత్రధారిణియై యమృత మందీయ నరుదెంచు నా యచ్చరయైనను నంతకంటెఁ బరిరంభణ సౌఖ్య మొసఁగునని తలంపఁ జాలను.”

కణతుఁ డుగ్రుఁడై కఠినముగ నిట్టు లనెను—“సారసేనా! ప్రసిద్ధాంగ్ల భూపాల కాంతామణియని యెఱుంగవా? ఆ మహారాజ్ఞి సకల ప్రజారాధనయోగ్య సుమా!”

మహమ్మదీయప్రభు విట్లు బదులాడెను—“ఓయీ! క్షమింపుము. స్త్రీలయెడ మీకుఁ గల మూఢభక్తి మఱచితి. కాంతలు మీకు స్మరణీయలు, వందనీయలు: భోగార్హలు కారు. ఆ రాణి యపూర్వ రూపురేఖావిలాసముల బలాత్వమున కెంతయు సాక్షీభూతములై యున్నవి. కాని, గంభీరోదారవదనయై వినీలకుంతలయై రాజిల్లు నా రెండవసుచ్చెకంటె నిర్మలహృదయ, దృఢమనస్కయనియుఁ జెప్ప వలయుసుమా. ఆమె నిక్కముగ సంపూర్ణారాధనార్హయే. ఐనను, ప్రణయుఁ డనుకూలసమయ మరసి సాహసించి యా సుదతీరత్నమును సమీపించి తన హృదయము సముచితముగ వెల్లడించునేని, ప్రసన్న చిత్తయగు సుమా.”

డెందమునఁ బొంగు నాగ్రహ మడంపఁజాలక శూరుఁ డిట్టు లనెను.—“ఆంగ్ల రాజసోదరి గౌరవార్హయని యెఱుంగుము!”

ఇల్డరీమిట్లు బదులాడెను.—“గౌరవార్హయా! గౌరవార్హయగు నేని, సలాఉద్దీను భార్యయని గౌరవింతుఁగాక!”

అంతవఱకును దల్పగతుఁడై యుండిన శూరుఁ డాక్షణమ నేల కుఱికి, వాడిగ నిటులనెను.—“ఆంగ్ల రాజసోదరీచరణధూళికిఁ బ్రణామ

మాచరించుటకు నేనను తురుష్కరాజర్షుఁడు గాఁడు!"

అమీరు క్రోధసంక్షుభిత మనస్కుఁడాయెను.—"ఈ కాఫరే మనెను!" ఆతని హస్తము బాకుపైఁ బాఱెను. నిప్పులు గుఱియు నట్లు వదన మెఱ్ఱబాఱెను. కపోలాధరములు బిగియ, గడ్డంపుటంగ రములన్నియు నప్రయత్నముగా దుర్దాంతమగు క్రోధము వహించె నోయన గిఱ్ఱునఁ దిరిగెను. కాని, దుర్నిరీక్ష్యహార్యక్షుక్రోధమున కోహటింపని స్కాచిశూరుఁడు, మహమ్మదీయుని వ్యాఘ్రాగ్రహము నకుమాత్ర మోహటించునా!

కణతుఁడు తనభుజములు కట్టుకొని నిర్భయముగా నిట్టులనెను.— "నేను స్వతంత్రుఁ డనగుదునేని, యశ్వము లేకున్నను సరె—మదీయ దీర్ఘకరవాలము దాల్చి యెల్లరను బ్రతిఘటించి నామాట నిలుపుకొం దును."

శూరుఁడట్లు భాషింపుచుండ నిల్దరీము తన మనోస్థైర్య మలవఱచు కొనుచు, నప్రయత్నముగానో యన ఖడ్గమువీడి యిటులనెను.— "సోదరా! జీవితాశ యెఱుంగక యటులంటివి. నీవాంఛ దీర్పుట కొక్కసత్య మతస్థుఁడు—మహమ్మదీయ యోధుఁడు చాలు. కర ములు శృంఖలాబద్ధము లగుటయే క్షేమకరమని నీవపుడు వాంఛింపఁ గలవు."

"శృంఖలాబద్ధము కావలయునని కాదు, భుజములు తెగవలయు ననియే వాంఛింతును." కణతుఁ డట్లు పలుక, మహమ్మదీయప్రభు విట్టులనెను.—"నీవిపుడు ధర్మపాశబద్ధుఁడవు—నీకిపుడు తత్పాశ విముక్తి గావింపనొల్లను. మనపరస్పర బలాబలము లొకసారి యరసి యుంటిమి గదా; రణరంగమున మగుడ నొండొరులఁ దాఁకుదుము గాక: అపు డెవఁడు తొలుదొల్తఁ గార్యవిముఖుఁడగునో వాఁడు దుర్య శోమగ్నుఁడగుఁ గాక! అంతదనుక మునము మిత్రులము. నీ సాహాయ్య

మిపుడు నాకవసరము."

ఇల్దరీమట్లు పలుక, శూరుఁడు గూడ 'మనము మిత్రులమే" యని ప్రతిధ్వనించెను. తీవ్రక్రోధఘూర్ణితమగు సింహము భాతి మహామ్మదీయప్రభువా పటకుటీరమున వడివడి తిరుగాడి తన యుద్దండక్రోధ మడంచికొనెను. శూరునియం దట్టి యుద్దీపనముఁ దోఁపకుండెను. చూచుట కాతఁడు చెక్కుచెదరక నిశ్చలముగనే యుండెను. ఐనను, ఆతఁడును దగవసరోద్భూతక్రోధము లోలోన నడంచుకొను చుండెను. ఇల్దరీ మిటులనెను.—

"ఇఁక మనము సావధాన మనస్కులమై యోచింపవలయు. నేను వైద్యుఁడఁ గదా. వ్రణబాధాపీడితుఁడగు రోగి వైద్యుఁ జొనరించు శస్త్రచికిత్స యోర్వవలయు. నేనట్టి వ్రణమిపుడు తాఁకనుంటి, గమనింపుము. ఆంగ్లరాజసోదరిని నీవు ప్రేమింతువు. నీచిత్తము వెల్లడించినను, వెల్లడింపకున్నను నొకటి—నేనరయఁ గలను."

శూరుఁ డొకక్షణమూరకుండి యిటులనెను.—"ప్రేమించితిని—మానవుఁడు దైవకృపను బ్రేమించునటులు ప్రేమించితి; పాపాత్ముఁడు క్షమాభిక్షకై దైవము నారాధించునటులే యామె యనురాగ మాకాంక్షించి యుంటిని."

"నీ విఁక బ్రేమింపవా?"

"అయ్యో! ఇపుడు నా కట్టి యర్హత లేదు. కాని, నీ పలుకులు కత్తులవలె నను గోయుచున్నవి; దయామయుఁడవై యీ ప్రసంగ మిఁక వీడుము."

శూరుఁ డటు లన్నను విరమింపక, యాతఁ డిటు లనెను—"నన్ను క్షమించి యొక్కక్షణము సహింపుము. చూచుటకు నిర్ధనుఁడవయ్యు నత్యున్నతమగు నాంగ్లరాజ సోదరీ హృదయ మాకర్షించుట కెట్లు సాహసించితివి? నీ మనోరథము సిద్ధించునని విశ్వసించితివా?"

కణతుఁ డిట్లు బదులాడెను—"ప్రేమ యాశాబద్ధముగదా. సముద్రమునఁ బడు నావికుఁ డుత్తుంగతరంగ మధిరోహించునపుడు దవ్వున దీపకిరణము గాంచి కనుచూపు దూరముననే దరియున్నదని యెఱుంగఁ జాలును: కాని, యధికతరాయసమున గాల్సేతు లీడ్చుకొనిపోవ, మనోధైర్య మంతరింప, నటు జేరుట యసాధ్యమనియు నెఱుంగును. నా యవస్థయు నట్టిదే యని చెప్పవలయు."

"ఇపుడు నీయాశ లడుగంటెనా?—దూరస్థ దీపకాంతి యంతరించిపోయెనా!"

"అంతరించిపోయెను." అట్లు ప్రత్యుత్తర మొసంగు శూరుని స్వరము శిథిలప్రేతనిలయాంత ప్రతిధ్వనిం బోలియుండెను. ఇల్దరీము మగుడ నిటు లనెను—

"నీ విపుడు కోల్పోయినది దూరస్థ దీపకాంతియే యగునేని, నిరాశాపరుఁడవు గావలదు. తద్వీక్షసౌఖ్యము మగుడ ననుభవింపఁ గలవు. నిరాశాసముద్రగర్భస్థమైన యాశ పునరుద్ధరింపవచ్చును. నీవు మగుడ భవదీయ మనోభవానందజలధి తరంగముల నోలలాడఁగలవు. ఎల్లి నీవు యథానిర్మలమనస్కుఁడవై చూచుచుండ, నీవు ప్రేమించు రాజపుత్రి సుల్తాను భార్య కాఁగలదు."

"అట్లు లగుఁగాక—నే నాముహూర్తమున—" అవస్థాభేదము వలన నసమర్థుఁ డగువాఁడు ప్రగల్భము లాడఁజాలఁడు—అట్టి యసమర్థుఁడు దృఢప్రతిజ్ఞ యొనరింపఁ బూనినచో నయ్యది దుర్గర్వముగఁ గాన్పించును—యదృశదుర్దశాగ్రస్తుఁడైన శూరుఁడు తన భావము ప్రకటింపఁజాలకపోయెను. ఐనను, మహమ్మదీయుఁడు మందహాస మొనరించి యిటు లనెను—

సుల్తానుకు ద్వంద్వయుద్ధమునకుఁ జీరుదువు గదా!"

"ఔఁగాక. కాని, మత్పరాక్రమము చవిజూచుట కాతఁడు ప్రథ

ముఁడు కాఁడు, ప్రథమగణ్యుఁడును గాఁడు."

అంత నిల్డరీ యిటు లనెను—"మహత్తర రాజకన్యాకరగ్రహణ కార్యతత్పరుఁ డగు సుల్తా నట్టియెడఁ బ్రమాదకరమగు ద్వంద్వయుద్ధమునకును, ఆ కారణమున రాఁగల మహాయుద్ధమునకును నియ్యకొనఁ జాలఁడు."

"అట్లైన, రణముఖముననే యాతనిఁ దాఁకుదును"—అట్లు పలుకు శూరుని నయనములు తత్సంస్మరణభవాలోచనలవలనఁ బ్రజ్వరిల్లెను. మహమ్మదీయుఁడు మగుడ నిటు లనెను—"ఆతఁ డెన్నఁడు సేనాముఖముననే యుండు: శూరజనోచితముగు పోరాటమునకెన్నఁడు వెనుదీసి యెఱుంగఁడు. కాని, నే నిప్పుడు సుల్తానుగుఱించి ప్రశంసింపను. గమనింపుము. ఆంగ్లపతాకముతోఁ బాటు నీ యశము నంతరించెఁ గదా. నీవాచౌర్య మరసి యశోపార్జన మొనరించు నవకాశము గల్పింపఁజాలుదు. కాని, మ దాజ్ఞాబద్ధుఁడవై యుండవలయుసుమా. శాస్త్రజ్ఞుఁ డేమనునో వింటివా?—దాది నేర్పినఁగాని బిడ్డ నడునఁ జాలదు; జ్ఞాని యుపదేశించినఁగాని అజ్ఞాని నేర్వఁజాలఁడు".

స్కాచిశూరుఁ డిట్టు లనెను.—

"నీవు సా[illegible]సీనుఁడ వైనను, ధీమంతుఁడవు; మ్లేచ్ఛుఁడవైనను, ఉదారహృదయుఁడవు. నే నెఱుంగుదు. కావున నీ వేమి పంచిన నట్లు చేయువాఁడను. మదీయ భక్తివిశ్వాసములకు విరుద్ధముగా మాత్ర మాచరింపఁజాలనుసుమా. కావునఁ గార్యమునకుఁ గడఁగుము, తదనంతర మీ ప్రాణముగూడ గైకొనుము."

ఇల్డరీ యిటు లనెను—"మిత్రమా! గమనింపుము. మ దధీన దివ్యౌషధ ప్రభావముచేత నీ జాగిలము స్వస్థత గాంచెను. తత్సాహాయ్యమున గార్యము సాధింపఁగలవు."

"ఆహా! నే నెంత మందబుద్ధి నైతిని—నా కీపాటి స్ఫురింపక

పోయెనే ?"

"ఈ శ్వానమును గుర్తింపఁగల నీవార లెవ్వరైనను మీ శిబిరమున నుందురా ?"

ఇల్డరీ యట్లు ప్రశ్నింప, శూరుఁ డిట్లు బదులాడెను.—"ఆంగ్లపతాకము పోయినంతనే మరణమునకు సంసిద్ధుఁడ నైతి. ఆ కారణమున నా మిత్రులకుఁ గొన్ని లేఖలు వ్రాసి, నీవు బ్రదికించిన నాయనుచరున కొసఁగి మా దేశమున కంపితిని. ఆ వృద్ధున కుపచారము లొనరించిన బాలకునిఁగూడఁ బంపివైచితిని. ఇఁక మ తెవ్వరు లేరు. కాని, నన్నెఱుంగనివారు లేరు. అధరస్పంద మొనరించినఁజాలు—నేఁ బట్టువడుదును."

"నీకును నీ జాగిలమునకును సర్వజనాభేద్యమగు వేషము వేయింతును. తోడి యోధుఁడైనను, సోదరుఁడైనను నినుగుర్తింపఁజాలఁడు. నే నింతకంటెను గష్టతరకార్యము లొనరించియుంటిఁగదా. మృత్యువునే వంచించినవాఁడు—మానవులను మృత్యుగహ్వరమునుండి రక్షించినవాఁడు—మానవుని వంచింపఁజాలడా? కాని, నీవొక నియమము బాటింపవలయు. సుల్తాను జాబొందుగలదు—అయ్యది రిచర్డురాజసోదరి కందీయవలయు."

కణతుఁడు సంకుచితమనస్కుఁడై యుండ, నిల్డరీ యిట్లు ప్రశ్నించెను. "సుల్తాను సందేశ నిర్వహణము నీకు భయావహమా?"

"భయావహమా! ప్రాణహాని యొకవిధమున వెఱుదీయను. కాని, యిట్టి కృత్య మొనరించుట నాకును, మ్లేచ్ఛరాజలేఖాపరిగ్రహణము మేరీకన్యకును ననుచితమేమో యని విచారించుచుంటిని."

కణతుఁ డట్లు తన సందేహము దెలుప, నట్టి యనుమానము వలదనియు, నాలేఖ గౌరవభూయిష్ఠమనియు, క్రైస్తవరాజకన్య చూడరాని యసంగతప్రసంగ మందేమియు లేదనియు ననేక ప్రమాణము

లొనరించి మహమ్మదీయ ప్రభువు పలుక, శూరుఁడు సమ్మతించెను.—
"అట్లగుఁ నేని, నేనాతని పుట్టుభూనిసవలె విశ్వాసబద్ధుఁడనై సుల్తాను లేఖ గొంపోదును. నే నీమాత్రము చేయఁజాలుదు. కాని, ముఖ్యముగా నావంటివాఁ డిట్టి ప్రణయసందేశ సందర్భమున నీక నెట్టి సాహాయ్య మొనరింపఁజాలనని సుల్తాను గ్రహించుఁగాక."

మహమ్మదీయ ప్రభువు సంతుష్టాంతరంగుఁడై యిట్లు బదులాడెను —

"సలాఉద్దీనుసుల్తా నుదారచిత్తుఁడు. ఉపకారి దొఱకెఁగదా యని విశేషశ్రమ గల్పించువాఁడు కాఁడు. ఇఁక, నా పటకుటీరమునకు రమ్మా. అంధనమనసమాన ప్రచ్ఛన్నరూపము దాల్చి, దివ్యాంగుళీయము ధరించినవానివలె నగోచరుఁడవై మీ క్రైస్తవ శిబిరమున నిరాఘాటముగా విహరింతువు గాక."

౨౪

నీగ్రోబానిస యెవ్వఁడో, యాతఁడేల రిచర్డురాజశిబిరము బ్రవేశించెనో పాఠకున కిపుడు సువ్యక్తము. వెనుకటి దిన మాంగ్లనృపాలుఁడు తన యుద్యోగితోడ నొనరించిన సంభాషణ నీగ్రోబానిస వినియుండెను. నృపాలుఁడు తనరూపము గుర్తించి యుండునా, యని యాతఁడెంతయు ననుమానించెను. తానా రేయి యాంగ్లపతాక రక్షణభారము తన శ్వానముపై నిడి మేరీనిఁ గాంచబోయినపు డాజంతువు క్షతగాత్రమైన విషయము రిచర్డురా జెఱింగి యుండఁడు. కణతుఁడు తెలుపలేదు. ఐనను, చోరాన్వేషణమున కాశ్వానమెట్లు తోడ్పడునో నెఱింగినట్టులే యాతఁడు భాషించెను. కాని, నీగ్రోబానిస నెట్లు

చూడవలయునో నృపాలుఁడట్టులే చూచుచుండుట చేతఁ దన రహస్యము బయల్పడ లేదని యాతఁడు భావింపవలసిన వాఁడాయెను. మాయారూపము దాల్చిన కణతుఁడట్లు విపరీతానుమాన బాధితుఁడాయెను.

ఆంగ్లనృపాలుఁ డిపుడు జార్జిదిబ్బపై నుండెను. ప్రసిద్ధాంగ్లప్రభులాతని చుట్టు నుండిరి. నృపాలుని భ్రాతయు, గూఢజ్ఞుఁడును, ప్రభుశ్రేష్ఠుఁడును నగు 'విలియము' (సాలిస్బరీప్రభువు) ఆంగ్లపతాకము బూని యుండెను. నీగ్రోబానిస తన శ్వానముతోఁ బాటు నృపాలుని ప్రక్కనే యుండెను.

రిచర్డునృపాలుఁ డట్లు తదున్నతపదారూఢుఁడై యుండ, మత యుద్ధసమయబద్ధములై యరుదెంచిన వివిధక్రైస్తవ సేనావిభాగములు సక్రమముగా, దర్శనీయముగా నాచుట్టు నరుదెంచుచుండెను. ఆయా సేనానులొకటి రెండడుగు లెక్కి, యాంగ్లపతాకముపైఁ దమకుఁ గల గౌరవము నిర్దిష్టవిధమున సూచించి తమ సేనాముఖంబుల వెడలుచుండిరి. ఆంగ్లపతాకాపహరణము వలనఁ గలుగు నవమానము బాపుటకై యిట్టి మహాప్రదర్శన మగునని వెనుకటి ప్రకరణముననే తెలిసెఁ గదా. సన్యాసిశూరులు మాత్రము తమ మతాధికారము బురస్కరించుకొని మానవమాత్రున కట్టి గౌరవము జూపకుండిరి. కావున, వారు రిచర్డునుసమీపించి యాతని నాశీర్వదించి పోవుచుండిరి.

వివిధక్రైస్తవ సేనావాహిని యనేక కారణములచేతఁ బలుచవడి యున్నను, బుంఖానుపుంఖముగ, నవిరళముగఁ బఱతెంచుట గాంచ నింకను నయ్యది యనంతముగనే తోఁచెను. ఒక మాసమునుండియు యుద్ధ మెఱుంగక సోమరులై యుండవలసిన సైనికు లిపుడు దశాధికోత్సాహదీపితవదను లైరి. పరస్పరవిలోకనంబునఁ దమ సంయుక్త బలంబమోఘమును భావ మాయా క్రైస్తవదేశస్థు లందఱకు నుదయించెను. రణతూర్యము లుత్సాహాకరముగఁ బ్రమోఁగెను. అంతవఱ

కును దిని తిని బలిసిన తురంగములు సగర్వముగ నడచుచుండెను. పతాకము లెగుర, శూలములు మెఱయ, తురాయిలు సంచలింప, లెక్కకు మీఱిన సేనావిభాగము లవిచ్ఛిన్నముగా జార్జిగిబ్బ జుట్టి, యఖిలక్రైస్తవసేనాభారధురంధరుఁ డగు నాంగ్లరాజపతాకమునకు సక్రమముగాఁ బ్రణతు లొనరించి వెడలుచుండెను. ఫ్రాన్సు మొదలగు దేశాధీశులవలె నాంగ్లరాజు గూడ నొక స్వతంత్రరాజు: అట్టి యొక నృపాలున కన్య నృపాలుర యోధు లట్టి విశేష గౌరవము జూపుట వేఱొకయెడ నికృష్టమే. కాని, యీ సమయ మట్టిది గాదు. వివిధ క్రైస్తవనాయకు లందఱుఁ గలసి యసమాన బాహుబలపరాక్రమ సంపన్నుఁడగు రిచర్డును సర్వసేనానిగా నెన్నుకొనిరి. మహోత్కృష్ట కార్యభారము వహించుటకు మహోత్కృష్టనాయకుఁడే సమర్థుఁడు. కావున, ధీరులగు యోధు లందఱు యోధజనశ్రేష్ఠుఁడగు నాంగ్ల రాజేంద్రుని మనసార గౌరవించుచుండిరి.

ఆంగ్లరా జశ్వారూఢుఁడై, నిశ్చలవదనుఁడై, మరుదెంచు సేనలను సపరిశీలనముగా వీక్షించుచు, నాయానాయకు లొనరించు వందనము లందుకొని, వారికిఁ బ్రతివందనములు సేయుచుండెను. పాశబద్ధమగు శ్వానముతోడ నీగ్రోబానిస జేని ప్రక్కనే యుండెను. కాని, వాని నెవ్వరు పాటింపలేదు. కారణమేమన, ప్రాచ్యదేశాచారము జూచి యనేక క్రైస్తవరాజన్యులు గూడ నీగ్రోబానిసలను గొనుచుండిరి.

ఆంగ్లపతాకాభినందనోత్సవము వైభవముతోడ జరుగుచుండెను. ఆంగ్లనృపాలుఁడు సహజముగ గర్వియు నాడంబరప్రియుఁడును గాఁడు. కాని, పతాకాపహరణము వలన నాంగ్లదేశమునకుఁ బొడమిన కళంకము మాపుటకై తదుత్సవము ఘటిల్లుటచేత రిచర్డు రాజు సానందముగ సగర్వముగఁ దన కేతనము నప్పుడప్పుడు తిలకించుచుండెను. ఆదిబ్బయందలి శిఖరమున నొక దారుమందిరము ప్రత్యేకముగా నిర్మిం

పంబడి యుండెను. అయ్యది యాంగ్లరాజకాంతాజనవీక్షణావాసము. ఆంగ్లరాజ్ఞియగు 'బెరంజేరియా' యను కన్యకయుఁ బ్రధాననారీజనంబులుఁ గూడ నందు సుఖాసీనలై యుండి యాంగ్లయశోప్రవర్ధమానమగు నాదృశ్యము సంతోషతరంగితస్వాంతలై తిలకింపుచుండిరి. నృపాలుఁ డొకప్పు డానంకఁ గూడ భావగర్భితముగా వీక్షింపుచుండెను. ఈ నీచాత్ముఁడు పతాకవిధ్వంసకుఁడు కావచ్చుననియు, వానికి సహకారి కావచ్చుననియు ననుమానము గలుగునప్పుడాయా నాయకు లేతెంచు నంతనే, నృపాలుఁడు నీగ్రోబానిసను వాని శ్వానమును దిలకించుచుండెను.

యోధజనమండితుఁడై వైభవాభిరాముఁడై యరుదెంచు ఫ్రెంచి నృపాలు నాతఁ డనుమానింపలేదు. ఫ్రెంచిరాజును గాంచినంతనే, రిచర్డు నేలకుడిగ్గి, యెదురేగి యాతనికి గౌరవాభిమాన పురస్సరముగా స్వాగత మొసంగెను. సమానబలాధికారసంపన్నులగు రాజేంద్రు లొకరియెడ మిత్రులవలెఁ గూడు దృశ్య మపూర్వము. నానా దేశాగత క్రైస్తవసేనాసముద్రము తోడనే యమందానంద పారవశ్యమున ఘూర్ణిల్లెను. తత్సమయ సముద్భవ కోలాహలము మిన్నుముట్ట, బహుక్రోశదూరమునఁ గావలియుండు మహమ్మదీయులా మహారవమాలించి, క్రైస్తవసైన్యము యుద్ధసన్నద్ధమై బయల్వెడలెనని భ్రమించి కడు తత్తరంబున సుల్తాను శిబిరమును హెచ్చరించిరి. కాని, నృపాలహృదయములు పరమాత్మునకొక్కఁడే యరయఁ గలఁడు; అన్యుల కసాధ్యము. సగౌరవముగా స్వాగత మొసంగు నాంగ్లరాజను మానగ్రస్తుఁడై లోలోనఁ గనలుచుండెను. ఫ్రెంచి నృపాలుఁ డన్ననో! జయాపజయములు రిచర్డునకే వదలివైచి తాను నిరపాయముగాఁ దన దేశమునకుఁ బోవలయునని తలంచుచుండెను.

సన్యాసిశూరు లరుదెంచునపు డాంగ్లరాజు వైఖరి మాఱిపోయెను.

పాలస్థాన సూర్యాతపంబున నల్లవడిన యాశూరులు మతాధికారులయ్యు, స్వతంత్ర క్రైస్తవరాజన్యుల నీసడించు మహావైభవముతో నలరారుచుండిరి. ఆశూరుఁ డొక్కొక్కఁ డరుదెంచుచుండ నాంగ్లరాజనుమానోద్విగ్నహృదయుఁడై, బానిసవంకను, జాగిలమువంకను వడివడి జూచుచుండెను. కాని, శ్వానము యథావిధంబుననే యుండి, యప్రమత్తతతోడ నెల్లరఁ గాంచుచుండెను.

అనంతర మాస్ట్రియా భూబాలుఁ డగు 'లియోపాలుఁ' డరుదెంచెను. ఆంగ్లపతాక మాతఁడే హరించి యుండునని యనుమానించుటచేత నాతని వదనమును జాగిలమునకుఁ జక్కఁగఁ జూపవలయునని రిచర్డు బానిసను హెచ్చరించెను.

ఆస్ట్రియా నృపాలుఁడు తా నొక్కఁడు రాక, విదూషకవాచాలురను గూడఁ దనవెంట నుంచుకొనెను. చిరతరాభ్యాసవశమున నాతఁడట్టు లొనరించి యుండును. లేదేని, యా మహాప్రదర్శనము సహింపక, తన నిరసన మావిధము జూపఁ గోరియుండును. కాని, వాని హృదయము నిక్కముగ భయకంపితమై, వదనము సంకుచితమునై యుండెను. ఐనను, ఆ ఱేఁడు నోటితోఁ నీలవైచుచు జూచుట కతి నిర్లక్ష్యముగ నాంగ్లపతాకమునకుఁ బ్రణుతి యొనరించెను. తన నృపాలుని స్వతంత్ర రాజాధికార మంతమాత్రమునఁ గుంటువడెనని తలంపరాదని వాచాలుఁ డాడంబరముగఁ జాటెను; తత్సమానుఁడగు విదూషకుఁడు కఠోరస్వరమున బలపఱిచెను. ప్రేక్షకులు పక్కున నవ్విరి.

ఆంగ్లనృపాలుఁ డా సమయమునఁ బెక్కుసారులు బానిసవంకఁ దిలకించెను. కాని, వాఁడును శ్వానమును గూడ నిశ్చలముగ నుండిరి. రిచర్డు వినువున నిటు లనెను——"నీ తెలివికిఁదోడు నీజాగిలము గూడఁ దెచ్చితివి. ఐనను, నిరర్థకముగఁ గాన్పించెడిని..." నీగ్రోబానిస సవినయముగ శిరము వాల్చి యూరకుండెను.

అంతలో, మాంటుసరాటుపాలకుఁడగు కాన్రేడుయొక్క సేనా విభాగములు రాఁదొడఁగెను. ఆడంబరప్రియుఁడగు నా కుటిలుఁడు తన సైన్యమును రెండుగా విభాగించెను. ఒక సైన్యము నాతని సోదరుఁడు శాసించుచుండెను. రెండవ సేనాముఖంబున నాతఁడే యుండెను. ఆ సైనికుల వేషధారణము పాశ్చాత్యానుగుణముగఁ గూడ నున్నను, నధికముగ బ్రాచ్యజనోచితముగనే యుండెను. ధనుర్బాణములును బ్రాచ్యఖడ్గములును దాల్చి, యుత్తమాశ్వంబు లారోహించిన యా సైనికులు చూచుట కెంతయు ఘనముగా నుండెను.

తత్సేనాధిపుఁడగు కాన్రేడు గూడఁ సముచితముగనే యలంకరించుకొనెను. సువర్ణరజతోజ్జ్వలములగు వస్త్రములను క్షీరధావళ్యముతో నలరారుచు నాకస మంటునో యనునంతటి దీర్ఘపింఛమును, అందుల కొక వజ్రపుఁగట్టును ధరించి, ప్రశస్తహయరాజ మారోహించిన కాన్రేడు మూర్తిదర్శనీయముగనే యుండెను.

కాన్రేడు రిచర్డు సద్భావము గ్రహించి యాతని చెలిమి గడింపఁ జాలెను. కాని, నాతని గాంచినంతనే రిచర్డు ఒకటి రెండడుగులు దగి వచ్చి చనవుగఁ బదుచి పరిహాసపూర్వకముగాఁ బలుకరించెను. కాన్రేడు నుంచి హాస మొనరించి, సరసముగఁ బ్రత్యుత్తర మీయఁ బోయెను. కాని, యంతలో నెంతటి ప్రమాదము! ఎంచి తెంపరి నాయకు లరుదెంచిరను జలింపనైనఁ జలింపని జాగిలము క్రోధావేశమునఁ గడు భయంకరముగ మొఱిఁగి ముందు దూఁకెను. కణాతుఁడు తోడనే పాశము వదలెను. పాశవిముక్తమగు శ్వానము రయమున్నస నా హయముపై నుఱికి రౌతుకంఠము బట్టి యీడ్వ, మహాశూరుఁడగు కాన్రేడు పట్టుదప్పి నేలఁ బొరలాడెను. తురంగము భయాతిరేకమునఁ బాఱిపోయెను. ఆంగ్లనృపాలుఁ డిట్టు లనెను—

,,ఓయీ! నీకుక్క తెలివి యమోఘము. కాని, వాడు మరణించు

నేమో లాగివేయుము."

సీగ్రో భానిస యట్టులే యొనరించెను. కాని, ఆ పని సులభసాధ్యము కాకపోయెను. తన బలముకొలది విడిపించి శ్వానమును మిగుడబంధించినను, గడుంగడు ఘూర్ణిల్లుచుఁ దనుఁగట్టిన పాశమయ్యది ఛేదింపఁగడంగెను. ఆ ప్రదేశమంతలో బహుజనసంకీర్ణమాయెను. ఆ సమీపముననున్న కానేర్డు పరిజనులు నుద్యోగులు రయమ్మున నరుదెంచి, దైన్యముగ భూపతనుఁడై సంభ్రమాకులంబున గగనముగాంచు తమ ప్రభునిఁ జుట్టి, యాతని లేవఁదీసి, దుర్భరక్రోధాతిరేకమున "శ్వానమును భానిసనుగూడ ముక్కముక్క లొనరింపు"డని యేకకంఠమున నఱచిరి. ఆంగ్లనృపాలుఁడంత నందఱు వినఁజాలునట్లు జలధరధ్వానమున నిట్లు పలికెను——

"జాగిలము జోలికిఁ బోవువాఁడు వధ్యుఁడు! దైవదత్తమగు బుద్ధిబలమునఁ దనధర్మము శ్లాఘనీయముగ నీ జంతువు నిర్వర్తించెను. కుటిలాత్మా! కాన్రేడ్! నీవు ద్రోహివి! సంసిద్ధుఁడవుగమ్ము."

కానేర్డు లజ్జావమాన సంభ్రమాకులుఁడై, దుర్భరక్రోధప్రకంపిత హృదయుఁడై యిట్లనెను——"ఇది యేమి? నా యొనరించిన నేరమేమి? నన్నిట్టులవమానింపనేల? నీవతి ప్రయాసపడి సాధింపఁజాలిన సౌభ్రాత్రమిదియేనా?"

కానేర్డు మిత్రుఁడును, ఘాతుకుఁడును, సన్యాసిశూరవలయాధిపతియునగు, నమారీ' యిట్లుపలికెను——"ఆంగ్లనృపాలుఁడు తనతోడి రాజన్యులపైఁ గుక్కలను విడుచుఁగా! స్వాతంత్ర్యైకస్థవనాయకులు శశములవలె, హరిణములవలెఁ గాన్పింతురా?"

ఆ క్షణమ యరుదెంచిన ఫ్రెంచినృపాలుఁ డిట్లనెను——"ఇది విపరీతము! ఘోరప్రమాదము!——"

వైరులగు మహమ్మదీయు లొనరించిన మోసము గావలయునని

యొకఁడును, శ్వానము నురిదీసి బానిసను జిత్రవధ గావింపవలయునని యింకొకఁడును—పలువురు పలువిధములు బలుక, నాంగ్లనృపాలుఁ డిట్టులనెను—

"జీవితాశ గలదేని, వారి నంటఁబోకుఁడు. కాన్రేడ్! ఈ యుత్తమ శ్వానము తనబుద్ధి వైభవము బురస్కరించుకొని తను హింసించితి వనియు, నింగ్లాండు దేశమును ఘోరముగ నవమానించితివనియు నీపై నేరము మోపెను. కాదందువేని, లెమ్ము."

"ఆంగ్లపతాకము నంటలే"దని కాన్రేడు తొందరపాటునఁ బలుక, నాంగ్లనృపాలుఁ డిటులనెను.—

"కాన్రేడ్! నీ పలుకులే నీవు ద్రోహివని చెప్పుచున్నవి. ద్రోహివి కావేని, నే నాంగ్లపతాకము గుఱించియే ప్రశ్నించితినని నీ కెట్లు స్ఫురించెను?"

కాన్రే డిట్లు ప్రత్యుత్తర మొసంగెను—

"నీవీ మహాశిబిరమును గలంచుట కిదియే కారణముగదా—మఱే మున్నది? నీ పతాకమునంటలి బంగరుజలతాగున కాసపడి యధఁము డెవ్వఁడో యపహరించియుండును. నీ తోడి క్రైస్తవరాజన్యుని, మిత్రుని చోరుఁడని నిందింతువా? ఒక కుక్కను సాక్షిగాఁ గొని నా యంత వానిపై నేరారోపణ మొనరింతువా?"

ఇఁక నుపేక్షింపరాదని యెంచి, ఫ్రెంచి రాజిట్టులనెను—"రాజన్యులారా! నాయకులు తమ్ము తమ సైనికజనసమక్షమునఁ గలహించుటనుచితము. సైనికులు ఖడ్గములు దూసి పరస్పరసంహార మొనరింపఁగలరు. ఎవ్వరిసైన్యము వారు తరలించుకొని మనమందఱమీ ప్రదేశము వీడి, యాలోచనాగారము జొచ్చి, యీ విపరీతపరిణామము గుఱించి విచారింతముగాక."

ఆంగ్లనృపాలుఁ డందుల కియ్యకొని యిట్లు పలికెను.—"వీడు

ధరించిన యాడంబరవస్త్ర మిట్లు ధూళిధూసరితమై యుండగనే ఈ చోరుని పనిబట్టవలయు, గాని, ఫ్రెంచినృపాలుని చిత్తము చొప్పుననే మేము జరింతుము.”

నాయకులు తమతమ సేనాముఖంబునం బోయిరి. రణదుందుభులు తూర్యములును మ్రోయ, దవ్వు దవ్వులనున్న సైనికులుగూడం దోడనే యరుదెంచి వారి వారి సేనలలోం జేరిరి. ఆ సేనలన్నియుం దమ తమ నెలవులు జేరెను. మహమ్మదీయుని భంజింప నరుదెంచిన క్రైస్తవరాజన్యు లచటం బరస్పరయుద్ధ నిమగ్నులగు ప్రమాదము తప్పెను. కాని, యంతమాత్రమున నే మాయె? భూరిబలపరాక్రమ ధౌరేయుండగు నాంగ్లనృపాలుండే సర్వసేనాధిపత్యము వహింపదగుం డని కొనియాడిన సైనికు లాతండు గర్వియని యసహనశీలుండని నిందింపందొడంగిరి. ఆంగ్లేయసైనికు లన్ననో! తమదేశోన్నతియుం దమ తేని యున్నతియు సహింపక మత్సరపరులై యన్యదేశస్థు లెట్టి కుమార్గముననైనం గీర్తిభంగ మొనరింపం జూచుచుండిరని వా రనుమానించిరి. ఆ సమయమున ననేకములగు వదంతులు వ్యాపించెను. ఆంగ్లరాజావరోధజనులు భయవిహ్వలలై రనియు, నందొక కాంత మూర్ఛిల్లెననియుం గూడం జెప్పుకొనిరి.

నాయకులంతయు నిర్దిష్టసమయమునం గూడిరి. కాన్రే డెంతటి మాయావియైనను, ఎంతటి నేర్పరియైనను, ఎంతటి ప్రసంగచాతురీ ధురీణుండైనను ఆకస్మికముగ నట్టి ఘోరప్రమాదమునకుం బాల్పడి నంతనే దురంత లజ్జావమానభరమ్మున నెంతయేని భంగపడెను. ఆ కలవరమును ధూళిధూసరితవస్త్రములుగూడ వీడి, రాజన్యునివలె నలంకరించుకొని, యొక్క ప్రక్క నాస్ట్రియా నృపాలుండు, రెండవ ప్రక్క సన్యాశిశూరనాయకులు నరుదేర, నాతండు సభాగారము సగర్వముగం బ్రవేశించెను. రిచర్డు సేవగించు నాయకు లింకను బెక్కం

ద్రోతని వెంటనుండిరి.

ఆంగ్లనృపాలుఁ డంతమాత్రమునఁ జలింపక సహజనిర్లక్ష్యభావము తోడ నందుఁ బ్రవేశించెను. ఆతఁడు నేఱుదుస్తులైన ధరింపలేదు. కాన్రేడు మిత్రులవలె, సాభిమానముగా నాతనికిఁ దోడ్పడువారివలె నాతని నంటియున్న వారిని నిర్లక్ష్య వీక్షణమాత్రమున నిరసించి యా నాయకునిగాంచి యాతఁడే యాంగ్లదేశపతాకాపహర్తయనియు దదతిక్షణ మొనరింపఁ గడంగిన జాగిలమును గాయపఱచిన వాఁడ నియు విస్పష్టముగా రిచర్డు నిందించెను.

కాన్రే డంతట నిర్భయముగా లేచి, తానట్టి నేర మొనరింపలేదని నిశ్చలముగా బదులాడెను. మధ్యవర్తిత్వమునకుఁ బూనుకొనిన ఫ్రెంచి నృపాలుఁడు తోడనే యిట్టు లనెను—"ఆంగ్లభ్రాతా! నీ వొనరించు నేరారోపణ మపూర్వము. నీవు గాంచి, నేర నిరూపణ మొనరించుట సమంజసము గాని, యీ సారమేయమును బురస్కరించుకొని యొన రించుట యసమంజసము. ఈ యున్నత్తిశ్వానభషణము కంటె శూర బిరుదవిరాజమానుఁడగు కాన్రేడు పలుకు విశ్వసనీయముగదా?"

రిచర్డిట్లు బదులాడెను—

"రాజసోదరా! మన వినోదార్థము మన వెంటనుండి పాటుపడు శునకమునకుఁ బరాత్పరుఁడు మహత్తరగుణ మొండు ప్రసాదించెను. మోసమెఱుంగక విశ్వాసబద్ధమైయుండు జంతువు శ్వానము. మిత్రు లను శత్రులను నెన్నఁడు మఱువదు: మానవసహజమగు ద్రోహబుద్ధి యెఱుంగక, మానవసహజమగు వివేకము మాత్రము గలిగియుండు. కూటసాక్ష్యములు గల్పింపవచ్చును; సైనికునకు లంచ మొసఁగి వానిచే నొకని వధింపవచ్చును; కాని, కుక్కచేతఁ దనయుపకారినిఁ జంపిం చుట మాత్ర మసాధ్యము.

ఈ కాన్రేడు రాజన్యుఁడెట్టి వేషమైనను దాల్చుఁగాక—శరీరము

నకు ముందు మూఁకు లలఁదుకొని యపూర్వాకృతిదాల్చి శతజన మధ్యస్థుఁడై యుండుఁగాక— ఈ సారమేయము నేటివలె నప్రతిహతబుద్ధిబలంబునఁ బట్టఁజాలు—మదీయ గండ మొడ్డి చెప్పఁగలను. ప్రకృత మీ వ్యాపారము విపరీతముగఁ గాన్పించినను, ఇయ్యది సర్వసాధారణము. చోరాది కంటకు లీవిధమున నెందఱు పట్టువడలేదు? దైవమిట్లు తోడ్పడును. సోదరా! సీరాజ్యముననే యొకానొక సందర్భమున నొక మనుజుఁడును నొక శునకమును వాది ప్రతివాదులై పోరాడ, నందు శ్వానమే జయించెను. మనుష్యుఁడే ద్రోహియని స్థిరపఱచి వాని నప్పుడు శిక్షించిన విషయము దలంపవా? శ్వానములేకాదు,—అంతకంటె నికృష్ట జంతువులవలనను, నిర్జీవపదార్థములవలనను ద్రోహులెందఱో పట్టువడిరని యెఱుంగుము.

ఫ్రెంచి నృపాలుఁడిట్లు ప్రత్యుత్తర మొసంగెను—"మాదేశమున నొకఁడు కుక్కతోఁ బోరాడి యోటమిగాంచుట యథార్థమె. కాని, యది పూర్వమెన్నఁడో సంభవించెను. ఇప్పుడవి లనుకరించు టసంగతము. మఱియు నాఁటి ప్రతివాది యల్పుఁడు కాని, కాన్రేడువంటి పాలకు నట్టి హీనకృత్యమునకు నియోగింపరాదు."

"ఔను. ఇట్టి యుత్కృష్టశ్వానముతోడఁ గాన్రేడువంటి కుటిల విద్రోహినిఁ బోరాడ నిచ్చుట ప్రమాదకరమే—అట్టి ప్రమాదము నా కసమ్మతము. కావున నేనే యుద్ధ మాచరింతు. నృపాలుఁడొక పాలకునికన్న మిన్నగదా."

ఆంగ్ల నృపాలుఁడట్లు పలికి, సమరాహ్వాన పూర్వకముగాఁ దన చేతి తొడుగు నేల విసరెను. ద్వంద్వయుద్ధమున కియ్యకొనువాఁడా తొడుగు దీయవలయు.

కాని, కాన్రేడు రయమ్మున నటులొనరింపలేదు. ఆ లోపున ఫ్రెంచి నృపాలుఁడు లేచి యిటులనెను.—"రాష్ట్రపాలకునకును శునకమున

కును నెంత వ్యత్యాసము గలదో, నృపాలునకును, బాలకునకును— క్రానేమునకును గూడ నంత వ్యత్యాసము గలదు. ఆంగ్లసోదరా! ఇటు లొనరింపరాదు. నీవు సకల క్రైస్తవ సేనాధ్యక్షుఁడవు; క్రైస్త వాన్వయఖడ్గమవు; తద్రక్షణ మొనరించుడాలువునుగదా— మేమంగీక రింపము."

రిచర్డుజనకున కుదయించినవాఁడును, ఆకారణమున నాతని భ్రాత యు, సుప్రసిద్ధుఁడును నగు సాలిస్బరీ ప్రభువు విలియమం తి ట్లనెను.

"ఆంగ్లదేశ నిక్షేపమగు మాసోదరుఁ డిట్టియెడ నిట్టిప్రమాదమున బాల్గొనుట నేఁగూడ సహింపను.

సోదరా! నీచేఁ దొడుగ నిలోద్ధూతమై యిటఁబడెనని యెంచి పరిగ్రహింపుము. అట నాయదివై చెదను. కళంకమున్నను, నేఁగూడ రాజకుమారుఁడ నేగదా. ఈక్రానేదు పాలకుని పూర్వోక్తమటు కనర్హుఁడఁ గాను."

తదనంతరము క్రానే డిట్టులనెను.

"రిచర్డుతోడి పోరాటమున కియ్యకొనను. నత యుద్ధసన్నుయబద్ధుఁ డయ్యు, నాతఁడు సర్వసేనాధవుఁడయ్యు ననంబద్ధముగఁ దన మిత్రుని తోడఁ బోరుట కుత్సహించుఁగాక— నేనట్టి యకార్య మొనరింపను. రిచర్డు రాజసోదరుఁడైన మఱెవ్వఁడైన నగునేని, వానిని, జెక్కాడి మదీయ నిర్దోషత్వము ప్రకటించుటకు సంసిద్ధుఁడను."

అంత టైరు నగరాచార్యుఁ డిట్లు పలికెను.— "వాక్రానేదు పలుకున దెంతయు సమంజసము. ఎవ్వరికిని యశోభంగ మొదవకుండ యీవి వాదమిఁక ముగియుఁగాక."

"అయ్యదె వాంఛనీయము— కాని, యాంగ్లనృపాలుఁడు తనదూ షణ భాషణము లుపసంహరించుకొనవలయు."

ఫ్రెంచి నృపాలుఁడట్లు పలుక, రిచర్డిట్టులనెను.— "ఫ్రెంచి నృపాలా!

మదీయ మానసమునకు విరుద్ధముగఁ జరింపను. ఆ కాన్రేడు చీఁకటి చాటున నాంగ్ల దేశ గౌరవ లాంఛనాపహరణ మొనరించిన చోరుఁడు. ఇయ్యది నాదృఢ విశ్వాసము. కాన్రేడు మాతోడి యుద్ధమున కిచ్ఛగింపఁడు, కాన, నిర్దిష్టకాలమున వానిసిఁ గదియుట కొకశూరుని నియోగింతును."

ఫ్రెంచి నృపాలుఁడిట్టులనెను—

"ఈ దౌర్భాగ్య సందర్భమున సదధికార పురస్సరముగా నేనే నిర్ణయింపవలయు. నేఁటి కైదవ దివసమున నీద్వంద్వయుద్ధము శూర శ్రేణీ నియమబద్ధమై కావలయు. ఆంగ్ల నృపాలుఁడగు రిచర్డు నియోగించు శూరుఁడు వాఁడె. మాంటుసరాటు రాష్ట్రపాలకుఁడగు కాన్రేడు ప్రతివాది. కాని, యీపోరాటమున కనువగు తావరయుట కష్టము. మన శిబిరాంతర ప్రదేశ మేర్పఱతుమేని, మన సైనికులిటు నటుఁజేరి పరస్పర యుద్ధమునకుఁ దలపడుదురు."

ఆంగ్లనృపాలుఁ డీయుపాయ మెఱింగించెను. "సలాఉద్దీనుసుల్తాను మ్లేచ్ఛుఁడయ్యుఁ గడు నుదారహృదయుఁడు, విశ్వసనీయుఁడు. ఇంతకంటెఁ బ్రథితగుణగరిష్ఠుఁడగు శూరునిఁ గాంచుట దుర్లభము. స్థలనిర్ణయభారము వహింపవలయునని మనమాతని నర్థింతము. ప్రమాదము సంభవించునని భయపడుచుంటిరి కాన, నే నిట్టి హితమొసంగితి—నన్యథా తలంపకుఁడు. నాకట్టి భయములేదు. శాత్రవుఁడు తోఁచునదే నాకు యుద్ధరంగము."

ఫ్రెంచి నృపాలుఁ డిటులనెను.—

"మన దౌర్భాగ్యస్థితి మనవైరియగు సుల్తానరయుట సంతాపకరము; ఐనను, స్థలనిర్ణయ మేర్పఱుపుమని యాతనిఁ గోరుదము. ఇఁక నీసమావేశము ముగింతము. మతయుద్ధ సమయ బద్ధులమగు మన మీపగిది నంతఃకలహానిమగ్నులమగుట దురదృష్టము. నాయకు

లారా! శూరులారా! మీమీ సైనికు లీకారణమున నింకను గల హింపకుండ నిరోధింపుఁడు. ఈతగవు దైవమే పరిష్కరించును. ధర్మము జయించుఁగాక, యని దైవమును ప్రార్థింపుఁడు."

తథాస్తు, తథాస్త్వని యంద ఱనిరి. అంతట సన్యాసి శూర నాయకుఁడు కాన్రేడు శ్రవణమున నిట్టులనెను.—"దైవమా! నన్ని శునకము కాటినుండి రక్షింపుమని ప్రార్థింపరాదా?"

"చాలు, చాలు! నిదు శ్రేణీనియమములకు విరుద్ధముగా నెట్టి కార్యము లొనరించుచుంటివో దయ్యము బయలు పఱుపఁగలదు, భద్రము."

అట్లు కాన్రేడు బదులాడ, సన్యాసి శూరనాయకుఁడు మగుడ నిట్లనెను.—

"ద్వంద్వయుద్ధమునకుఁ గృతనిశ్చయుఁడవై యుంటివా?"

"మిత్రమా! దాచనేల :—అమానుషాకారుఁడగు రిచర్డును దాఁకుటకు మాత్రము భయపడితి సుమా. తదపాయము తొలంగె. ఇఁక నా కండాగర్భసంభవుఁడైన, మఱెవ్వఁడైనను వెనుదీయను."

కాన్రేడట్లు మనసు విచ్చి పలుక, నాతని మిత్రుఁడగు సన్యాసి శూరుఁ డిట్లు పలికెను.—"ఇట్లు విశ్వాసబద్ధుఁడవై యుంట శ్రేయస్కరము. కాని, ఒకకుక్క యెంత పని యొనరించెను! నీకుయుక్తులకును, చరఘాతుని ఖడ్గమునకును నసాధ్యమైన పని యీజంతువునకు సాధ్యమాయెను. మనము తలపెట్టిన క్రైస్తవ సఖ్యవిధ్వంసన మీ శ్వానదంష్ట్రా ప్రయోగమున నెఱవేఱెననియే చెప్పవచ్చును. ఫ్రెంచి నృపాలుఁ డెంత గంభీరముగనున్నను, నిజ మనఃప్రభవానంద మడంచుకొనఁజాలకపోయెను: ఇఁక నీ సంయుక్త యుద్ధమునుండి తొలంగి పోవచ్చుఁ గదా యని యాతఁ డెంతేని సంతసించును. ఆంగ్లరాజ కృతపరాభవసంస్మరణమున ఘూర్ణిల్లు నాస్ట్రియానృపా

లుఁడు తన కషాయము వొరయకుండ తన కసి దీరునని సంతోషించెను. తక్కుంగల నాయకులు గూడనుండు మాస్ట్రియాభూపాలుఁడ రుదెంచెను"—"ఆస్ట్రియానృపాలా! ఎంత సంతాపకరము! ఇట్టి విఘాతము—"

ఆస్ట్రియానృపాలుఁడగు రీపాలుఁడాతని వారించి యిటులనెను.—"మనమతయుద్ధము గుఱించితిరా? ఈ యుద్ధ ప్రయత్నము తునియ లగుఁగాక—మనగృహములందు హాయిగనుందుముగాక. రహస్యము సుమా."

కాన్రే డిటులనెను.—"రిచర్డు తన పరాక్రమము మిత్రులపైఁ జూపక శాత్రవునిపైఁ జూపునని యాశించి, భృత్యులవలె వినయ విధేయులమైయుంటిమి గదా. ఆ రిచర్డే మన సఖ్యము విచ్ఛిన్న మొనరింపఁ బూనుకొనెనే!"

ఆస్ట్రియానృపాలుఁ డిట్లు బదులాడెను.—"ఆంగ్లనృపాలుఁ డెవ్వని కంటెఁ బరాక్రమవంతుఁడు? ఉదాత్తహృదయుఁడగు కాన్రేడు ద్వంద్వ యుద్ధమున రిచర్డును నిక్కముగ భంగపఱుపఁగలఁడు. ఆతఁడు పర శువు జక్కఁగఁ బట్టనేర్చెను, శూలయుద్ధమున నంత ప్రవీణుఁడు గాఁడు. క్రైస్తవాన్వయ క్షేమంకరులగు స్వతంత్ర నృపాలురు పర స్పర భుజాస్ఫాలన మొనరించుట తగదని యూరకుంటిని గాని, తొంటి కలహము బురస్కరించుకొని నేనే యాతనిఁ దాఁకియుండుదును. మిత్రమా! నీ వంగీకరింతువేని యింకు నీసహచరుఁ డనౌదును."

సన్యాసి శూరుఁడు రెండవ సహచరుఁ డాయెను. ఆస్ట్రియా నృపాలుఁ డమారీ కాన్రేడులను దన యావాసమున కాహ్వా నించెను.—"మిత్రులారా! ఈ మధ్యాహ్నము నామందిరమున విశ్ర మింపుఁడు. మనోహర మధురసాస్వాదన మొనరింపుచు నీ విషయ మాలోచింతము."

ఆస్ట్రియానృపాలుని వేడుక చెలికాఁడగు వాచాలుఁడు సభ ముగిసినంతఁ దన తేనితోడ నేయుండెను. నాయకులు మువ్వురు వెడలిన పిమ్మట విదూషకుఁ డరుదెంచి, తమ ప్రభువు సన్యాసి కాన్రేడులతో నేమి సంభాషించెనని ప్రశ్నించెను. వాచాలుఁ డిటులనెను.—"అవివేకీ! ఇంత కుతూహలము వలదు. ప్రభువువారి యాలోచనలు నీకుఁ దెలుపరాదు."

"వివేకీ! మన మిరువుర మేక ప్రభు నాశ్రితులము. నీవలె నేను నెఱుంగవలయు."

"తా నిక యుద్ధవిముఖుఁడనైతిననియు, స్వదేశమునకుఁ బోఁ జూతుననియు మన ప్రభువు కాన్రేడుతోఁ జెప్పెను."

"అటు లాలోచించుట వివేకమే, కాని యటు లనుటమాత్ర మవివేకము."

"మఱియొకటి. ఆంగ్లనృపాలుఁ డెవ్వరికంటెను నధికపరాక్రమవంతుఁడు కాడనియు, ద్వంద్వయుద్ధమున విశేషసమర్థుఁడు కాఁడనియు గూడ బలికెను."

"ఇంత మూర్ఖమా! తరువాత?"

"మఱచితి—ద్రాక్షరసము చవిజూచుటకు వారి నాహ్వానించెను."

"ఉత్తమమైన పని. తరువాత?"

"మఱి విశేషములేదు. రిచర్డుతోడ ద్వంద్వయుద్ధ మొనరింపవలసిన యవకాశము బోగొట్టుకొంటిననని విచారించెను."

"ఇంతటి యవివేకమా! కానిమ్ము. ఆ మూర్ఖాగ్రేసరు ననుసరించి మనము గూడ మధువు ద్రావుదము."

ఆంగ్లరాజాజ్ఞ యగుటవలన నీగ్రోబానిస యరుదెంచి యథావిధం బుగ సాష్టాంగ మాచరించి వినయవినమ్రుండై నిలిచెను. ఆతఁడత్యంత గౌరవపురస్సరముగా నథోవదనుఁడగుట మేలాయెను. లేదేని, యాతనిఁ బరిశీలింపఁగడఁగిన నృపాలుని తీక్ష్ణవీక్షణము సహించుట కష్టము. అనంతరము రిచర్డిట్లనెను.—

„నీ రహస్య భేదన మెంతయు శ్లాఘనీయము. కార్య మింత మాత్రమునఁ దీరునది కాదు. ఆ దురాత్మునకు మత్పతాకాపహర్త తదుచిత ఫలమనుభవింప వలయు. మచ్ఛూలఘాతమున నేనే వాని నడఁచి యుండును. కాని, కారణాంతరములచే నట్టి యవకాశము లేక పోయెను. పతాకాపహర్తయగు కాన్రేడును మఱియొక శూరుఁడును నిరభ్యంతరముగాఁ బోరాడఁగల స్థలమేర్పఱుప వలయునని సుల్తానునకు సందేశమంపుచుంటిని. తత్స్పర్ధన వీక్షణార్థ మాతఁడరుదేరవలయునని యాహ్వానింతును. ఈ సందేశభారము నీవే వహింపవలయు. మఱియు, ద్రోహియగు కాన్రేడును దాఁకి యశోపార్జన మొనరింప నాకాంక్షించు శూరుఁడొకఁడైనను సుల్తాను శిబిరమున నుండక పోఁడని తలంతును. సత్యనిరూపణార్థము కదన మొనరించుట శూరులెల్లరకుఁ జెల్లుఁగదా!"

బానిస యంతట మోమెత్తి, కను నాతురావేశముతోడ నృపాలుని వీక్షించి, నయనములు బాష్పజలోద్దీపితములగు నట్లు కృతజ్ఞతాపూర్వకముగా నభంబుజూచి, యాతఁడు సంతసించునటు లంగీకారము గూడ సూచించి యథావినయ వినమ్రుఁడాయెను. నృపాలుఁడిట్లనెను.

„నీవిందుఁ దోడ్పడనుంటివి. మేలు. నీవంటి మూగపరిచారకుఁ

డుంట క్షేమకరము: మాటాడమి, మాతోడ వాదింపక, సమాధాన మరయక కార్యమొనరించుటకు మాత్రము సంసిద్ధుఁడవు. ఆంగ్లసేవకుఁ డాయెనేని, యధిక ప్రసంగమునకు దొరఁకొని, యిట్టి మహత్తర కార్యమునకు నాంగ్లేయునివినా వేఱొకని నియోగించుట యనుచితమని హితమొసంగును. మదీయ సోదరుఁడును ఇతరాంగ్ల శూరులును గూడ నాంగ్లపతాకాపహర్తను దాఁకుటకుఁ గడు నాతురులు. ఇఁక ఫ్రెంచి జనులన్ననో—కాన్రేడు తోడఁ బోరాడగల శూరునికొఱకు సుల్తాను శిబిరమున నేల వరయవలయునని యెంతయో శంకింపుచుఁ దద్రహస్య మెఱుంగుటకుఁగూడఁ బ్రయత్నింతురు. నీవో! ప్రశ్నింపక అరయక, కార్యమొనరింతువు."

నీగ్రోపరిచారకుఁడు మఱల వినయవినమ్రుఁడై తన యంగీకారము దెలుప, నృపాలుఁ డాకస్మికముగా నిట్లు ప్రశ్నించెను—"నీవు మేరీ కన్నియను గాంచితివా?"

నీగ్రో పరిచారకుఁడు మాటాడఁబోయినట్లు యాననమెత్తెను; లేదని తెలుపుటకుఁ బెదవులు సంచలించెను. కాని, యట్టి ప్రయత్నము వ్యర్థమై యంతరించెను. వాఁడు మూఁగవానివలె బెకబెకలాడ నృపాలుఁ డిటులనెను. "ఆహా! అపూర్వసుందరాంగియగు మద్బాంధవి నామశ్రవణ మాత్రమున మూఁగ మాటాడఁజాలుఁగాఁబోలు! తదీయ సందర్శన మెట్టి యద్భుత మొనరించునో! ఓయీ, పరిచారకా! చూచెదఁగాక, మదాస్థానమునందలి సౌందర్యరాశిఁ గాంచి, సుల్తాను దౌత్యమొనరింపుము."

బానిసనయనమునుండి సంతోషమయ వీక్షణమొక్కటి వెలువడ నాతఁడు మఱల మోఁకరించెను. అతఁడు లేచుచుండ నాతని భుజము గట్టిగఁబట్టి రిచర్డు గంభీరాననుఁడై కఠినవిస్పష్టస్వరమున నిటులనెను.

"రాజకన్యాసందర్శన ప్రభావమున నీవు మాటాడఁ జాలు

దేమో!—కాని, నీవు మాటాడుదేని, యొక్క మాటాడుదేని, నీనాలుక పెకలింతును; దంతము లొక్కొక్కటి యూడఁదీయింతును. భద్రము! నీవు మూఁగవాఁడవు—అటులే యుండవలయు.”

వల్లె యని నీగ్రోసవినయముగా శిరము వాల్చెను. నృపాలుఁడు మగుడ నిట్లనెను.—“నీవు బానిసవగుటచేత నిటు లాజ్ఞాపింపవలసి వచ్చెను. నీవు సమ్మూఘుఁడవైతివేని, నీమాటయే విశ్వసించియుందును. ఈసమయమున మూకీభావము కడు నవసరము.”

అనంతర మాతఁడు నెవిల్ నామధేయుఁడగు *సమాహర్తను జీర యిట్లనెను.— “నెవిల్! ఈ బానిసను మద్రాజ్ఞీమందిరమునకు గొంపోయి, మతోన్నారి నేకాంతము సందర్శించుట కనుజ్ఞ యొసంగవలసినది నివేదింపుము. వీఁ డొక సందేశము వహించువాఁడు. అవసరమగునేని నీవు త్రోవ చూపుము. అట్టి యవసరముండదు లే—మన శిబిరమంతయు నెఱిఁగినట్టులే వీఁడు చరించుట యాశ్చర్యకరము. నీగ్రోమిత్రమా! నీపని శీఘ్రముగ ముగియవలయు.—అర గంటలో మగిడి రావలయు.”

నీగ్రో బానిస వినయగౌరవ పురస్సరముగా నవనతశిరస్కుఁడై కరములు బంధించుకొని, యాంగ్లోద్యోగితోఁ బోవుచు నిట్టులనుకొనెను.—“ఆహా! ఈనృపాలుఁడు మద్రహస్యము గ్రహించియుండును—గ్రహించెను, సందేహములేదు. రాజహృదయము సువ్యక్తము. ప్రమత్తుఁడనైఁ పతితుఁడనైఁ హీనాతిహీనత్వమునఁ బొరలాడు నేను దుష్టమానవాధముఁడగు కాన్రేడును దాఁకి పునరుద్ధృత ప్రతిష్ఠుఁడనగు నవకాశ మీతేఁడు కలిగించువాఁడు. నేరారోపితుఁడైనంతనే కాన్రేడు వీక్షణము భయకంపితమాయెను. అధరము వడంకెను. వాఁడే ద్రోహి! మత్ప్రియశ్వానమా నీ ధర్మము చక్కఁగ నిర్వర్తిం

* రాజగృహోద్యోగి Chamberlain.

చితివి; తదుచితప్రతీకారము తప్పక యొనరింతును. కాని, యే కాంతామణి సందర్శన మసాధ్యమని నిస్పృహజెందితినో, యాకాంతామణినే యిపుడు గాంతుఁ గదా! దీనిభావమేమి? చేయరాని యపరాధ మాచరించి బహిష్కృతుఁడైన వాని కిపుడు నృపాలుఁడు మేరీ దివ్య సందర్శన భాగ్యమేల కలిగింపవలయు? సుల్తాను సందేశము గొను వ్యాజముననైన నాకేల యనుజ్ఞ యీయవలయు? రాజ సోదరికి మ్లేచ్ఛుఁడు ప్రణయలేఖసంపుట, నావంటి యధముఁడా లేఖఁ గొని వచ్చుట,—పరస్పర విరుద్ధములు! రిచర్డెట్లు సహించెనో, యేల సహించెనో యగమ్యము. ఏమైన నేమి, తద్విచారణ ముడిగి నావని యొనరింతును. చిత్తమావేశపూరితము కానపు డాంగ్లనృపాలుఁడు సరళముగ నుదారముగనుండును. పోయిన గౌరవము మగుడ నిలుపుకొనుట కవకాశమిచ్చు మహారాజు నందనీయుఁడు. ఎంత బాధాకరముగనున్నను, కృతజ్ఞతాబద్ధుఁడనై యాతని యాజ్ఞ శిరసావహింతును. కాని, ఎంత విపరీతము! సింహహృదయుఁడని పేర్వడసిన మహనీయుఁ డింగిత మెఱుంగవలదా? నాఁటి మహాప్రదర్శనమున ననన్యసాధారణములగు బలపరాక్రమములు ప్రదర్శించి సర్వజన సమక్షమున నాభానురాంగి యొసంగిన బహుమాన మందుకొంటినేగాని, మాటాడి యెఱుంగను. పరిచారబానిసనై యీనికృష్టవేషమున నే నామెను సందర్శింపవలయునా? నేనే యిట్టి హీనకృత్య మొనరింపవలయునా? నృపాలుఁడు నాయవస్థ గుర్తించియుండడు. ఐనను, మేము పరస్పర దర్శన మొనరించి పరస్పర పరిచయ మొనరించుకొనుటకు నవకాశ మొసంగెఁ గదా. కృతజ్ఞుఁడను."

కణుతుని యాలోచనము ముగియుసరికి వారు రాణి మందిరము సమీపించిరి. ఆంగ్లోద్యోగిని గాంచినంతనే ద్వారపాలకులు దారి యొసఁగిరి. కణతుఁడు మఱువఁజాలని తొల్లిటి గదియం దాతని

నుంచి, యుద్యోగి రాజ్ఞీసాన్నిధ్యమునకుఁ బోయి, మూర్ఖుఁడగు బోయప్రభువువలెఁగాక, వినయగౌరవములు సముచితముగా వ్యక్త పఱచి, రాజాభిమతము విన్నవించెను. ఆ కలకంఠి పకపక నవ్వి యిట్టు లనెను.—

"నెవిల్! నీగ్రోదాసుఁడా? సుల్తాను ఇట్టి సందేశ మిట్టి వానిచే నంపెనా? ఏమంటివి—నీగ్రోకదా—నీలవర్ణము, పొట్టేలువలె నుంగరములు గట్టిన శిరము, చదును ముక్కు, తుట్టపెదవులు—ఇట్టి రూపు రేఖలుగలవాఁడే గదా నీగ్రో."

"దేవీ! మహమ్మదీయుల వంకకత్తులవంటి కాళ్లుకూడను—" అని యొక చెలికత్తె యందీయ, రాణి యిట్టులనెను.—"కాదు, మన్మథబాణసన్నిభము లనవలయు—వాఁడు ప్రణయసందేశముగొని వచ్చెఁ గదా. ఓయీ! నెవిల్! కాలహరణ మొనరించు వెరనర యఁజాలని నూవంటి స్త్రీల కానంద మొనఁగూర్చువాఁడవు సుమూ, నీవు. నే నీప్రణయదూతను గాంచవలయు. తురుష్కులను, ఇతర మహమ్మదీయులను జూచియుంటిఁ గాని, నీగ్రో వానిని జూచి యెఱుఁగను."

"దేవీ! నీయాజ్ఞ యమోఘము, నృపాలుఁ డాగ్రహింపకుండ మాత్రము చూడుము. ఈబానిస నీవు తలంచునట్టి యాకృతిగల వాఁడు కాఁడు,—విరుద్ధముగనుండును."

"మఱియు మంచిగి. మేమనుకొనునకంటె వికృతాకారుఁడా! సరసుఁడగు సుల్తా నిట్టి వానిచేఁ బ్రణయసందేశమంపునా!"

రాణి యటు లపహసింప, నాచెంతనున్న యొక పరిచారిక యిటు లనెను.—"దేవీ! సందేశహారుఁడగు నీ శూద్రుని మేరీ చెంతకు నూటిగఁ బోనిమ్ము, వారింపవలదని ప్రార్థింతును. తొంటి వినోద మెంత పని యొనరించెనో యెఱుంగుదుము గదా."

పరిచారిక యట్లు హితమొసఁగింప, నామె వాక్కులను నిరసించియు, రాణి యిట్టులనెను—"నెవిల్ ! మొదట వీనిని మేరీ చెంతకే గొంపొమ్ము. వాఁడు మూఁగగదా ?"

"చిత్తము, దేవి !"

"ప్రాచ్యకాంతల కెంతటి యదృష్టము ! తమ చెయ్దము లన్యులకుఁ దెలియునను భీతి యెఱుఁగక వారు వినోదము లనుభవింపఁ గలరు గదా. మన శిబిరముననో ! మన మాటలన్నియు బట్ట బయలే."

"దేవీ ! మన ముందునది పటకుటీరమను విషయము విస్మరించుటయే యందులకుఁ గారణము."

ఆంగ్లసమ్రాజ్ఞి యట్లు పలికి మఱి కొంతయేమియో సంభాషించి, నీగ్రో చెంత కరుదెంచెను. మేరీ మందిరము వేఱొక యెడఁ బ్రత్యేకముగ నమరియుండెను. వా రటు వోయిరి. ఒక పరిచారిక యరుదెంచి రాజాజ్ఞను గను దేవికి విన్నవించి యనుజ్ఞవడసి, నీగ్రో బానిసనులోనికిఁ గొంపోయెను. ఆంగ్లోద్యోగి యవ్వల వేచియుండెను. బానిసను బ్రవేశపెట్టిన దాసి యనుజ్ఞాతయై వెడలెను. మేరీ, నీగ్రో యును మాత్ర ముందుండిరి.

నీగ్రో వేషధారియగు శూరునవస్థ వర్ణనాతీతము. అపుడాతఁడు సుల్తాను బానిసగదా. తదనుగుణముగనే యాతఁడు చరింపవలయు. ఆ భాగ్యహీనుఁడు నయనములు డించి, చేతులు జోడించి మోకరించెను. అట్టి దైన్యమున కగ్గమైన దాతని శరీరమేగాదు. తదవసరావమాన భరమ్మున నాతని హృదయము క్రుంగిపోయెను. రిచర్డును గాంచినపుడు మేరీ యెటులుండెనో యిపుడు నటులే యుండెను. వేసవి రాత్రియందలి ఛాయశోభాయమానమగు ప్రకృతిదృశ్యమును మాటుపఱుపక తత్సౌందర్యమును మందగింపఁజేయును: రాజసోదరి తాల్చిన

నల్లని ముసుం గట్టులే యుండెను. సుగంధబంధురమై యపూర్వకాంతులు వెదచల్లు దీపముబట్టి యామెచ్చెకంటి యొక యడుగువైచి, మోఁకరించిన బానిసను సమీపించి, వాని వదనము బరిశీలించుటకో యన దీపమెత్తి, వాని యాకృతి యచటి తెరప్తైఁ బడునట్లు లాదీపము సవరించి, యొక తడవూరకుండి, దురంతవిషాదాక్రాంత స్వరమున్మైన నిశ్చలముగ నిట్లనెను—

"నీవా! చిత్రకలాంఛనుఁడవు ధీరాత్ముఁడవు, కణతుఁడవు నీవేనా? నికృష్ట ప్రచ్ఛన్నరూపము వహించి, శతాపదలం గ్రణీకరించి యరుదెంతువా?"

రాజసోదరి యట్లు సకరుణముగా సంబోధించునని కణతుఁడనుకొనలేదు. తదవసరావేశమున నాతఁడు సముచితముగఁ బ్రత్యుత్తరమీయఁబోయెను. తదుత్తరము విద్యుద్వేగమునఁ బెదవులఁ జలింపఁబోయెను. కాని, రాజాజ్ఞ యంతలోఁ దలంపునకు వచ్చెను. మఱియు నాతఁడు మాటాడకుండుట కొడఁబడియుండెఁగదా. ఆ కలకంఠి పలుకులు వినులఁబడెను. చాలు నదియే శాశ్వతదాస్యమునకుఁ దగిన పరిహారమని సంతసించి, తన యవస్థ కడుంగడు నపాయకరమని గుర్తించి మేరీ పరామర్శకు సమాధానపూర్వకముగా నాతఁడొక పెద్దనిట్టూర్పు విడిచెను. మేరీ యిట్లనెను—

"ఔను. నాకుఁ దొలుతనే స్ఫురించెను. ఆంగ్లపతాకాపహర్తను బట్టుట కొఱకు నీవు జార్జిదిబ్బపై నుండినపుడే నీ యాకృతి గుర్తించితిని. తన కొఱకు సేనాపరాయణుఁడై యద్భుత బలపరాక్రమ ప్రదర్శన మొనరించు శూరునరయఁజాలని కాంత యొక కాంతయే? ఓయీ! మేరీతోడ నిర్భయముగా సంభాషింపుము. ఆమె నామము బురస్కరించుకొని శూరకృత్యము లొనరించి యుంటివిగదా! నీ విపుడు కష్టసాగరమున మునిఁగియున్న నేమి—నిన్ను సముచితముగ

సంభావింపఁగలదు. ఇంకను మాటాడవేమి? ఘనలజ్జా భయాధీనుఁడవై మాటాడవు కాఁబోలు? నీవు భయమెఱుంగవే! సిగ్గు నీకుఁ గాదు. నీ కపకృతి యొనరించిన వారలకు."

తన ప్రణయదేవత ప్రసన్నురాలై యీ పగిది భాషింపుచున్నను, శూరుఁడు మాటాడ నేరకపోయెను. అట్టి విషమావస్థ కడుంగడు దుస్సహము. కాని, యాతఁడేమి చేయఁగలఁడు? చిచ్చువంటి తన మనోవేదన వ్యక్తమగునట్లు లుస్సురని నిట్టూర్పు పుచ్చి, యాతఁడు పెదవులపై వ్రేలువైచుకొనెను. అట్టి ప్రవర్తన సహింపని యట్లు రాజ సోదరి వెనుకకుఁ బోయెను—

"ఏమి! వేషమునసే గాదు, కార్యమునఁగూడ మూఁగయేనా? ఇటులుందువని, తలంపనైతిని. కాదు. భవదీయ సేవాప్రశంస ధారాళముగా నొనరించితినని నిరసింతువు గాఁబోలు? అట్టి దురభిప్రాయము వలదు. సత్కులప్రసూతలగు రాజపుత్రికలు తమ యంతరమెఱింగి వర్తింతురు. తమ యాభిజాత్యము భంగపడకుండ యెట్లు చరింపవలయునో యెఱుంగుదురు. సాంప్రదాయసిద్ధమగు హద్దు మీఱకనే, స్వీయసేవాపరాయణుఁడై తత్కారణమున సంకటపడు శూరునెడఁ దన కృతజ్ఞత యెట్లు చూపవలయునో యరసి మెలంగను. ఏమి! చేతులు కట్టనేల? అధికావేశమున దత్పీడన మొనరింపనేల?" అం తలో నొక యూహ పొడమ, నామె విహ్వలించి మగుడ నిటులనెను. "ఆహా! మహమ్మదీయక్రూరులు నీ నాలుకఁగోసి యుందురా? శిరఃకంపన మొనరింతువు. మంత్రబద్ధుఁడవా? మాత్రమో, మహార్ఘ్యమో, నిన్నిఁకఁ బ్రశ్నింపనొల్లను. నీ చిత్తము చొప్పుననే చరింతువుగాక, నేనును మూకీ భావము దాల్పఁగలను."

శూరుఁడు తనయవస్థకై పొగులుచు, తను నట్లు నిందింపవలదని సన్న యొనరించి కాంచనాంచితమగు పట్టువస్త్రము విప్పి, యందలి

సుల్తాను లేఖ యీయామె కందిచ్చెను. రాజసోదరి యా జాబు నిర్లక్ష్య ముగ బరిశీలించి, యటవైచి, శూరుని మగుడ దిలకించి మందస్వర మున నిటుల నెను—"ఈ కార్యనిర్వహణము బురస్కరించుకొని యొక్క మాటాడ రాదా?"

శూరుఁడు మాటాడరాడు. కాని, యాతని మానస మధికమనో వ్యథానల తప్తమాయెను. తదనుగుణముగా నాతఁడు మోము గొట్టు కొనెను. కాని, యా మానిని క్రోధావేశమున వెనుదిరిగి యిటు లనెను.—

"పొమ్ము! ఒక్క పలుకాడ నిచ్చగింపని వానితోడ నిష్కారణ ముగా మాటాడితిని. పొమ్ము! నేను నీ కపకార మొనరించితినిబో, తదుచిత ప్రాయశ్చిత్త మొనరించుకొంటిని; నాఁటి రేయి సగౌరవ ముగా నాంగ్లపతాకము రక్షింపుచు నా కతంబున నగౌరవ పంక నిర్మగ్నుఁడవైతివేని, ఈ యవసరమున బేల నైను దాధిక్యము విస్మ రించి నేనును గౌరవ భంగ మొనరించు కొంటిని."

చిత్తము గడు సంక్షోభింప, నా మానిని తన హస్తముతోడ నయ నములు మూసుకొనెను. శూరుఁడామెను డాయఁబోవ, నిజహస్తవిధ లనంబున వారించి, రాజసోదరి యిటుల నెను.—

"నిలు, నిలు! పాత్రోచితముగా నీ హృదయముగూడ బరిణమిం చెనే! ఇంకేల తడయవలయు? పొమ్ము!"

తత్సమాధానపూర్వకముగా, నప్రయత్నముగా శూరుని నయన ములు సుల్తాను జాబుపైఁ బాఱెను. రాజసోదరి యా లేఖ రయ మ్మునఁదీసి, నిందాగర్భితముగా నిట్టుల నెను—"ప్రభుభక్తి పరాయ ణుఁడగు వాని ప్రత్యుత్తరము కొఱకు నిరీక్షించు, మఱచితి. ఏమి! ఈజాబు సుల్తాను వ్రాసెనా!"

అరబ్బీ ఫ్రెంచిభాషలందు వ్రాసిన యాలేఖ వడి వడి బఠియించి,

తత్కారణోద్భూత క్రోధావేశమున నామె హాస మొనరించెను—"ఇయ్యది యూహాతీతము! ఇంద్రజాలకుఁడైన నింతటి మార్పు గలిగించునా!—అల్పనాణకములను సువర్ణము లొనరింపఁగలఁడు. కాని, క్రైస్తవ జగదేకశూరుఁడని యశముగాంచిన పురుషుని సుల్తాను పాదసేవాపరాయణు నొనరించి, క్రైస్తవకన్య చెంతకిట్టి యధమాధమ సందేశముగొనివచ్చు హైన్యమునకుఁ బాల్పడఁజాలునే? శూరధర్మము, మతధర్మమును విస్మరించెనే. మ్లేచ్ఛుని దాస్యమునకొడఁబడు వానితోడ భాషించుట నిరర్థకము. నీస్వామి సందేశమెట్లు గౌరవింతునో చూడుము—వాని కశాఘాతమున నీనాలుక వీడునపు డీసమాచారము నివేదింపుము, పొమ్ము."

అట్లు పలుకు రాజసోదరి యాలేఖ నేలఁబడవైచి, చరణమున మట్టి యటనుండి రయమ్మున వెడలబోయెను. కాని, దురంతమనోవ్యథాభరమ్మున శూరుఁడు మోకరించి, యామెను వారించుటకై తెగువజేసి యామెచేలము బట్టెను. రాజసోదరి ద్విగుణీకృత క్రోధావేగమున వెనుదిరిగి తదుచిత తీవ్రస్వరమున నిటులనెను.—

"మూర్ఖసేవకా! నా నుడులాలింపలేదా? శూరధర్మము, మతధర్మము, కాంతా సంభావనాధర్మము నుండియును భ్రష్టుఁడగువాని వోలె, సుల్తాను సందేశముగూడ దుస్సహము!"

ఆమానిని తదవసరోద్వేగమునఁ దనయంబరము లాగుకొని మెఱపువలె నదృశ్యమాయెను. ఆంగ్లోద్యోగి యా క్షణమయాతనిఁబిలిచెను. రాజసోదరీ సందర్శనము కడు బాధాకరముగ నుండెను. ఆ బాధ వర్ణనాతీతము. తాను మాటాడనని రాజసమక్షమున నొడఁబడుటచేత నింతటి యనర్థము వాటిల్లెను. శూరుని హృదయము క్రుంగిపోయెను. జీవచ్ఛవ సన్నిభముగనున్న కణతుఁడెట్టులెటులో యాంగ్లోద్యోగితోడ రాజావాసమునకుఁబోయెను. అచటఁ గ్రొత్తగ నెవ్వరో యరు

దెంచియుండిరి. నిజాధికారజనపరివృతుఁడైన రిచర్డు వారలకు స్వాగతమొసంగుచుండెను.

౨౬

రాజసోదరీ సందర్శనార్థము నీగ్రోబానిస వెడలిన యనంతర మాంగ్ల నృపాలుఁడు సమరాలోచనా నిమగ్నుఁడాయెను. ఆ సమయమున లోయప్రభు వొక యువకునితోడ నరుదెంచెను.

ఆ యువకుఁడు 'బ్లాండలు' నామధేయుఁడు, ఆంగ్లరాజ్ఞి దేశస్థుఁడు, చూచుటకాతఁడు సామాన్యముగ నుండెను. పొడవరి కాఁడు, కాయపుష్టిగలవాఁడును గాఁడు, వేషధారణము గూడ సామాన్యముగ, నిరాడంబరముగ నుండెను. వాని టోపీయందలి రత్నముమాత్ర మపూర్వముగ దీపించుచుండెను. వాని నయనములు గూడ దత్సమానకాంతితోడ వెలుంగుచుండెను. తదపూర్వోజ్జ్వలనేత్రము లొకసారి గాంచినఁజాలు, మఱచుట యసంభవము. ఆకాశనీలవర్ణాంచితమగు పట్టు పట్టి కంఠమున వ్రేలాడుచుండెను. అందొక సువర్ణతాళ మంటియుండెను. అయ్యది పాశ్చాత్యవీణ వాయించుట కేర్పడిన సాధనము.

నృపాలుని గాంచినంతనే యాతఁడు భక్తిపూర్వముగా మోఁకరింపఁ బోయెను. కాని, రిచర్డాతని వారించి, యానందపారవశ్యమున గాఢాలింగన మొనరించి, ముద్దాడి యిట్టులనెను.—

"బ్లాండల్! గానకళావిశారదా! సుస్వాగతము. ఆంగ్లనృపాలుఁడు తనకంటె నిన్నే మిన్నగ సంభావించును. నే నీమధ్య వ్యాధిగ్రస్తుఁడనైతి—నీవిందు లేకుండుట వలననే సుమా! రోగాధికమున నొకవేళఁ బరలోకప్రయాణ మొనరింపుచున్నను, భవదద్భుతగాన కళాపరిభావ

మున నను మగిడింతువని విశ్వసింతును. గురువర్యా! వీణాప్రపంచము నందలి విశేషములు దెలుపుము. విధివిరామ మరయక నానాదేశములు తిరుగాడి యుందువు. నిన్నడుగ నేల! ఉండఁగోరినను నీ వూరక యుండఁజాలవు. నీయఖండగుణసంపద యంతర్జ్వాలా సన్నిభము,—గానరూపమున బహిర్గతము కావలయు."

ఆంగ్లనృపాలుఁడంత చనవు జూపుచున్నను గాయనుఁడు మోమోట పడుచు సముచితముగఁ బలుక, రిచర్డుమగుడ నిటులనెను.—"ఓయీ! నీగాన మిపుడే యాలింతుము—పథశ్రమము బాసిననే సుమా: నీస్వర మణుమాత్రము చెదరినను నాకు దుస్సహము."

'దేవర కానంద మొదగూర్చుటకు నాస్వరమెల్లపుడు సిద్ధము. కాని, యిచట ననేకపత్రము లున్నవి. దేవర తత్కార్యాలోచనా పరులై యుందురు. వేళ యతిక్రమించెనేమో యని కూడ సంశయింతును."

"ఓయీ! అట్టి సంశయము వలదు. ఇఁక మహమ్మదీయులతోడ రణమాచరింపవలయు గదా. తత్సంబంధమగు వ్యూహము వ్రాసితిని. రిపుసేనావిచ్ఛేదనమువలె దదాలోచనము గూడ క్షణికము."

అంతవఱకు నూరకుండిన లోయప్రభు విటులనెను.—"నృపాలా! వ్యూహ మెటులూహించితివో, యందే యే సైనికులకు స్థాన మొసంగింతివో యెఱుంగఁ గోరెదను. తత్సంబంధమగు విషయము లరసి వచ్చితిని."

"లోయా! నీవు కంచరగాడిదవు సుమా—వేసడమువలె బుద్ధిహీనుఁడవు, మూర్ఖుఁడవు! సభ్యులారా! కూటములోనికి రండు! బ్లాండలు చుట్టునుండుఁడు. ఈతని వీణ యెచటనున్నది? తత్పరిచారకుఁ డింకను రాలేదా? వలదు, ప్రయాణకారణమున నయ్యది సెడి యుండును. కాన నాయది గొనిరండు."

"నృపాలా! నేఁదెలుపవలసిన సమాచారము తొలుత నాలింపుము. చాలద వ్యాఖ్యారోహణ మొనరించి డస్సినవానికిఁ బాన్పు ప్రీతికరము: నావీనుల కీ గిలిగింత వలదు."

"ఏమి! వీనులకు గిలిగింతమా? ఇది సంగీతముకాని పక్షి వెంట్రుక కాదు సుమ. లోయా! లోకైక గాయనుఁడగు నీతని సంగీతమును, గార్దభధ్వానమును నరయఁ జాలుదువా?"

"నృపాలా స్పష్టముగఁ జెప్పఁజాలను. ఈతఁడు గానకళాపారీణుఁడు, సద్వంశజుఁడు—ఈతని మాటకేమిగాని, గాయనుని గాంచు నంతనే, నాకు గార్దభమే స్ఫురించును."

"లోయా! ఈ గాయనునితోఁబాటు ననుగూడ బరిగణింప వలదా? నేనును గాయనుఁడను, ఉదాత్తుఁడను గదా."

"నృపాలా! నన్ను ఖరమంటివి గదా. ఖరమునకు సదసద్వివేక మెక్కడ ?"

లోయప్రభువు మందహాస మొనరించి యిట్లు బదులాడ, నృపాలుఁ డిట్లనెను.—

"నిజమాడితివి. ఓయీ ఖరరాజమా! నీవు మోసుకొనివచ్చిన భారము దింపివేయుము—నీలాయములోపల రయమ్మున విశ్రమింతువు గాక. సాలిస్బరీసోదరా! నీవిలోపున మద్రాజ్ఞీ నిలయమునకుఁ బోయి మన ప్రసిద్ధగాయనుఁ డరుదెంచెనని తెలిపి యామెను గొని రమ్ము. మద్బాంధవి మేరీయును రావలయు సుమా."

అట్లుపలుకు నృపాలునిదృష్టి యాక్షణము నీగ్రోబానిసపైఁ బాఱెను. వాని నెపుడు చూచినను రిచర్డు వీక్షణము భావగర్భితముగనే యుండెను.—

"హా! మా గూఢచరుఁ డరుదెంచెనా? బానిసా! లెమ్ము—నెవిల్ వెనుక నుండుము. దివ్యగానామృతము వీనులఁ బడఁ గలదు. వేచియుం

డుము. జిహ్వా పోయినను, శ్రవణేంద్రియము దక్కియుంట మహా భాగ్యమని భగవంతుని నుతింతువు.''

తదనంతరము నృపాలుఁడు వారినందఱను దలంపక, లోయప్రభువు నివేదించు సైనికసన్నాహములు గుఱించి యాలించెను. తత్సంభాషణము సమాప్తమైనంతనే, నృపాలుఁడిటులనెను.—"సభ్యులారా! ప్రశస్తమధువు తెచ్చి యీ లోయప్రభునకు సమర్పింపుఁడు. ఏ భూపాలుఁడైనను ఇట్టి యపరిమితుని, ఇట్టి స్వామిభక్తిపరాయణుని గాంచుట దుర్లభము.''

"నృపాలా! ఈ గార్దభముపయోగకరముగ నుండెఁగదా—చాలు. నా కంఠము తివ్వవలె, నశ్వరోమమువలె నిండుగా నుండకపోయిననేమి—సేవాధర్మ మొనరించితి, ప్రభుమన్నన గాంచితి."

లోయ ప్రభువట్లు తన హృదయము వెల్లడింప, రిచర్డిటులనెను.

"లోయా! ఈ పాటి యపహాసము సహింపఁజాలవా? ఇంకను జీర్ణము కాలేదా? ఇయ్యదె—యీ మధుకలశముద్రావి, కంఠాన రోధ మొనరింపకుండ లోనికిఁ ద్రోసివేయుము—కంఠము శోషిల్లు సుమా! భళి! ఒక్క గ్రుక్క నారగించితివి! ఓయీ! మనము సైనికులముగదా. వ్యాయామరంగమునందుఁ బరస్పరఘాతంబులు పరస్పరము భరియింతుము. అంతమాత్రమున మన యభిమానము కొఱఁతపడక, పరస్పరము దృఢతరమగుఁ గదా. అట్టులే, పరస్పరాపహాసంబులుగూడ మనము సహింపవలయు. కాని, నీకును ఈ గాన కళా విశారదునకును గల భేదము గ్రహింపుము. సమరవ్యాపారమున నీవు నా సహచరుఁడవు—నా శిష్యుఁడవని చెప్పవచ్చును. సంగీతశాస్త్ర పారంగతుఁడగు నీ మహానీయుఁడు నా కందు గురువు. నీ తోడఁజనవుగ మెలంగుదును. నే నాతని యాధిక్యము ననుసరించి గౌరవింపవలయు. నీ వీకఁ జీకాకు పడక యుందుఁడి యానందింపుము."

లోయప్రభువు సరసముగ నిట్లు బదులాడెను.—"నీ వింత యుత్సాహవంతముగ నుండుట మా భాగ్యము. ఈతఁడు మా డుపాత్రము లాలపించినను, వేచియుందును."

"నీ కంతటి శ్రమ కలిగింపములే." నృపాలుఁ డట్లు లనునంతలోఁ గరదీపికా కాంతి పుంజము గాన్పింప, నాతఁడు మగుడ నిట్లనెను.—"అల్లదే మా రాణి యరుదెంచు. రయమ్మునఁబోయి యామెకు స్వాగత మొసంగుము. ఆహా! నీ వస్త్రము సవరింపుచు నాలసింపకుము. చూచితివా! ఇట్టి యవకాశము బోగొట్టు కొంటివి. నీ కంటె ముందు నెవిల్ పోయెను."

నృపాలుఁ డనినట్లులే నెవిల్ నామధేయుఁడగు సమూహ ర్తయాంగ్ల రాజ్ఞీ సమీపమునకుఁ బోవ, లోయప్రభువు కటకటం బడి యిట్టు లనెను.—"ఆహవమున వీఁడు నన్నెన్నఁడు మీఱలేడు."

"లోయా! వాఁడేగాదు, భంగమున నిన్నతిక్రమించు వా రెవ్వరులేరు—అప్పుడపుడు మేము మాత్రము తప్ప."

నృపాలుఁ డట్లు పలుక లోయప్రభు విట్లనెను.—"ఆ మంద భాగ్యుని విస్మరింపరాదు. చిత్రకళాంఛనుఁ డగు కణతుఁడుగూడ నొకప్పుడు నను మించునాడు—వాడు నాయంతటి స్థూలకాయుఁడు కాఁడు; వాఁడా కారణమున సుళువుగా—"

"వాని ప్రశంసవలదు!" ఆంగ్లప్రభు వట్లు నిరోధించి, నృపాలుఁడు చయ్యన నెదురేగి తన రాణికి స్వాగత మొసంగెను. అనంతరమాతఁడు 'బ్లాండలు' నామధేయుని జూపి యాతఁడు సంగీత సార్వభౌముఁ డనియు, దనగురువనియు రాణికిఁ బరిచయ మొనరించెను. రిచర్డు గానకవితాకళాభిరుచి ప్రసిద్ధము. యుద్ధప్రియుఁడగు నాంగ్లనృపాలున కీ రెండును గూడఁ గమ్రబీతికరములు. మఱియు, బ్లాండలు నామధేయుఁ డాతనికిఁ గడు నిష్టుఁడు. రాణి యాకారణమున నా గాయను

నెంతయు నభినందించి నృపాలుఁడు సంతసించునట్లు సుస్వాగతమొసం గెను. తడవిరళ ముఖస్తుతిస్తోత్రయముల మునింగిన గాయనునకు రాజ సోదరీనిరాడంబరసమాదరణమే రుచికరముగ నుండెను. అతఁడు నిజకృతజ్ఞతా ప్రకటన మొనరించు నపుడాభావము వ్యక్తమాయెను. ఆ విషయము రాజదంపతులు గుర్తింపకపోలేదు. తన మఱఁదలు ముందు దాను నీరసమైతినని రాణి యుడికెను. గాయకుని ప్రవర్తనము తనకుఁగూడఁ గొంత వెగటుగ నున్నను, వివేకవంతుఁడగు నృపాలుఁడు తనరాణి నూఱడింపఁగోరి వారిరువురు నాలించువిధముగ నిటులనెను—"దేవీ! మా వంటి గాయనులకుఁ గఠినవిమర్శకులే గౌరవార్హులు. ఆ కారణమున మన గురువర్యుఁడు మేరీయెడ నెంతటిగౌరవము జూపెనో యరసితివా?"

నృపాలుఁడు తనరాణిని బుజ్జగించుటయేగాక, తనసోదరి నెత్తిపొడిచెను. తదుపాలంభనము సహింపక, మేరీ యిటులనెను.—"నాకే గాదు; ఈ గుణమస్మద్వంశజులందఱకును—" ఆమె యింకను బలుకవలసినదె. కాని, యంతలో నామె చూపును నీగ్రో చూపును దారసిల్లెను. అంతడనే, క్రోధ ప్రకంపితయగు మానిని వివర్ణవదనయై ధృతిదూలి యల్లన నొక యాసనమునఁబడెను. రాజసోదరి మూర్ఛిల్లెనని తల్లడిల్లి, రాణి యామెకు నుచితోపచారములు జేయింపఁబోయెను. కాని, నిజసోదరీమనోదార్ఢ్యమెఱింగిన నృపాలుఁ డామెను వారించి, యితరోపచారముల కంటె గాన శ్రవణమే సేదదేర్పఁ జాలునని పలికి గాయనుని గాంచి గానమొనరింపు మనెను.

రాజటు లనినను, మూర్ఛవోయిన రాజసోదరి కృతస్మారకయగు వఱకును దత్తరపాటున గాయనుఁడు నిరీక్షించి, తదనంతరము తన యసమానవిద్యాప్రావీణ్య మద్భుతముగఁ బ్రదర్శించెను. గానసుధారస మాస్వాదించి శ్రోతలానంద పరవశులైరి. సంగీత గంధమెఱుం

గని లోయప్రభువు మాత్రము దీర్ఘముగ, బ్రహ్మాండముగ నావులించెను. ఆంగ్లనృపాలుఁడు సంతోషపరవశుఁడై గాయనున కొక యమూల్యాంగుళీయ మొసంగెను. రాణి యొక ప్రశస్తహేమకంకణ మాతనికి బహుమానపురస్సరముగా నొసఁగెను. సభ్యులుగూడ నాతని సముచితముగా బహూకరించిరి. నృపాలుఁడంత మేరీనిగాంచి యిటులనెను.—
"సోదరీ! నీదు వీణాగానాభిరుచి యేమాయె?" రాజసోదరి విముఖత్వమున గానము వినకొల్లక, తదనంతరమా యపూర్వగాయనుని బహూకరింపక, కడు నిశ్చలముగ నుండుటచేత, నృపాలుఁ డటులనెను. ఆ కన్నియ యిట్లు బదులాడెను.—

"గానకళావిశారదుఁ డగు 'బ్లాండలు' నెడ గృతజ్ఞను. ఈ గేయము బ్రత్యేకముగాఁ బాడ నియోగించిన నీ యెడ మఱియు గృతజ్ఞను."
గాయనుఁడు పాడిన గేయమునందలి కథాభాగము మేరీ ప్రణయమును బోలియుండెను. అందొక రాజపుత్రి యన్నుత బలపరాక్రమశాలి యగు నొక నికృష్టకులుని ప్రేమించును. జనకుఁడు వాని దౌర్భాగ్యము దలంచి నిరసించును: ఐనను, రాజపుత్రీహృదయము నిశ్చలముగ వానిమీఁదనే లగ్నమై యుండుటచేత నాతఁడు కుపితుఁడై తత్ప్రణయినీప్రణయులను దనదేశమునుండి బహిష్కరించును...

తాదృశవిషయ గర్భితమగు నాగేయము మేరీ ప్రణయోదంతము వలె నుండెను. రిచర్డు నృపాలుఁ డిటులనెను.—

"సోదరీ! ఈకథయందలి నాయిక నిన్ను మించిన మూర్ఖురాలు—తద్గానశ్రవణము నీకు దుస్సహము గాఁబోలు. కానిమ్ము. రాణి మందిరమునకుఁ బోవునపుడు మార్గమధ్యమున నీతోడ మాటాడవలయు. సిద్ధముగనుండుము."

తత్సమాగతజనంబు లందఱు దమ తమ తావులకుఁ బోఁదొడఁగిరి. దేదీప్యమాన కరదీపికాశతంబులు చుట్టు నరుదేఱ, నాంగ్లరాజ్ఞి

యిష్టసఖీజనపరివృతయై, సముచితసేనా పరిరక్షితయై, తన మందిరమునకుఁ బ్రయాణమాయెను. రాజబాంధవి రాజశాసనబద్ధయై, యాతని భుజమాశ్రయించి యా వెనుక నడవఁ దొడఁగెను. నృపాలుఁ డల్లన నిట్లు ప్రశ్నించెను.—

"మేరీ! సుల్తానున కేమని చెప్పవాఁడ? క్రైస్తవనాయకులు నను వీడుచున్నారు. విముఖులైన వారి నొకసారి యుద్ధమునకుఁ బురికొల్పఁజాలితి. కాని, యీ నూతనకలహమున నాప్రయత్నము నిరర్థకమాయెను. యుద్ధమునఁగాదేని సామమునన్నైన సాధింపవలయు. ఇందలి జయాపజయములు చపలచిత్తయగు కన్నియ యధీనములై యున్నవి. ఆహా! శూలాయుధుఁడనై ప్రఖ్యాతయోధులఁ బదుగురను మార్కొనఁజాలుదుఁగాని, స్వీయలాభచింతాపరాఙ్ముఖయగు మూర్ఖురాలి చిత్తము మాత్రము మఱల్పఁజాలను. సోదరీ! సుల్తానున కేమని సమాధానమిత్తును? విస్పష్టముగఁ జెప్పుము."

ఆమె యిట్లు బదులాడెను.—"అస్మద్వంశోద్భవురాలు దారిద్ర్యమునైనఁ జెట్టవట్టుఁగాని, మ్లేచ్ఛుని మాత్రము దలంపదని స్పష్టముగఁ జెప్పుము."

"దారిద్ర్యమును గాదు, దాస్యమునని చెప్పుదునా? నీ చిత్తమున కియ్యది సన్నిహితము."

నృపాలుఁ డటు లపహసింప, నాతని బాంధవి యిటులనెను.—"నీవింతటి కఠినానుమానము బూనవలసిన యవసరములేదు. శరీరము నేవాయత్తమగుటయే జాలిగొల్పును: కాని, యాత్మయును తదధీనమగుట హేయము. ఛీ! సంతోషపరాయణులగు నాంగ్లేయులను బాలించు రాజులేనా! నీయంతటి మహాశూరుఁడై విరాజిల్లినవాని శరీరమునే గాక యుదాత్తమానసమును గూడ దాస్యశృంఖలాబద్ధమొనరించితివే."

"సోదరీ! నీవు విషరసాస్వాదన మొనరింపనుంటివి: నిన్ను వేఱు విధమున వారింపఁజాలనపుడు, తత్పాత్రమునే మలినపఱచి యీవిధమున నిను నిరోధింపవలదా?"

"నృపాలా! విషమాస్వాదింపుమని నీవే బలవంత పఱచుచుంటివి.—అయ్యది హేమపాత్రమందుంపు."

"సోదరీ! నిన్ను బలవంత పఱుపఁజాలను. ఇయ్యది దైవికము— ఇట్టి సదవకాశము బోఁగొట్టకుము. సర్వజనవంద్యుఁడగు ఎంగాడీ స్వామి గ్రహములు పరీక్షించి, బలవంతుఁడగు నా విరోధి నీ వివాహ కారణమున మిత్రుఁడగునని చెప్పెను. నీనాథుఁడు క్రైస్తవుఁడని కూడ నాదైవజ్ఞుఁడు వచించెను. కావున, నీవు సుల్తాను భార్యవగుదేని యాతఁడును, ఆతనితోడ నా మ్లేచ్ఛప్రజానీకమును మన పవిత్ర మతమవలంబింతురు. ఇంతటి యద్భుత పరిణామము దలంచి, యొకింత త్యాగము జూపుము."

"నృపాలా! ఎట్టి త్యాగమైనఁ జేయనగుఁ గాని, గౌరవపరిత్యాగము మాత్ర మసంబద్ధము. ఆత్మద్రోహ మొనరింపను."

"చక్రవర్తిని వగుట యగౌరవప్రదమా?"

"పూతక్రైస్తవ కన్య మ్లేచ్ఛుని వివాహమాడుట యగౌరవప్రదము లజ్జాకరము. ఉదాత్తక్రైస్తవ రాజవంశోద్భవ బుద్ధిపూర్వకముగాఁ బ్రాచ్యావరోధము జొరబూనుట యధమాధమము."

మానిని యగు మేరీ క్రోధప్రకంపితయై యుద్విగ్నస్వరముననట్లు పలుక నాంగ్లనృపాలుఁ డిటులనెను.—"మేరీ! నీవు మదాజ్ఞానువర్తినివై యుండవలయు. ఐనను నీతోడఁ గలహింప నొల్లను."

"నృపాలా! మనవంశరాజ్యభాగ్యవైభవములు భవదధీనములు. తద్వంశానుగతమగు గర్వమునందైన నాకుఁ బాలీయవలదా."

"సోదరీ! తత్పద మొక్కటి చాలు—నా యహంకార మంతరిం

చెను. సుల్తానున కిట్టులే వ్రాసిపంపెదను. కాని, నీవా మహానీయుని గాంచువఱకు వేచియుండుట భావ్యము గదా? సుల్తాను కడు సుందరుఁడని వినియుందుము."

"ఆతని గాంచుట యసంభవము."

"అసంభవముగాదు, తథ్యము. అస్మత్పతాకసందర్భమునఁ గావలసిన ద్వంద్వయుద్ధమునకు సముచితమగు రంగ మాతఁడే యేర్పఱుచును. తద్వీక్షణార్థ మాతఁ డరుదెంచెను. ఆ ప్రదర్శనము గాంచుటకు రాణి తత్తరపడుచున్నది. నీవు నరుదెంతువు. సోదరీ! మన యావాసములు సమీపించితిమి. క్రోధానుమానము లుడిగి యథాసఖ్యమున నందుము గాక."

నృపాలుఁ డట్లు పలికి, గౌరవాభిమానపురస్సరముగాఁ గన బాంధవి నాలింగన మొనరించి, గాయనునిగేయములందు స్మరణకు వచ్చువాని నాలపించుకొనుచుఁ దన మందిరమునకుఁ బోయెను.

తోడనే యాతఁడు సుల్తానునకుఁ బంపవలసిన లేఖలు లిఖించి, వానిని శీఘ్రో బాసిన కొసఁగి యరుణోదయముననే బయలుదేఱవలయునని యాజ్ఞాపించెను.

## ౨౭

మఱునాఁడు ఫ్రెంచినృపాలు నాహ్వానము గాంచి, యాంగ్లనృపాలుఁ డాతనిఁ జూడఁ బోయెను. సరసుఁడగు ఫ్రెంచిరాజు తదుచిత చాతుర్యము మెయి సంభాషణ మొనరించి రొనరించి, నిజదేశప్రయాణోద్దేశమల్లనఁ దెలియఁ బఱచెను. రిచర్డాతని వారింపఁ గడంగెను. కాని, తన దేశపరిస్థితు లుపేక్షింప రాదనియు, దమలోఁ దాము

బోరాడు క్రైస్తవసైన్యములతోడ బలవంతుఁడగు సుల్తానును జయించుట యసాధ్యమనియు ఫ్రెంచి నృపాలుఁడు పలికెను. కృతనిశ్చయుఁడై యున్న యాతేనితోడ వాదించుట నిరర్థకమాయెను. తదనంతర మాస్ట్రియా నృపాలాది నాయకులందఱుఁ గలసి తమ యభిమతము వ్రాసి రిచర్డున కంపిరి. ఫ్రెంచినృపాలుని హృదయ మెఱింగిన యాంగ్ల నృపాలుఁడు వారటు లొనరింతురని యెఱింగియే యుండెను. ఫ్రెంచి నృపాలునివలెఁ గాక, రిచర్డు నిరంకుశ ప్రవర్తనమును స్పష్టముగా నిరసించి, తమతమ దేశములకుఁ బోదుమని యేకగ్రీవముగాఁ దీర్మానించుకొని, వారావిషయము నాతనికిఁ దెలియఁ బఱచిరి. ఆంగ్లనృపాలుఁ డేకాకియై విజయము గాంచు టసంభవము. తదాలోచనము దుస్సహం బగుడు, నా మహాయోధుఁడు బాష్పజలార్ద్రనయనుఁ డాయెను. ఆతఁడు ధూర్తస్వభావుఁ డగుటచేత, దుష్టులును స్వార్థపరాయణులును నగు క్రైస్తవనాయకు లాతని మీఁదనే నిందవైచి యుద్ధ విముఖులగుట కవకాశము చిక్కెను.—"మదీయ జనకునిటులు విడనాడి యుందురా? ధీమంతుఁడగు నారాజాగ్రణి యిట్టి దుష్టాపవాదములకుఁ దావీయఁడే. ఆ మహానీయుఁ డన్యథా చరించెననిన, నెవ్వఁగు విశ్వసింపరే. నేనో! అవివేకిని—మూర్ఖుఁడను! ఈ నాయకులు నను విడనాడుట కవకాశమిచ్చి—నిందార్హుఁడఁ గూడ నైతిని..."

నృపాలుఁ డాపగిదిఁ జింతానలతప్తుఁడై యుండ, నాసమయమున సుల్తాను రాయబారి యరుదెంచెను. తన నృపాలుని దైన్యము జూడఁ జాలక, యాఱడింపఁ గడంగుటకు సాహసము చాలక విపరీతముగ బాధపడు లోయప్రభువా మహమ్మదీయునిఁ గాంచి యెంతయు సంతసించెను.

సుల్తాను రాయబారి 'యబ్దల్లా' నామధేయుఁడు. పవిత్రవంతమగు మక్కానగరమున కాతఁడు మూడుసారులు యాత్రబోయిన కారణ

మున నాతనికి * 'ఎల్ హాడ్గీ' యను నధికనామము గూడ సంక్రమించెను. ఆతఁడు పరమపావనుఁడగు మహమ్మదు వంశజుఁడనియు, ప్రసిద్ధ 'హాషెము' జాతిజుఁ డనియుఁ జెప్పుదురు. తదాచారానుగుణముగా నాతఁ డతివిశాల మరకత శిరోవేష్టము దాల్చెను. ఆతఁడు మతరూపస్థుఁడై యుండక యాస్థానసభ్యుఁడై, రాజాదరణ పాత్రుఁడై, తన పవిత్రతకు భంగము వారయకుండ చాటుచాటున మాత్రము నిరభ్యంతరముగా మధుసేవ యొనరించుచుండెను. అబ్దల్లా సమర్థరాజ్యతంత్రజ్ఞుఁడగుటచేత, క్రైస్తవరాజన్యులతోడి రాయబారముల కాతనినే సుల్తాను నియోగించుచుండెను. ఆతఁడు రిచర్డునకుఁ బరిచితుఁడు నిష్టుఁడు గూడ నై యుండెను.

ఆంగ్లపతాకాపహర్తయగు కాన్రేడుతోడి ద్వంద్వయుద్ధమునకు సముచితస్థల మేర్పఱచుటకును, ప్రేక్షకులు నిరపాయముగాఁ జూడఁ జాలు సన్నాహము లొనరించుటకును గూడ సుల్తాను సమ్మతించెను. మహమ్మదీయ రాయబారి యావిషయములు నివేదించినంతనే దహనాయమానమగు నిజమనోవ్యథ మఱచి రిచర్డమందానంద మనుభవించెను.

స్కాచిశూరుఁడు రెండుసారులా మరుస్థలమున విశ్రమించిన జలాశయప్రాంతమే రంగస్థలము. అయ్యది 'యెడారివజ్ర'మని పేరొందెను. ప్రతివాదియగు కాన్రేడు తన యనుచరులగు నమారీ లీపాలురతోడను, శతసైన్యముతోడను రావలయు. అట్టులే, వాని సహచరులగు రిచర్డు సాలిస్బరీలును శతసైన్య సమేతులై వానిని బురస్కరించుకొనియే తేరవలయు. మధ్యవర్తియగు సుల్తాను పంచశతసైన్య సాహాయ్యుఁడై యుండు. తనుత్రాణాది పరిరక్షితులగు రెండువంకల క్రైస్తవయోధుల కంతటి మహమ్మదీయసైన్యము సరి సమానముగనే యుం

* తైర్థికుఁడు.

డును. వారి ప్రతివాదులు దమమిత్రుల నాహ్వానింపవచ్చును: కాని వారందఱు ఖడ్గముదప్ప కవచాదులు దాల్పరాదు. ద్వంద్వయుద్ధ ప్రదర్శనావసరమున నరుదెంచు క్రైస్తవులకు సుల్తానే సముచితాతిథ్య మొసంగును. ఇట్టివిషయము లెఱింగించి, తన సుల్తానాంగ్ల నృపాలుని గాంచి యాతనికిఁ బ్రత్యేకస్వాగత మొసంగుటకు సానందముగాఁ దత్తరపడుచుండెనని గూడ రాయబారి తెలియఁ బఱిచెను. అట్లు సుల్తానొక జాబుగూడ వ్రాసెను.

ఆ యేర్పాటుల గుఱించి ఫ్రితివా ౦యగు కాంస్టేనునకును దదితరులకును గూడఁ దెలుపఁబడెను. అనంతర మా మహమ్మదీయ రాయబారి రిచర్డును మఱల సందర్శించి, గానకళావిశారదుఁడగు బ్లాండలు గానామృత మాస్వాదించి, తదుత్సాహాతిరేకమున మధురసముగూడఁ గ్రోవి, తాను నొక గాన మాలపించి, మఱునాఁడు సుల్తాను చెంతకుఁ బోయెను.

ద్వంద్వయుద్ధమున కొకదినము ముందుగ నిరుతెగలవారును బ్రయాణమైరి. ఇరువురు నొక మార్గమునఁ బోవుట యపాయకరము: రెండు సైన్యములును మార్గమధ్యమునఁ బోరాడవచ్చును. కావున వారు వేర్వేఱు తెరువులు బట్టిరి.

ఆంగ్లనృపాలుఁడగు రిచర్డెవ్వరితోడను గలహింపనొల్లక యుత్సాహరహితుఁడై యుండెను. రిచర్డు యుద్ధప్రియుఁడు. తానే ద్వంద్వయుద్ధ మొసరించుటకు వీలుండెనేని యాతఁడెంతేని సంతోషించి యుండును. అట్టి మహాద్భాగ్యము కాంస్టేడున కబ్బెగదా యని యా మహాశూరుఁడు మత్సరపడుఁడాయెను. ఆంగ్లనృపాలుఁడు విశేషయుద్ధ పరికరములు దాల్పక, యమూల్యవస్త్రధారణ మొనరించి శోభనపుఁ బెండ్లికుమారునివలె వైభవాభిరాముఁడై, యశ్వారూఢుఁడై తనరాణి పల్లకి ప్రక్క నల్లన వెడలుచుండెను. రాజ్ఞీమేరీలు తొల్లి యెంగాడీమత

మునకు మాత్రపోయినది వేతలోకమార్గము. ఆ కారణమునఁ దన్మరుస్థలదృశ్యముల గుఱించి నృపాలుఁడు వారలకుఁ దెలుపుచుండెను. ధూర్తుఁడగు తన మగఁడు సహింపఁడని రాణి వినుచుండెను; ఉత్సాహముగూడ నభినయించుచుండెను: కాని, తద్భయంకర నిర్మానుష్య కాననాంతరమున నెట్టి ప్రమాదము ఘటిల్లునోయని యా కోమలి లోలోన భయపడుచుండెను. వారి సైన్యమత్యల్పము. తదనంత మహామరుక్షేత్రమున నయ్యది యస్పష్ట రేఖాసన్నిభముగ నుండెను. క్రైస్తవశాత్రవుఁడగు సలాఉద్దీను సుల్తా ననతి దూరముననే శిబిర మేర్పఱచుకొనియుండెను. ఆతఁడు ద్రోహము దలపెట్టెనేని, వాయుజవోపేతమగు మహమ్మదీయాశ్వికదళ మాకస్మికముగఁ దము జుట్టిముట్టి సాధింపఁగలదు. మహమ్మదీయ చక్రవర్తి యెంతటి యుదారవంతుడైనను సమయము కడు ననుకూలముగ నుండుటచేత నటులాచరింపవచ్చును. తాదృశ భయకంపిత మానసయగు నాంగ్ల రాజ్ఞి యల్లనల్లనఁ దన హృదయము వెల్లడింప, నృపాలుఁ డిటులనెను.—"సుల్తానుదాత్తచిత్తుఁడు; ఆడితప్పని ధర్మశీలుఁడు; అట్టివాని ననుమానించుట కృతఘ్నతయగు—మఱియు నధమము. దేవీ! భయముడిగి, నిశ్చలముగనుండుము."

భీరువగు నాంగ్లరాజ్ఞియొక్కతయేగాదు. ధీరస్వాంతయగు రాజసోదరియు భయానుమానధీనమానస యాయెను. ఆ ప్రదేశమున శాత్రవునే విశ్వసించి పూర్తిగ నాతనిపై నాధారపడి యుండవలయు. ఆమిషముపై వ్రాలు గృధ్రములవలె శాత్రవాశ్వికు లేమిహూర్తమున బడుదురో యెఱుంగరాదు. అంతలో సాయంకాలమగుచుండెను. ఆకసమున నిలిచెడు పక్షివలెఁ దత్సమీపోన్నత ప్రదేశమున నొక రౌతు గోచరించెను. పాగాయును దీర్ఘశూలమునుజూడ వాఁడు మహమ్మదీయుఁడని స్ఫురించెను. ఆంగ్ల రాజ పరివారముం గాంచినంతనే

వాయు విహారక మొనరించు శ్యేనమువలె వాఁడు తీవ్ర్వనఁ బాఱి యదృశ్యుఁడాయెను. ఆంగ్లనృపాలుఁ డిట్టు లనెను.—

"గమ్యస్థానము సమీపించియుంటిమి. మనరాక యరసి తన తేఁకిఁ దెలియబఱచుట కొఱకే కాలిచటఁ గావలియుండెను. మహమ్మదీయజనోద్వేగములకు శృంగారి ధ్వానములు నా శ్రవణమునఁ బడుచున్నవి. సైనికులారా! నిశ్చలచిత్తులరై కాంతలచుట్టుఁ గ్రమముగా నిలిచియుండుఁడు."

తోడనే, సైనికులొక వ్యూహముగ నేర్పడిరి. రిచర్డనినట్లు, మహమ్మదీయుల మోటువాక్యములు వినవచ్చెను. లోయప్రభువు నృపాలుని శ్రవణమున నిట్లనెను.—"నృపాలా! మన చారుఁడొకఁ డాయున్నతప్రదేశ మారోహించి శత్రుపరీక్ష యొనరించుట భావ్యము గదా? అనుజ్ఞ నొసఁగుదేని, నేనే బాఱి వీక్షింతును. తత్కోలాహలము గమనింప, వా రర్ధసహస్రముందురని తోఁచెడిని. అందు సగపాలు వాద్యగాండ్రు కావలయు. పోదునా?"

లోయప్రభువు ప్రయాణోన్ముఖుఁడై తన యశ్వఖలీనము బిగించి, చరణాంకుశమునఁ దేజిని హెచ్చరింపఁబోయెను. కాని, నృపాలుఁ డాతని వారించెను.—"ఇట్టి ప్రయత్నము వ్యర్థము. దాన మన యనుమానము ప్రకటీకృత మొనరించుటతప్ప వేఱు ప్రయోజనము లేదు. అంతమాత్రమునఁ బ్రమాదము దొలంగనేరదు. కాన, నిశ్చలముగ నుండుము." వారాయున్నత ప్రదేశములు దాటినంతనే సుల్తాను శిబిరము దృగ్గోచరమాయెను.

దుర్గమ మరుస్థలాంతరమున నిర్మానుష్యముగనుండిన ప్రసిద్ధజలాశయప్రాంత మిప్పుడు జనసంకీర్ణమై కలకలలాడుచుండెను. అందొక మహాశిబిర మేర్పడియుండెను. అయ్యది మనోహర పతాకబంధురమై యుజ్జ్వలాభరణ విరాజమానమై, సాయంసమయాతపంబున సహస్ర

వర్ణములు బ్రతిఫలించుచు నత్యంత వైభవాస్పదమై యుండెను. అందలి పటకుటీరములు వివిధవర్ణములతో నలరారుచుండెను. పటకుటీర దారుస్తంభములు చిత్రవర్ణాంచితములై, సువర్ణదాడిమీఫల సమాలంకృతములై దర్శనీయముగ నుండెను. ఆప్రక్క నల్లని చిన్న చిన్న గుడారము లసంఖ్యాకముగ నుండెను. ఆయవి మహామ్మదీయ జనాగారము లైయుండును. అందు నైదువేలమంది విడియుటకుం జాలియుండెను. లోయప్రభు వాకారణ జీకాకుపడి చూచుచుండ, దక్షమాన సంఖ్యగల 'యరబ్బీ' 'కుర్దు' మొదలగు వివిధ మహామ్మదీయ జాతులవారలు తమతమ యశ్వములతోడ బారులు తీరం దొడంగిరి. వారి వీరవాద్యములు పాశ్చాత్త్యులకు దుస్సహముగ, నసంబద్ధముగ, కఠోరముగ నుండెను.

ఒక తీరులేక వారంతయు నొక రాశిగాం గూడియుండిరి. తద్వీర వాద్యములకంటెను కఠోరమగు ధ్వానమొండు వెలువడినంతనే, తత్సాంకేతికము బురస్కరించుకొని మహామ్మదీయులు హయారూఢు లైరి. తద్గమనసరోద్ధూత రజఃపటలము మహామ్మదీయులను వారి శిబిరమునుగూడం గప్పివైచి వింతవింతరూపములుగం గాన్పించెను. మఱియొక కఠోరధ్వానము వెలువడినంతనే, యా మహామ్మదీయాశ్వికదళము కడు రయమ్మునం బరుగిడి యల్పమగు నాంగ్లజనంబును జుట్టి వైచెను. పరాగమెత్తినటులు ధూళిరేగెను. ఆంగ్లేయులు కనువిచ్చి చూచునంతనే, ఘోరాకారులగు మహామ్మదీయులు తమ దీర్ఘ శూలము లెల్ల దిశలు ద్రిప్పుచు, ఘోరతరంబుగ నఱచుచుం గేగుచు, నేకశూలమాత్ర దూరమునం దోంచిరి. ఒకింత దవ్వున నుండిన వారాంగ్లేయుల మస్తకములు మీందుగ నవిరళముగా బాణవృష్టి గురియించిరి. అందొకటి యాంగ్లరాణి పల్లకినే దాంకెను. భయాతిరేకమున నామె కెవ్వున నఱచెను. మోము జేవురింప, నాంగ్లనృపాలుం

డిటులనెను.—“హా! మితిమీఱినది—మ్లేచ్ఛాధములకు బుద్ధి సెప్ప వలయు—”

నృపాలుఁ డాగ్రహాధురీణుఁ డాయెను. కాని, తత్సమీపమున నున్న రాజసోదరి తన యందలమునుండి తొంగిచూచి యిటు లనెను.—“సోదరా! తీవ్రపడకుము! ఈ బాణములు నిర్బాధకము లని గాఱుంగవో!”

మేరీ పలుకు లమోఘములు. బాణములకు నిక్కముగ మొనలు లేవు. తన సోదరి సమయజ్ఞానమున కెంతయు సంతసించి, తన యవివేకమునకు లజ్జించి నృపాలుఁ డిటులనెను.—

“సైనికులారా! చలింపకుఁడు. ఇయ్యది సుల్తాను జనులు మన కర్పించు స్వాగతము. వారి బల్లెములుగూడ బాణములవలె నిర్బాధకములు. వారు మన కపాయము గలంపరు. కాని, మనము విహ్వలించినచో నానందింతురు. కాన, నిశ్చలముగ, సక్రమముగ నడువుఁడు.”

ఆంగ్లసైన్యము యానమొనరించుచుండెను. మహమ్మదీయులు యథావిధంబున వారినిఁజుట్టి, భయంకర కఠోరరవంబునఁ గేరుచు; దద్వాలుకాండ్రు క్రైస్తవ శిరస్త్రాణములు దూయునటు లద్భుత జవ కౌశలంబున శరములు విడుచుచు, శూలహస్తులు తమ శరీరములు చూర్ణీకృతము లగునట్లు—అశ్వములనుండి క్రిందఁబడునటులు తదవసరోత్సాహమున పరస్పర ప్రహారంబు లొనరింపుచుఁ బోఁదొడఁగిరి.

వారటులు సగముదూరముపోయిరి. అట మఱియొక కఠోరనాదము వినవచ్చెను. తోడనే, ఘోరవినోద తత్పరులై యాంగ్లేయులను జుట్టి యుండిన మహమ్మదీయులొక శ్రేణిగట్టి, యొకింత క్రమమువహించి, వారివెనుక నడువనారంభించిరి. వారితోఁబాటు ధూళిమేఘ మంతరింప, నాంగ్లేయులు కనువిచ్చి చూడఁజాలిరి. వారికెదురుగా మఱి-

యొక్క యాశ్వికగళ మురుదెంచుచుండెను. తదాశ్వికులు తొంటి యట్లు గాక, దృఢకవచ పరిరక్షితులై బహువిధాయుధధారులై, తరుణవయస్కులై, దృఢగాత్రులై, కరుబ్రశంసార్హులై యుండిరి. వారి పట్టు మొలకట్లు సువర్ణమయములు, పాగాలు మణివిరాజితములు, ఖడ్గములు సువర్ణరత్నఖచితములు. పంచశతాయుతంబగు నా మేటిదళము త్తమోత్తమన్నృపాలాంగ రక్షకవ్రాతము కావచ్చునని స్ఫురించుచుండెను.

వీరిగానము సెలంగ, నాదళము క్రమముగా, గంభీరముగా నాంగ్ల సైన్యమును సమీపించి, రెండుగా వీడి, యిరుప్రక్కల శ్రేణులుగట్టి యుండెను. అయ్యది సుల్తాను ప్రత్యేకదళము గావలయుననియు, నిక సుల్తానే ప్రత్యక్షమగుననియు గ్రహించి, యాంగ్లనృపాలుఁడు తనసేనాముఖంబున నిలిచెను. సార్వభౌమ లక్షణ లక్షితుఁడగు సలాఉద్దీను సుల్తా ననతికాలమున నిక్కముగఁ బ్రత్యక్షమాయెను. ఆతఁడు సముచిత పరివారపరివేష్టితుఁడై యరుదెంచెను. ఘోరవికారాకారులగు నీగ్రోలు ఉజ్జ్వలవస్త్రధారిణ మొనరించి, మఱియు వికృతముగఁ దోఁచుచుండిరి. వీక్షణమాత్రమున, సుల్తాను రాజు గావలయునని తెలియుచుండెను. అయ్యఖండ భూమండలాధీశుఁడు హిమసన్నిభమగు పాగాయును, అంగరేకును, ప్రాచ్యజనోచితమగు విశాలమైన పరాయియును ధరించి కడు నిరాడంబరముగ నుండెను. ఐనను, ఆతని శిరోవేష్టనమున ఎమూల్యమును, జగత్ప్రసిద్ధమును, కవిసంభావనార్హమునైన వజ్రరాజము బాలసూర్య ప్రభలతోడ దీపించుచుండెను. సుల్తాను నామాంకితమగు వజ్రిపుంఖంగర మూంగ్లరాజ కిరీటాంచితమణి సమూహ మంతటి విలువగలిగి యుండెను: బాకునందలి నీలముగూడ నించుమించుగ నంత ప్రశస్తముగ నుండెను. ధూళినివారణార్థమో, సాంప్రదాయసిద్ధమనియో సుల్తాను తదుచితమగు ముసుఁగు ధరించెను. ఆ కారణమున నా మహనీయుని ముఖలక్షణములు విస్పష్ట

ముగఁ గాన్పింపకుండెను. సుల్తాను పాలవంటి యుత్తమతురంగ మారోహించెను. తన రౌతు జగదైకశాసకుఁడని యెఱింగిన దాని వోలె నా హయరాజము గంభీరముగ, సగర్వముగ నడచుచుండెను.

సైన్యములు నిలిచిపోయెను, వీరగానము కట్టిపోయెను: ఉదాత్త శూపలగు నా భూపాలు రిర్వురు నశ్వావరోహణ మొనరించి, గంభీరాననులై పరస్పర మెదుర్కొని, పరస్పరాభివందనపురస్సరముగా మస్తకము లల్లన వాల్చి, సోదరులవలె, సరిసమానులవలె నాలింగన మొనరించుకొనిరి. ఆ దృశ్య మపూర్వము. ఇరుసైన్యముల వైభవాడంబరములు జూచువారలు లేకపోయిరి. తత్సమాగత జనానీకమున కంతకును రిచర్డు సలాఉద్దీనులు దప్ప మఱియొండు తోఁపకుండెను. ఆ రాజపుంగవులుగూడ బరస్పర వీక్షణపరతంత్రులై, యితర ప్రపంచమును విస్మరించిరి. ఆంగ్లనృపాలుఁ డధికతర సంభ్రమాశ్చర్యపరుఁడై సుల్తానును జూడఁదొడఁగెను. సుల్తాను వీక్షణమునం దంతటి సంభ్రమాశ్చర్యములు గానరాకుండెను. ఆతఁడే సంభాషణ మారంభించెను.—

"ఆంగ్లనృపాలా! స్వాగతము. మరుస్థలమునకు నీరమువలె భవదాగమన మెంతయు మోదావహము. మదీయ సేనాబాహుళ్యము గాంచి యనుమానింపకుందువు గాక. ఈ యాయుధీయులు నిరంతరము నను గనిపెట్టుకొని యుందురు. దురంత విస్మయాక్రాంతులై నీకుఁ దనుచిత స్వాగత మొసంగు నీ జనులందఱు మత్సహస్రోపజాతులను శాసించు ప్రముఖులు. ఏ మహనీయ నామసంస్మరణమున నరబ్బీ దేశపు దాది బాలుర నూఱడించునో, ఏ మహనీయుని భయంకర నామోచ్చారణమున నరబ్బీయోధుఁడు తన యశ్వమును శాసింపఁ బూనునో యాతఁడే విచ్చేయునపు డస్మద్దేశ ప్రముఖుఁ డెవ్వఁడు రాకుండును?"

ఘోరవికారాకారులగు నా మహమ్మదీయ ప్రముఖులను గాంచి, రిచర్డు విస్మయ మందెను. సుల్తా నిటులనెను.—

"ఈ జను లసంఖ్యాకముగ నున్నను, నేను నియమభంగ మొన రించితినని తలంపవలదు. క్రైదువులు తప్ప వారితరాయుధములు ధరింపలేరు. ఆ శూలములకు మొనలు లేవు."

లోయప్రభు వీటులు గొణిగెను.—"ఎవరు విశ్వసింతురు? శూలా గ్రము లెచటనో దాచియుందురు—అవసరమగునపుడు తేగలరు. ఏమీ మహమ్మదీయ ప్రభువులు!......"

"లోయా! మాటాడకుము! రాజోత్తమా! నీవుండ, నాకను మానమేల? కాని, నేను సమయవిరుద్ధముగాఁ గొందఱు శూరులను గొనివచ్చితిని. సుందర కాంతాజనంబు లోకచో వీడి రాఁగల శత్రు ములు కావు గదా."

అట్లు పలుకు నాంగ్లనృపాలు నభిప్రాయము గ్రహించి, సుల్తాను పల్లకుల వంకఁదిరిగి, పరమపవిత్రవంతమగు మక్కానగరమువంకఁ జూచునంతటి యధికవినయ వినమ్రభావమునఁ బ్రణుతియొనరించి,తదు చితభక్తి పురస్సరముగా నిసుకను జుంబించెను. వారిని డాసి దర్శింప వచ్చునని స్వీయదేశాచారాను గుణముగఁ రిచర్డుపలుక, సముచితా చ్ఛాదన విరహితములగు నుదాత్త వనితాజన వదనములుజూడ రాదని సుల్తాను బదులాడెను. వారిని ప్రత్యేకముగాఁ బిమ్మటఁ జూడ వచ్చునని రిచర్డు మగుడఁ దెలుప, సుల్తాను సవిషాదముగా నిటు లనెను.—

"ప్రయోజనమేమి? భవదీయలేఖా జలాభిషేచనమున మదాశాగ్ని చల్లారెను. ఇఁక నేల రగులఁజేయవలయు? తదాశానలతప్తుఁడనగుట వినా, వేఱుప్రయోజనము లేదు. కాని, సోదరా! నీవిటఁ దడయ నేల? భవదీయ సేవకావినిర్మితావాసమునకు దయచేయుము. మేమే

త్వదీయ సమాహార్థలమై వేచియుందుము. మత్ప్రిధాన నీగ్రో పరిచారకుఁడీ వనితారత్నముల సర్వసదుపాయము లరయువాఁడు. తక్కుంగల జనంబులను మత్సేవకులు సంభావింతురు.''

సుల్తాను త్రోవసూప, నాంగ్లనృపాలుఁ డఖండ వైభవాభిరామమగు గుడారము బ్రవేశించెను. లోయప్రభువు తోడనే యాతని పైఁదోఁపుగుడీసి వైచెను. నిరుపమాన బలసంపన్నుఁడగు రిచర్డు దృఢగాత్రము స్పష్టతరంబుగఁ బ్రకటీకృతమాయెను. ఆపాదభుజావిలంబితంబును, ద్విముష్టిఘటితంబును, నిర్వక్రమంబును, అమానుషంబును నగు నాతని ఖడ్గముగాంచి మఱియు విస్మితుఁడై సుల్తానిటులనెను.

"ఈ మహాయుధ కాంతు లాహవమునఁ గాంచియుంటిని. లేదేని, మానవ మాత్రుఁ డీయుద్దండసాధనము సారింపఁ జాలునని విశ్వసింపఁ జాలను. భవదద్భుత బలప్రదర్శన మొకసారి యొనరింపుమని యర్థించువాఁడ.''

ఆంగ్ల భూపాలుఁడు సానందముగా నియ్యకొనెను. ఒక యంగుళమున్నర మందముగల యుక్కు గజమటుఁ గాంచి, కట్టదింపు పెనిడి, రిచర్డు తనఖడ్గము నీయఁబోవ, స్వామిభక్తి పరాయణుఁడగు లోయప్రభువు భయభ్రాంతుఁడై మెల్లగ నిటులనెను.—"నృపాలా! వలదు, వలదు. నీకింకను దొంటి జవసత్వములు పూర్తిగ నలవడియుండవు. ఈ మహామ్మదీయుని మోలిల భంగపడుదేమో—''

"మూర్ఖా! మాటాడకుము! మత్ప్రియత్న మీతని సమక్షమున విఫలమగునే?''

నృపాలుఁ డావిధమున వానిని సక్రోధముగ మందలించెను. నృపాలుని దీర్ఘఖడ్గము ద్విముష్టి సంఘటితమై, వామభుజంబునఁ జయ్యనలేచి, శిరముచుట్టుందిరిగి, భయంకర యంత్రసన్నిభముగ వ్రాలెను. ద్రుఘణవిఖండిత దారుఖండమువలె నా కఠినలోహము రెండు

తునియలై నేల దొరలెను.

సుల్తాను విపరీత విస్మయాక్రాంతచిత్తుఁడై, తెగిన తునుకలను ఆంగ్ల నృపాలుని ఖడ్గమును బరీక్షించెను. ఆ మహాశస్త్ర మీషన్మాత్రము నలుకువడక యథా ధారాసమన్వితమై యుండెను. పాదుషా యంత నాసింహబలుని హస్తముబట్టి, తద్బలబాహుళ్యముల కక్కజపడి, తన్నికటమునఁ దన బలహీన హస్తముండలంచి హాసమొనరించి యిటు లనెను——

‹‹భవదద్భుతబలంబు బ్రదర్శించితివి. నేను నొక ప్రదర్శనమొన రింతు. ఇయ్యది నీకపూర్వముగఁ దోఁపఁగలదు. కడు మృదులమగు నీపట్టుదల గడజూడుము. నీఖడ్గమునఁ దెగవేయగలవా?''

‹‹అసాధ్యము. దిట్టతనము లేమి, పక్షితూలికా సమంచితమగు నీ యుపధానమును నఱకుట యసాధ్యము.''

ఆంగ్లనృపాలుఁడటులు వలుక, సుల్తాను కోశమునుండి తన వక్రకర వాలము దీసెను. అయ్యది పాశ్చాత్యఖడ్గములవలెఁ దళతళ దీపింపక నల్లగ గళా విహీనముగనుండెను. కాని, ఆశస్త్రమును దయారు చేసిన వాని పనితనమునకు దృష్టాంతముగా ననేక లక్షల చారలల్లి బిల్లిగ నందుఁ గాన్పించుచుండెను. సలా ఉద్దీను సుల్తానా ఖడ్గము సారించి, వామపాటమున దృఢముగ నాని, సరిచూచుకొని, యొక్కయుదుటువైచి, తనయపూర్వకౌశల మచ్చుపడునటు లనాయాసముగా నాదిండును ఖండించెను. అందుఁబ్రయత్నము గాన్పింపకుండెను. ఖడ్గము ఖండించినటులే గాన్పింపకుండెను: తెగినతునుక తెగినటులుగాక, యల్లన వీడి పడినటులుండెను.

"గారడి కావలయు!"——అని నిరసించి, తదుపధాన ఖండనమును లోయప్రభువు పరీక్షించెను. ఆంగ్లభాషాపరిచయము లేకున్నను, సుల్తాను వాని భావము గ్రహించి తననైపుణ్యము వేఱు విధమున

వ్యక్తపఱచెను. తాను దాల్చిన మేల్ముసుఁగుదీసి, యాతఁడు తనఖడ్గ ధారపైఁబఱచెను. ఆతని కౌశల్యమెట్టిదోగాని, యొకసారి కృపాణము రాచినంతనే, మీఁగడవంటి యా ముఖవసనము రెండుతునియలై యిటునటు నెగిరెను. ఆ శస్త్రధారయును, సుల్తాను నిరుపమాన నైపుణ్యముగాంచి, లోయప్రభువు సహితము విభ్రమచేతస్కుఁడాయెను. ఆంగ్లనృపాలుఁ డిటులనెను.

"సోదరా! నీశస్త్రకౌశల్య మమోఘము. నినుఁదాకుఁట నిక్కముగ నపాయకరము! ఐనను, భుజబలము గొలఁది ప్రహరించుట మా యాచారము. మాకు వాంఛనీయము. నేర్పు కొఱఁత వడిన, మాబల మక్కఱకువచ్చును. కాని, కాయమును గాయపఱచుటయందు నీ వెంతటి ప్రవీణుఁడవో తన్నివారణయందు మాహాకీ మంతటి ప్రవీణుఁడు. ఆ వైద్యవిద్యా విశారదు నెంతయు నభినందింపవలయు. ఆతనికి సమర్పింపవలయునని చిన్నయుపాయనము గూడఁ గొనివచ్చితిని."

రిచర్డిట్లు పలికినంతనే, సుల్తాను మందహాసమొనరించి, పాగాదీసి, టోపి ధరించెను. అపుడాసుల్తానుమూర్తి గాంచినంతనే లోయప్రభువు విపరీత విస్మయపరుఁడై, నోరు తెఱచి, తెప్పవాల్పక చూచుచుండ సుల్తాను వేఱొక కంఠమున గంభీరముగ నిటులనెను. "రోగార్తుఁడు, సవ్వడియగునంతనే, వైద్యునరయఁగలఁడు: కాని, రోగవిముక్తుఁడగు నేని, వైద్యుఁడు కట్టెదుటనున్నను, అరయఁజాలఁడు.—ఇట్లు మాకవి యొకఁడు చెప్పెను."

నాఁడు మృత్యుముఖమునుండి తను రక్షించిన యా హాకీమే ప్రఖ్యాత మహమ్మదీయ సార్వభౌముఁడని స్పష్టమాయెను. రిచర్డు దురంత విస్మయాక్రాంతచిత్తుఁడాయెను—"అద్భుతము! అత్యద్భుతము! టోపి కానరానంతమాత్రమున మా హాకీమును గుర్తింపఁజాలకపోతినే! మ తోఁడ్సోదరుఁడు సలాఉద్దీను సుల్తానే!"

"ప్రపంచము తీరిటు లుండు: చినిఁగిన వస్త్రములు ధరించునంత మాత్రమున విరాగి కానేరఁడు గదా."

"సోదరా! యథార్థుఁడైన స్కాచిశూరుని రక్షించినవాఁడవు నీవ; వానిని ప్రచ్ఛన్నరూపమున మచ్ఛిబిరమున కంపినదియు నీవ గదా?"

"ఔను. వైద్యుఁడఁ గదా. గాయపడి నెత్తురు స్రవించు నాశూరుని గౌరవము బునరుద్ధరించిన గాని, యీ మానవంతుఁడు మనఁజాలఁడని యెఱింగి యటు లొనరించితి. కాని, వాని వేషము నీ వింత సులభముగా భేదింతువని తలంపనైతిని."

సుల్తా నటులు పలుక, రిచర్డిటు లనెను—"నీ వంపిన బానిస నీల వర్ణము కృత్రిమమని నా కకస్మికముగఁ దెలిసిపోయెను"—రిచర్డును జంప నరుదెంచిన హంతకుని నీగ్రోబానిస వారించుటయు, ఆతని కా సందర్భమునఁ జిన్నపోటు తగులుటయు, వాని బాకు విషసంకలితమని నృపాలుఁడే స్వయముగా నా విషము బీల్చివేయుటయు మన మెఱింగియుంటిమి గదా. రిచర్డా సమయమున బానిస నిజశరీరచ్ఛాయ గాంచియుండును—"అనుమానము వొడమినంతనే, వాని మూర్తి బరికించి, కణతుఁడే యగునని తెలిసికొంటిని. స్కాచిశూరుఁడు రేపటి ద్వంద్వయుద్ధమునకు సంసిద్ధుఁడు గదా."

"కణతుఁడు యుద్ధసన్నద్ధుఁడై, యుత్సాహియై, దృఢవిశ్వాసబద్ధుఁడై యున్నవాఁడు."

"తన కమితోపకార మొనరించిన మహనీయునిఁ దెలియునా?"

"తెలియును."

"తన రహస్య మేమైన వెల్లడించెనా?"

"స్పష్టముగఁ దెలుపలేదు, కాని, తన ప్రేమ యత్యున్నతమని మాత్రము దెలిపెను."

"వాఁడు ధూర్తుఁడై, సాహసియై, మోహాంధుఁడై, భవదాశయ

మునే వాంఛించెనని యెఱుంగుదువా!"

"అట్లు గ్రహింపనగు. కాని, స్కాచిశూరుఁడు చిరకాలమునుండి యు మోహాబద్ధుఁడై యుండెను. కావున, నా యాశ భగ్నమైనంత మాత్రమున నే నాతనిపైఁ బగ బూనుట సంబద్ధము. ఉదాత్తచిత్త యగు మానిని యుదాత్తచిత్తుఁడగు, తన జాతి ప్రఖ్యాతశూరుని ప్రేమించుట కడు సమంజసము."

"కాని, హీనకులసంజాతుఁడు గదా."

"మీ క్రైస్తవాభిప్రాయము లటు లుండవచ్చును, మే మట్లు తలంచువారము కాము. ఒంటెలు దోలి జీవించువాఁడు, పరాక్రమ వంతుఁ డగునేని, సుందరరాజ్ఞీమధురాధర చుంబనార్హుఁడు: భీరుఁ డగునేని, రాజకుమారుఁ డైనను, త త్కాంతామణీ చేలాంచలము నకుఁ బ్రణుతి యొనరించుటకుఁ గూడ ననర్హుఁడు. సోదరా! నా కీక సెల వొసఁగుము. ఆస్ట్రియా కాప్రేడులకుఁ గూడ స్వాగత మీయ వలయు. వారు సంభావనార్హులు గాకున్నను, మద్గౌరవము బురస్క రించుకొని, వారలను గౌరవింపవలయు. మాజ్ఞాని యొకఁ డేమనెనో వింటివా?—ఆగంతుకున కాహార మిడుట నష్టకర మనరాదు; వాఁడు తృప్తికరముగ భుజించునేని, దాత యశోవర్ధనుఁ డగు."

తమకై ప్రత్యేకముగ నేర్పడియుండిన శిబిరములందు నాస్ట్రియా కాప్రేడులు విడిసిరి. తదావాసములు గూడ సర్వవస్తుసంభరితములై తదుచితవైభవాక్రాంతములై యుండెను. సుల్తాను వారి స్వభావము లెఱింగి యేవగించియుఁ దన యతిథు లగుటచేత వారిని సముచిత ముగ గౌరవించెను. రిచర్డు భోజన మారగించిన యనంతరము, అబ్దల్లా నామధేయుఁ డగు రాయబారి యరుదెంచి, రేపటి ద్వంద్వయుద్ధ క్రమము గుఱించి తెలియఁ బఱచెను. అనంతరము రిచర్డు తన రాణీ మందిరమునకుఁ బ్రయాణ మాయెను.

గానకళావిశారదుఁడగు బ్లాండలు గూడ రాజపరివారమునం దుండెను. రాణి యాతనిఁ బ్రశంసించుచుండ, రిచర్డు తన సోదరితోడ రహస్యముగ సంభాషించెను. కొంత తడవైన పిమ్మట నాతఁ డిట్లు మెల్లగ బ్రశ్నించెను—"సోదరీ! మన మింకను వైరులమా?"

గాయనుఁడు గాన మొనరించుచుండెను. కావున, రాజసోదరి యును హీనస్వరమున నిట్లు బదులాడెను. "ధైర్యసాహసోదారగుణ విభ్రాజితుఁడగు రాజేంద్రునిపై నెవ్వరు వైరము బూనఁజాలరు." తద వసరోచితముగా నామె తనకరంబందీయ, నృపాలుఁడు స్నేహపూర్వ కముగా ముద్దాడి యిటులనెను.—

"మత్ప్రియబాంధవీ! మదాగ్రహము కృత్రిమమని భ్రమింపకుము. పతాకరక్షణ మొనరింపవలసిన శూరుఁడు—ఎట్టి మధురావసరప్రేరి తుఁడైన నేమి—ప్రమత్తుఁడాయెఁ గదా. తాదృశావిధేయుఁడు తప్పక శిక్షార్హుఁడు. దుర్యశోమగ్నుఁడైన యాశూరుఁ డెల్లి కదనరంగ మునఁ దన కళంకము వాపుకొని యథాగౌరవప్రతిష్ఠితుఁడు కావచ్చు నని నీవలె నేనునుఁ సంతసించుఁవాఁడను. రిచర్డు ధూర్తుఁడని, యవివేకి యని భావిజనులు దూషింతురుగాక: కాని, యాతఁడు ధర్మబద్ధుడై న్యాయప్రదాన మొనరించుననియు, కరుణాత్మకుఁడనియు గూడఁ బ్రశంసింపవలయు."

"సోదరా! ఆత్మస్తుతి యొనరింపకుము. నీన్యాయమును గ్రౌర్యమని, కారుణ్యమును జాపల్యమని నిరసింపవచ్చును."

"సోదరీ! గర్వపడకుము—నీ శూరుఁడు వైరి నడంచి విజయా క్రాంతుఁడై నట్టులే వాకొనుచుంటివి. కాని నేఁడు సామాన్యుఁడు కాఁడు. స్కాచిశూరుఁడు పరాజితుఁ డగునేమో?"

రాజసోదరి దృఢముగ నిటులనెను.—"అసంభవము! కాని నేఁడు చోరాధముని చందమున వన్నెదొఱఁగి కంపించెను—నేఁ గాంచితిని.

వాఁడు నిక్కముగ ద్రోహి. ద్వంద్వయుద్ధము పవిత్రవంత మైనది. ఇందు బరమాత్ముఁడే న్యాయాధిపతి. స్కాచిశూరుఁడే గాదు—ఇట్టి యుద్ధమున నేనే నిర్భయముగా నా దురాత్ముని౯ దాఁకఁ గలను.''

నృపాలుఁ డెంతయు సంతసించి మగుడ నిట్టులనెను.—"కాని, మన వంశగౌరవము విస్మరింపక తదుచితముగ మెలఁగవలయు సుమా."

"ఈసమయమున నాకిట్టి యుపదేశమేల? నే నంతటి చపలచిత్త నని తలంతువా?''

"సోదరీ! మనస్సు విచ్చి మాటాడుకొందము. ఈస్కాచిశూరుఁడు రేపు విజయముగాంచుఁ గాక. వాఁడు నీకేమి కావలయు?''

క్రోధలజ్జాతిశయమున సుందరానన మరుణము గాఁగ, నాకాంత యిటులనెను.—

"నాకా? నాకేమి కావలయు?—యశస్సాంద్రుఁడగు శూరుఁడు భవద్రాజ్ఞీసహిత మెటులు సంభావనార్హుఁడో, నాకు నట్టులేయగు. స్కాచిశూరుఁడు మదీయ నామపురస్కృతుఁడై బలపరాక్రమములు బ్రదర్శించెను. తాదృశముగ రాజపత్నినే యాతఁడు పురస్కరించు కొనెనేని, యామెయే సంభావించుఁ గదా. శూరుఁడు మందభాగ్యుఁ డైనను, చక్రవర్తినీ సేవాపరాయణుఁడు గావచ్చును—తాదృశో త్కృష్టకాంతామణీసంస్మరణమే వాఁడు గాంచు బహుమానము గావలయు.''

"కాని, స్కాచిశూరుఁడు నిను బురస్కరించుకొని ఘనకార్యము లొనరించుటయే గాక, కడునిడుములు గుడిచెఁ గదా.''

"శూరుని యోధకృత్యములఁ గాంచి సగౌరవముగా సంతసించితిని, కష్టనిమగ్నుఁ డైనపుడు బాష్పములు విడిచితిని. ఆతఁ డితర బహుమాన మాసించెనేని, తన యంతర మెఱింగి తదుచితమగు కాంతను బ్రేమించి యుండవలెను."

"కాంత లిటులే యందురు: గాని, యిష్టుఁడగు ప్రియుఁడు ప్రతి కూలుఁడైన, ఉస్సురని నిట్టూర్పు విడిచి దైవ మన్యథా తలఁచెనని యందురు."

రాజసోదరి క్రోధఘూర్ణిత మానసయై గంభీరముగ నిటుల నెను— "నృపాలా! పలుమాటలేల? అనామధేయుఁడగు శూరుని గాని, మ్లేచ్ఛునిగాని వివాహమాడుదానఁ గాను. నీ నిష్ఠురోక్తులు దుస్సహ ములు. మధురగాన మాలింప నిమ్ము!"

## ౨౮

సూర్యాతపము బాధాకరముగనుండును. కాన, సూర్యోదయానంతర మొక గంటకు ద్వంద్వయుద్ధము కావలయునని యేర్పఱచిరి. అను భవజ్ఞుఁడగు స్కాటిశూరుఁడు గట్టి యిసుకస్థల మరసెను. రంగస్థలము నూటయిరువది గజములు పొడుగును, నలుబది గజములు వెడల్పును గలిగి విశాలముగ, ననుకూలముగనుండెను. ఉదయభానునివలని కష్ట సుఖము లిరువురకు సమానముగనుండునటులు క్షేత్రము దక్షిణోత్తర ముగా నేర్పడియుండెను. తన్మధ్యస్థముగాఁ బశ్చిమమున సమున్నత మగు నుత్తమాసనము తీర్పరియగు సుల్తానున కమరియుండెను. దాని కెదురుగాఁ దూర్పునసాంగ్లరాజ కాంతాజన వీక్షణాగారము ప్రాచ్యా చారసమ్మతముగా నిర్మింపఁబడెను. అందుండు స్త్రీలు పురుషుల కంటఁ బడకుండ రంగస్థలము గాంచఁగలరు. రంగముఁ బ్రవేశించుట కిటు నటు రెండుద్వారములుండెను.

రిచర్డాస్ట్రియానృపాలురకు రెండు సింహాసనములు నెలకొల్పఁ బడెను. తన పీఠము రెండవదానికంటె నిమ్నమని కనలి యాస్ట్రియా

నృపాలుఁడం దాతురాధముఁడగుటకు సహింపకుండెను. కాని, యుద్ధప్రియుఁడగు రిచర్డు ద్వంద్వయుద్ధ చింతాతత్పరుఁడై, తదవసరమున నశ్వారూఢుడై యుండఁ గోరుటచేత, నాస్ట్రియా నృపాలుని క్రోధకారణ మంతరించెను. ఒక ద్వారమున రిచర్డు పరిజనులును రెండవ ద్వారమునఁ గాన్రేడు పరిజనులు నుండిరి. సలాఉద్దీను సుల్తాను సింహాసనము తన్మహానీయప్రసిద్ధాంగరక్షకజనపరివృతమైయుండెను. క్రైస్తవ మహమ్మదీయప్రేక్షకు లిందందుఁ గూడియుండిరి.

సూర్యోదయము గాక పూర్వమె మహమ్మదీయు లసంఖ్యాకముగ నరుదెంచి రంగస్థలము చుట్టు నిలిచిరి. గతసాయంసమయముకంటె వారి సంఖ్య యధికము. అంతలో భానుబింబ మత్యంత శోభాయమానముగ నుదయించెను. తత్ప్రథమ కిరణ మాకసమున దీపించి నంతనే “ప్రార్థన! ప్రార్థన”—యని గంభీర దీనస్వరమున సుల్తానుదోద్బోధించెను. తదధికారముగల మహమ్మదీయులు మఱికొందఱు గూడ నట్లు హెచ్చరింప, చిత్రసమాగత మహమ్మదీయ జనౌఘంబులందఱు నిరుపమాన భక్తి పరవశులై, పవిత్రతర మక్కా నగరాభిముఖులై, పృథ్వీతలంబున వ్రాలి, తత్కాలోచిత విధులు యథావిధంబున నిర్వర్తించిరి.

లోయప్రభు చిత్త మనుమానగ్రస్తమైయుండెఁ గదా. అతఁడను మానించినట్లులే, మొండిశూలములు ధరించిన మహమ్మదీయు లిపుడు సాయుధులై యుండిరి. లోయప్రభువు సక్రోధముగ నృపాలున కావిషయ మెఱింగించెను. సుల్తానట్లు లొనరించుట సమయ విరుద్ధమైనను, రిచర్డు విశ్వాసబద్ధుఁడై యుండెను. మూర్తీభవించిన యౌదార్యమనఁ దగు సుల్తాను ద్రోహమాచరింపఁడని పలికి, తన యనుచరునితోడ నిటులనెను.—“నీ స్థూలకాయమున కపాయము ఘటిల్లునని భయపడు దేని, సురక్షిత ప్రదేశమునకుఁ బొమ్ము.”

అంత నొక వాద్యము మ్రోఁగెను. తోడనే, యశ్వారూఢులగు మహమ్మదీయయోధులు తదవరోహణ మొనరించి, మగుడ దైవ ప్రార్థన మొనరించువారివలె నేలపై వ్రాలిరి. కారణమేమన—ఆంగ్ల రాజ నారీజనంబు లరుదెంచుచుండిరి. పాదుషా యంతఃపురభటు లేఁబదిమంది విచ్చుకత్తులు దాల్చి, వారి చుట్టునుండిరి. తత్కాంత లను గన్నెత్తి చూడ సాహసించు వానిని—రాజైనను సరె, పేద యైనను సరె—తత్క్షణము తెగనఱకవలయునని సుల్తాను కఠినముగ నాజ్ఞాపించెను.

అట్టి ప్రాచ్యాచారము లాంగ్లరాజ్ఞికి నసహ్యకరముగ నుండెను. తమకై నిర్మించిన వీక్షణాగార మొకగుహయని యామె నిరసించెను. అందుండి రంగమంతయుఁ గాంచనగును. కాని, యందఱు దను గాంచు టామెకు మఱియుఁ బ్రీతికరము.

ద్వంద్వయుద్ధ మొనరింపవలసిన యోధప్రతియోధలను వారివారి సహచరు లాయిత్తపఱుపవలయును. కాని, మధుపాన మధికమగుట చేత నాస్ట్రియా రాజు తనమిత్రుఁడగు కాన్రేడును జూడఁజాలక పోయెను. కాన్రేడు రెండవ సహచరుఁడు, సన్యాసిశూరనాయకుఁడగు 'అమారీ'. ఆతఁ డాస్ట్రియారాజువలె నుపేక్షించుట కవకాశములేదు. ఆతని చిత్తమా యుద్ధము మీఁదనే లగ్నమై యుండెను. కాన, నాతఁడు నిజమిత్రవీక్షణాతురుఁడై, చాలముందుగ నటుఁబోయెను. కాని, యా ద్వారపాలకు లాతని వారించిరి. ఆతఁడు కుపితుఁడై యిటులనెను—"మ్రుచ్చులారా! నన్నెఱుంగరా?"

"మహనీయా! ఎఱుంగుదుము. నీకైనను బ్రవేశమీయవలదని మా ప్రభువాజ్ఞాపించెను. వారిపుడు ప్రాయశ్చిత్త మొనరించుకొన నున్నారు. మతాచార్యుఁ డరుదెంచెను."

మరణ మాసన్న మగునపుడు క్రైస్తవులు తమజీవితరహస్యము

లాచార్యునకుఁ దెల్పి తదుచితప్రాయశ్చిత్తము గాంచుట వారియాచారము. యుద్ధమొనరింపవలసిన కాన్రేడు తదనుగుణముగా నొనరింపనుండెను. ఆమాట వినినంతనే సన్న్యాసినాయకుఁడు భయాగ్రహావిస్మయప్రకంపితచిత్తుఁడాయెను—"ఆ చార్యుఁ డెవ్వఁడు?"

"ఆ రహస్యము దెలుపరాదు."

కాని, కాన్రేడు చిరమిత్రుఁడగు సన్న్యాసిశ్రేణీ నాయకుఁడా దావారికుని తృణీకరించి, యొక్కత్రోపున నదలించి, తన్మందిరాంతర్గతుఁడాయెను. కాన్రేడు ప్రసిద్ధుఁడగు నెంగాడీ స్వామి కభిముఖుఁడై, తన్మహానసనోచిత భక్తి వినమ్రతా గాంభీర్యములు వహించి, ప్రాయశ్చిత్త మొనరింపనుండెను. సన్న్యాసినాయకుఁడు క్రోధహూతవీక్షణుఁడై యిట్లనెను.—

"మిత్రమా! కాన్రేడ్! ఏమీ యసంబద్ధ ప్రవర్తనము? ద్వంద్వయుద్ధమున శాత్రవునిఁ జెండాడి విజయోన్మత్తుఁడై వెలుంగవలసిన యోధునకే ప్రాయశ్చిత్తమేల? దురంత లజ్జాకరమే! చిత్త మొకవేళఁ బ్రాయశ్చిత్త క్రియాకృష్టమగుఁగాక—నే నుండ, వేఱొక యాచార్యు నరయనేల?"

కాన్రేడు సహజముగ విలాసప్రియుఁడు, అపహాసపరాయణుఁడు, నిర్విచారుఁడు. కాని, యిప్పుడాతఁడు హాసవిలాసము లెఱుంగక వివర్ణవదనుఁడై ప్రకంపితస్వరమున నిట్లనెను.—"అమారీ! మదీయజీవిత చరిత్ర నీకుఁ గరతలామలకము. ఈ సమయము కడు బవిత్రవంతము. నాకీ పూజ్యునితోడఁ బనియున్నది. కరుణించి మాకు సెల వొసంగుము"

"మిత్రమా! నేఁ బోవలయునా? ఏమి! సన్న్యాసియో—ప్రవక్తయో యున్మత్తుఁడో—ఈ యెంగాడీ సాధువు నాకంటెఁ బావనుఁడని తలంతువా? నా కంటె వీఁ డేవిధమున నర్హుఁడు? ఓరీ! ఎంగాడీ! నీ విం

మండఁబనిలేదు. నా మిత్రునకు నేనే ప్రాయశ్చిత్తము జేయింతును. పొమ్ము!"

"అమారీ! నన్ను బొమ్మనుటకు నీ వెవ్వఁడవు? కాన్రేడ్! నీ చిత్త మెటింగింపుము. నా సాహాయ్యమవసర మగునేని, యిందుండువాఁడను లేదేని, నేఁ బోయెద."

కాన్రేడు ఇతికర్తవ్యతా విమూఢుఁడాయెను.—"ఆహా! ఏమి చేయుదు? స్వామీ! నీవు మగుడ దయచేయవలయు—"

"హా! ఆలస్యము సర్వానర్థదాయకము. భాగ్యహీనుఁడా! ఆత్మ ఘాత మొనరించుచుంటివి సుమా! మగుడఁగలియుట—యెచటనో! అమారీ! విహ్వలింపుము!"

అట్లు పలుకు ఎంగాడీస్వామిని "నీవే విహ్వలింపు" మని సన్యాసి నాయకుఁడగు నమారీ తృణీకరించెను. ఎంగాడీ వెడలిన యనంతర మాతఁడు తనమిత్రునితోడ నిటులనెను.—"కాన్రేడ్! నీకీ ప్రాయశ్చిత్తమేల? ఇట్టి తంతులు మూఢులకుగాని మనవంటి వారలకుఁగాదే. కాని, నీ చిత్తమిపుడు తద్విశ్వాస బద్ధమగునేని, కానిమ్ము. నేనును మతాచార్యుఁడనే. కాలహరణ మొనరింపరాదు. నీచరిత్ర నేనెఱుంగ నిదికాదు. నీవొనరించిన పలుపాపము లిపుడు పేర్కొనుట యనవసరము. హృదయశోధన మొనరింప నున్నపుడు, మలినబిందువులు లెక్కింపనేల? ఇకఁ బ్రాయశ్చిత్తకాండమున కే దొరఁకొందము."

కాన్రేడిట్లు బదులాడెను.—"నీ సన్యాసము నామమాత్రముగదా. నీయట్టివాఁడు నాకుఁ బ్రాయశ్చిత్త మొనరింపఁబూనుట పాపావహము."

"మిత్రమా! పొరపడితివి. ఆచార్యుడెట్టివాఁడైనను బ్రమాదము లేదు. ఇందు వ్యక్తితోడఁబనిలేదు. మదధికార పురస్కృతుఁడనై మానవులకుఁ బ్రాయశ్చిత్తవిధులొనరించి వారల కుత్తమగతులు

గలిగింపఁజాలుదును. క్షతగాత్రుఁడు శస్త్రవైద్యుని బరీక్షించునే? ప్రాయశ్చిత్తమొక భ్రమ. ఐనను, నీకు మూఢవిశ్వాసముగలదేని, యాలసింపరాదు."

"అమారీ! ప్రాయశ్చిత్తకర్మ భవలాభమైనను గోల్పోదునుగాని, యీ పవిత్రకర్మ నపవిత్రపఱుపఁజాలను."

"మిత్రమా! నీవుశూరాగ్రేసరుఁడవు. తదుచిత ధైర్యస్థైర్యములు వహింపుము. ఒకగంటలోన వైరిని బరిమార్చి యశస్సాంద్రుఁడవు కాఁగలవు. లేదేనిఁ శూరజనోచితముగాఁ దనుత్రాణాదుల తోడనే తత్కర్మ మాచరింపనగును."

"అమారీ! శుభసూచనలు గానరాకున్నవి. ఎటుజూచిన నశుభమే. నాయపరాధమొక శునకముచేతఁ బ్రకటీకృతమాయెను. నాతోడఁ బోరాడుటకు స్కాచిశూరుఁడే దయ్యమువలె లేచి వచ్చెను. ఇకఁ నేటి స్థైర్యము?"

"మిత్రమా! నీవు శూలాయుధుఁడవై క్రీడారంగమున వాని నెన్నిసారులో తాఁకి యుంటివి. స్కాచిశూరుఁడు నీ కపరిచితుఁడు కాఁడు. నీబలకౌశలము లమోఘములు. తప్పక జయింతువు. పరిచారకులారా! ద్వంద్వయుద్ధమునకు మీప్రభు నాయిత్తపఱుప వలయు, రండు!"

సేవకులు ప్రవేశించిరి. కాన్రేడిట్లు ప్రశ్నించెను—"సూర్యుఁడు యథావిధమున నుదయించెనా?"

"ఉజ్జ్వలముగ నుదయించు భాస్కరుఁడు నేడు కళావిహీనుఁడై యున్నవాఁడు."

పరిచారకుఁ డట్లు పలికినంతనే, కాన్రేడు అదియొక యపశకునమని యెంచి విహ్వలించెను. సన్యాసినాయకుఁ డాతని కుత్సాహము గల్పెను—"మిత్రమా! దైవము మనయెడఁ బ్రసన్నుఁడాయెను. ఆతప బాధ యెఱుంగక సుఖముగా రణమాచరింపఁ గలవు. లెమ్ము!"

కాని, నిజాపరాధ సంస్మరణముచే బాధపడు కాన్రేడునకు ధైర్యోత్సాహము లలవడకుండెను. సన్యాసి యీ విషయము గనిపెట్టి యిట్లు చింతించెను—

"ఈ భీరుఁడు పరాజితుఁ డగుట తథ్యము. శుభాశుభ చింతా విదూరుఁడ నగు నేనే యుద్ధమొనరించిన బాగుండును. ఈ మూఢుఁడు జయింపకున్నఁబోయె—ప్రతిశూరఖడ్గవిఖండితుఁడై తెగటారిన, మేలు. మే మిరువురము గలసి యొనరించిన పాపము లనేకములు. వీఁడు మరి యొక సన్యాసిచేతఁ బ్రాయశ్చిత్తము చేయించుకొనునేని, నా దోషములు గూడ వెల్లడియగును. కాన, వీనిని వీడరాదు."

ద్వంద్వయుద్ధసమయ మాయెను. తూర్యములు మ్రోఁగెను. శూరు లిర్వురు నాపాద మస్తకము కవచపరిరక్షితులై, వివిధాయుధధారులై, హయారూఢులై రంగమునందుఁ బ్రవేశించి, ముఖత్రాణములు దీసి, సర్వజనదర్శనీయముగా మూడుసారులు ప్రదక్షిణించిరి. నా రిర్వురు మహాయోధులు, గంభీరాకారులు. స్కాచిశూరుఁడు దృఢవిశ్వాస బద్ధుఁడై, తదుత్సాహదీపితవదనుఁడై యుండెను. కాన్రేడుకూడ యథా ధైర్యము వహింపఁగడంగెను. కాని, యాతఁ డెంత ప్రయత్నించినను, వాని వదనము నిరాశావృతమై, కళావిహీనమై యుండెను. ఆతని యశ్వము కూడఁ దదనుగుణముగనే యుండెను. ప్రదక్షిణ మొనరించు నపుడు గూడఁ దద్విభేదము వ్యక్తమాయెను. స్కాచిశూరుఁడు సవ్య ప్రదక్షిణ మొనరింప, కాన్రే డపసవ్యముగ నొనరించెను.

కాంతాజనవీక్షణాగారమునకుఁ గ్రిందుగ నొక వేదిక యుండెను. అందు, ఎంగాడీస్వామి నిజమతాధికారోచితములగు వస్త్రములు దాల్చి యుండెను. ఇతర సన్యాసులు గూడ నాసీనులై యుండిరి. యుద్ధ సన్నద్ధులై యున్న శూరు లటుఁ బోయి తమ వాదము సత్యమని ప్రమాణ మాచరించి, తమ జయాపజయములు తమ వాదమునందలి

సత్యాసత్యములపై నాధారపడి యుండవలయునని ప్రార్థింపవలయు. స్కాచిశూరుఁడు తన సహచరులతోడ నరుదెంచి యటు లాచరించెను. మఱియు, శూరధర్మోచితముగా నాయుధములు దాల్చితిననియు, మంత్రతంత్రసహాయ్య మపేక్షింపలేదనియుఁ గూడ నాతఁడు సప్రమాణముగాఁ బలికెను. స్కాచిశూరుని కంఠము నిశ్చలముగ, గంభీరముగ నుండెను; వదనముత్సాహదీపిత మాయెను. అనంతర మాతఁ డస్పృశ్య కాంతాజనంబులవంకఁ బరికించి, తదుచిత గౌరవపురస్సరముగా వంగి, కవచభారము దలంపక చంగున హయారోహణ మొనరించి తన స్థానమునకుఁ బోయెను. కాన్రేడు కూడ నటు లాచరింపవలయు. ఆ పాపాత్ముఁడు ప్రమాణ మొనరించునపుడు వాని పెదవులు పాండురములాయెను. స్వరము నిశ్చలముగ నుచ్చగ నుండక, కూపస్థుఁ డాయెనో యన హీనముగ నుండెను. తన మిత్రుని తొట్రుపాటు గనిపెట్టిన సన్యాసినాయకుఁడు కొండొక నెపమున నాతని డాసి యెవ్వరు వినకుండ యిటు లనెను—"పందా! మూర్ఖా! అప్రమత్తుఁడవై యుద్ధ మొనరింపుము: లేదేని—స్కాచిశూరుని దప్పించుకొన్నను, నన్ను దప్పించుకొనఁజాలవు! భద్రము!"

అసలే కాన్రేడు ధైర్యరహితుఁడై యుండెను. దుష్టుఁడగు నమారీ భయంకరముగ నటు లనినంతనే, వాని స్థైర్యము పూర్తిగ నంతరించెను. ఆ కారణమున, నాతఁ డశ్వారోహణ మొనరింపఁబోయిన సమయమునఁ బదములు తొట్రిలెను. ఐన నాతఁడు సహజముగ నేర్పరియగు రౌతగుటవలన రయమ్మునఁ దెలివొంది హయారూఢుఁ డాయెను. కాన్రేడు తన తేజినిఁ బ్రశంసనీయముగ శాసింపుచుఁ దన వైరి కభిముఖముగా నిలిచెను. కాని, శకునపరీక్ష యొనరించువారలా శూరునకు సంభవించిన ప్రమాదము గనిపట్టిరి.

సన్యాసులంతట లేచి "ధర్మము జయించు గాత!" యని గంభీర

ముగ నాశీర్వదించి, రంగమునుండి తొలంగిరి. అంతఁ దూర్యములు మ్రోగెను. ఒకచారణుఁ డెలుగెత్తి యిట్లు ప్రకటించెను—"స్కాట్లాండు దేశస్థుఁడు, కణత నామధేయుఁడు, చిత్రకలాంఛనుఁడు నగు నీ మహా శూరుఁ డాంగ్ల దేశ పతాకాపహర్తయగు క్రానేడును దాఁకి యాతని ద్రోహము స్థిరపఱచుటకు సంసిద్ధుఁడు."

క్రానేడుతోడ యుద్ధమొనరింపనున్న శూరుఁ డెవ్వఁడో యింత వఱకు నెవ్వరెఱుంగరు. నిజాద్భుత బలపరాక్రమ ప్రదర్శనంబునఁ దమ గౌరవాభిమానములు జూరఁగొనిన స్కాచిశూరుఁడే యాతఁడని తెలిసి నంతనే యాంగ్లప్రజానీక మమందానందాతిశయమున ఘూర్ణిల్లెను. అధికారులు వారింపఁ గడఁగినను వారు సరకుసేయక కరతాళాది జయజయధ్వానము లొనరించిరి. క్రానేడు తాను నిర్దోషిననియు, దన నిర్దోషత్వము ధృవపఱుతు ననియు దెలియఁబఱచెను. తదనంతరము శూరుల యనుచరు లరుదెంచి వారి డాలులను శూలములను నందిచ్చిరి. యోధులొక హస్తముతోడ నశ్వమును శాసింపవలయు, రెండవహస్తముతోడ నాయుధము సారింపవలయు. ఆ కారణమునఁ దమ దేహములను రక్షించునటులా కేడెములను దమ కంఠములకు శూరులు గట్టుకొనిరి.

స్కాచిశూరుఁడగు కణతుని డాలు నందాతని లాంఛనమగు చిఱుత పులియే గాక, కొత్తగఁ బ్రాపించిన దాస్యమునకు సాక్షిగా మెడపట్టియు నొక శృంఖలముగూడఁ గాన్పించుచుండెను. క్రానేడు కేడెమునందాతని లాంఛనముండెను. వేళ. యగుటచేత, నా యోధులిర్వురు దప్ప మిగిలిన నారందఱు రంగమునుండి తొలంగిరి. శూరులు ముఖత్రాణములు గూడఁ దాల్చి శూలములు బూని పరస్పరాభిముఖులై యుండిరి. ముఖములుగూడ మూతపడుటచేత వారు జీవరహిత లోహవిగ్రహముల వలెఁ దోఁచిరి. ద్వంద్వయుద్ధ వీక్షణ సమాగత

జనసహస్రంబులు మాటాడక, సర్వేంద్రియములు నాత్మయుగూడ నయనమునందే కేంద్రీకృతమాయెనో యన నవిమేషనయనులై యుండిరి. యుద్ధాశ్వంబులగు హయంబుల హేషితంబులు తప్ప నా ప్రదేశ మంతయుఁ గడునిశ్శబ్దముగ నుండెను. మూఁడునిమిషము లిట్టులు గడచెను. అంత సుల్తానొక సన్న యొనరించెను. వెంటనే, శతవాద్యము లొక్కసారి మ్రోగెను. శూరులు తత్క్షణము చరణాంకుశములు గ్రుచ్చి ఖళీనమువీడ, నా హయంబులు రెండును మహాజవంబునఁ బారెను. మెఱపు మెఱసిన చందమున శూరు లిర్వురు రంగమధ్యమున రొండొరులు దాఁకిరి. స్కాచి శూరుఁడు మహావిజయముగాంచెను. అనుభవజ్ఞుఁడగు కాన్రేడు ప్రశంసనీయముగనే తన శాత్రవుని మార్కొనెను. వైరిని సమీపించినంతనే యాతఁడు గుఱితప్పక స్కాచి శూరుని డాలుమధ్యమునఁ దీవ్రముగఁ బొడిచెను. ఆతనిశూలము తుత్తునియలాయెను; స్కాచిశూరుని హయము మూఁడుగజములు వెనుకకుఁ ద్రుళ్లి, చతికిలఁబడెను. కాని, యా శూరుఁ డతిరయమ్మునఁ దన తేజిని లేపి, తదారూఢుఁ డాయెను. కానేమి, యన్ననో! స్కాచిశూరు నాయుధము వాని డాలును, కవచమును, ఆ లోపుననుండిన యుక్కు యొక లోహపుఁ బొరనుగూడ మాత్రమేగాక యాతని యురంబును గూడ ఛేదించెను. శాత్రవశూలాగ్రము తనదేహమున నాటుకొని యుండ, కాన్రేడు నేలఁ బొరలాడెను. సలాఉద్దీనుసుల్తాను, రిచర్డు మొదలగువార లాతావున కరుదెంచిరి. తనవైరి మృతప్రాయుఁ డాయెనని స్కాచిశూరుఁ డెఱుంగఁడు. కాన నాతఁడు విచ్చుకత్తిం బూని, వైరిని సమీపించి, ద్రోహ మంగీకరింపవలయునని యాజ్ఞాపించెను. భూపతనుఁడై యున్న కాన్రేఁ డింకంకుఁ జూచుచు దైన్యమున నిట్టులనెను—"ఇఁక నేమికావలయు? దైవము సత్యనిరూపణ మొనరించెను—నేను ద్రోహిని. కాని, నను మించు ద్రోహులుగలరు.

ఘోదప్రేము! నే నిఁక బ్రదుకఁజాలను—ప్రాయశ్చిత్త మొనరింపుఁడు. ఆచార్యు నరయుఁడు."

రిచర్డు తత్తరంబున సుల్తాను నుద్దేశించి యిట్టులనెను—"మిత్రమా! సంజీవినీ ప్రభావమున వీనిని బ్రదికింపుము."

సుల్తా నిట్లు బదులాడెను—"ఈద్రోహిని వధ్యస్థానమున కీడ్చి యురిదీయవలయునే గాని, రక్షణీయుఁడుగాఁడు." ఆతఁడు కాన్రేడును బరికించి మగుడ నిటులనెను—"వీని గాయము మాన్పనగు; కాని, వీని ముఖమున మృత్యువు తాండవించుచున్నది—జీవించుట దుర్లభము."

"ఐనను, ప్రయత్నింపుము. మరణించిన మరణించుగాక—ఒక గడియ ప్రాణము నిలుపఁజాలుదేని, మహోపకార మొనరించినవాఁడవగుదు. ఆచార్యునిచేతఁ బ్రాయశ్చిత్తము చేయించుకొనఁ గలఁడు. లేనియెడ నాత్మకు గతులు లేకుండ పోవును."

ఆంగ్లనృపాలుఁ డిట్టుల ర్థింప, సుల్తాను సమ్మతించి, క్షతగాత్రుఁడైన కాన్రేడును దన శిబిరమునకుఁ గొంపొమ్మని భటుల నాజ్ఞాపించెను. అంతవఱకును సంక్షుభితమనస్కుఁడై చూచుచుండిన సన్యాసి శ్రేణీనాయకుఁడు అమారీ యిట్టులనెను.—"కాన్రేడు క్రైస్తవుఁడు; క్రైస్తవుని మ్లేచ్ఛు నధీనము జేయరాదు. క్రైస్తవాచారమునకు విరుద్ధముగా మహమ్మదీయులు దుష్టమంత్రతంత్రములు బ్రయోగింతురు. ఆస్ట్రియా నృపాలుఁడును నేనును కాన్రేడు సహచరులము గదా. వాని కుచితమగు చికిత్స మేమే చేయింతుము. కాన, మా మిత్రుని మా శిబిరమునకుఁ గొంపోదుము."

రిచర్డిట్లు ప్రశ్నించెను—"నీ మిత్రుఁడు జీవింపఁగల సాధనము నిరాకరింతువా?"

సన్యాసి యంతఁ దన యారాట మడంచుకొని యిటులనెను—

"సుల్తాను క్రైస్తవమతసమ్మతమగు సాధనము బ్రయోగించునేని, నా గుడారమునకు దయచేయవచ్చును."

కాన్రేడు ఆంగ్లపతాకాపహరణ మొనరించిన మహాద్రోహియైనను జచ్చుటకు సిద్ధముగ నుండుటచేత నాంగ్లనృపాలుఁ డాగ్రహ మెఱుంగక, వానికిఁ బ్రాయశ్చిత్త మైనను జేయింపవలయునని తత్తరపడుచుండెను. అమారీ ప్రవర్తనము దుస్సహముగ నుండెను. ఐనను, అన్యథా తలంపక సన్యాసినాయకుఁడు చెప్పినచొప్పుననే యాచరింపవలయునని సుల్తాను నర్థించి, యనంతరము తన జనుల నుద్దేశించి రిచర్డు లనెను—"ఆంగ్లదేశగౌరవమును బునరుద్ధరించిన యీమహాశూరు నభినందింపుఁడు!"

తోడనే, భూనభోంతరాళము ఘూర్ణిల్లునట్లు వివిధవాద్యములు మ్రోఁగెను. మహమ్మదీయులు గూడ నఱచుచు గేగుచు దమ మానందము వెలిబుచ్చిరి. ఆ కోలాహల మడంగిన పిమ్మట నాంగ్లరాజు స్కాచిశూరు నెంతయు నభినందించి యాతనిం దన కాంతాజనసమక్షమునకుఁ గొంపోయెను. సుల్తానును గూడ నాతఁ డాహ్వానించెను. కాని, యన్యనారీజనసందర్శనము నిజాచారవిరుద్ధ మగుటచేత సుల్తానటు వెడల నొల్లక, మరణసన్నద్ధుఁడగు కాన్రేడునకుఁ జికిత్స యొనరించుటకై యా గుడారమువంకఁ బోయెను.

సుల్తాను వెడలిన యనంతరము, మహమ్మదీయ వాద్యములు వెలువడెను. అయ్యది యాంగ్లరాజ కాంతాజనంబులు తమ యావాసమునకుఁ బోవుచుండిరను సూచన. ఆధ్వని వినినంతనే, మార్గమధ్యమున నుండు మహమ్మదీయు లందఱు మృత్యుదండహాతులో యన, నొక్కసారి నేలఁ బడిరి. వా రా కాంతలను జూడరాదు గదా.

రాజ్ఞీ శిబిరము బ్రవేశించినంతనే, స్కాచిశూరుఁడు వినమ్రుఁడై యామెమ్రోల గంభీరముగ మోఁకరించెను. ఆ ప్రక్కనే రాజసోదర

యుండెను. శూరుఁడు రాణియెదుట మోఁకరించి వినయగౌరవములు ప్రకటించుచున్నను, చిత్తము పూర్తిగ తన్నికటస్థరాజసోదరి మీఁదనే లగ్నమై యుండెను. నృపాలుఁ డిటు లనెను—"దేవీ! శూరులు సుందరనారీజనసంభావనార్హులు. ఈ శూరుని కవచమును చరణాంకుశములను దీసివేయుము. నీవు రాణి వౌదువుగాక—నీవిటులు సంభాషింపవలయు. సోదరీ! నీ వా శిరస్త్రాణము దీయుము. ఈ శూరుఁడు దీనతముండైనను గర్వాభిమానములు దలంపక యీ పరిచర్య సలుపవలయు."

ఆ కాంత లిద్దరు రాజాజ్ఞ నిర్వర్తించిరి. రాణి తన నాథుని చిత్తము రంజింపఁ జేయఁగోరి యాకార్య ముత్సాహముతోడ నొనరించెను. రాజసోదరీ చిత్తము వేఱొక తీరున నుండెను. ఆమె సుందరానన మొకసారి యరుణరంజిత మాయెను; తగనుక్షణము పాండుర మాయెను. వివిధభావసంక్షుభితమనస్కయైన యీ మానిని సాలిస్బరీ ప్రభు సాహాయ్యము వడసినఁ గాని తన శూరుని శిరస్త్రము దీయఁ జాలక పోయెను.

శిరస్త్రాణము తొలఁగినంతనే, స్కాచిశూరుని గంభీరవదనము మనోహరముగఁ గాన్పించెను. గత యుద్ధపరిశ్రమమును, ప్రకృతోత్సాహమును నాతని మోమునఁ దోఁచుచుండెను. ఆంగ్లనృపాలుఁ డాతని నుద్దేశించి యిటు లనెను—"సుందరులారా! శూరులారా! అద్భుత బలపరాక్రమధౌరేయుఁడై యశస్సాంద్రుఁడైన యీ మహానీయుఁడు నికృష్టపు నీగ్రో బానిస యగునా? లేక, దరిద్రశూరుఁ డగునా? ఇట్టి ప్రచ్ఛన్నప్రవర్తన మిఁక యనవసరము. నిజగుణాతిశయమున సర్వజనాభిమానయోగ్యుఁడైన యీ శూరుఁ డభిజాతమున సర్వజనగౌరవార్హుఁ డని యెఱుంగుఁడు. ఈతఁడు స్కాట్లాండుదేశ రాజకుమారుఁడు!"

స్కాచిశూరుఁడు స్కాచిరాజకుమారుఁడని తెలిసినంతనే వారందఱు విస్మయపరవశులైరి. రాజసాగరీ కోమలకరాంచితమగు తనుత్రాణము జారి నేలఁ బడెను. నృపాలుఁడు మగుడ నిటులనెను.—

"మిత్రులారా! నిక్కము. మతయుద్ధార్థమొక సైన్యమును దన కుమారుని నాయకత్వమున మనతోడఁ బంపుదునని స్కాచినృపాలుఁడు సమయమొనరించెను. కాని, యాతఁడటు లాచరింపకపోవుటచేత మేమాగ్రహించితిమి. అందులకుఁ గారణముండియుండును. ఐనను, శూరుఁడగు నీ రాజకుమారుఁడింట నడఁగియుండఁజాలక, యోధులఁ గొందఱను మాత్రము జేరఁదీసి ప్రచ్ఛన్నభావమున బయలుదేఱి మము మార్గమధ్యమునఁ గలసికొనెను. వృద్ధానుచరుఁడొక్కఁడు తక్క యీతని నెఱుంగు యోధులందఱు మరణించిరి. ఆహా! పరిస్థితులెంత భయంకరముగఁ బరిణమించెను! ఈతఁడు మహాశూరుఁడని సంభావించితిగాని, రాజకుమారుఁడని యెఱుంగఁజాలకపోతిని. ఆంగ్లపతాక రక్షణావసరమునఁ బ్రమత్తుఁడై యీతఁడు మరణశిక్షకుఁ బాత్రుఁడాయెను. రాజకుమారా! తాదృశఘోరాపాయ మగ్నుఁడవైనను, నీ యుదంతమేల తెలుపవైతివి? మా దేశమునకుఁ జిరవైరియగు స్కాచి నృపాలుని పుత్రుఁడవని తెలియునంతనే, నినుబంధింతునని తలంచియుందువా? రిచర్డట్టి యధర్మమొనరింపఁడే!"

"ఆంగ్లభూపాలా! నాకట్టి దురూహ పొడమలేదు. కారణమేమన—భవదీయ దేశగౌరవమును గాపాడ నియ్యకొని, ప్రమత్తుడనై, మహాపరాధమొనరించితి. అట్టియెడ మత్ప్రాణరక్షణార్థము రహస్యప్రకటన మొనరించుట పౌరుషహీనమని, హేయమని తలంచితి. మఱియు, మతయుద్ధానంతరమే మదీయ చరిత్ర దెలుపవలయునని సమయమొనరించుకొని యుంటిని. కాని, ప్రాయశ్చిత్తావసరమున మాత్రము తద్విరుద్ధముగఁ బూజ్యుఁడగు నెంగాడీస్వామియెదుట

నాత్మప్రకటన మొనరించుకొంటిని."

స్కాచిరాజకుమారుఁ డట్లు పలుక నాంగ్లనృపాలుఁ డిటులనెను— "ఆ రహస్యము దెలియుటవలననే గావలయు,— ఈ స్వామి పరుగు పరుగున నరుదెంచి, స్కాచిశూరునకు విధించిన మరణశిక్ష మఱలింప వలయునని బ్రతిమాలెను. అదృష్టవశమున నాప్రమాదము తప్పిపో యెను. లేదేని, యీ నెపమున వైరియగు స్కాచినృపాల పుత్రుని జంపితినను దుర్యశ మాచంద్రార్కము నను జుట్టికొని యుండెడిది.

రహస్య గర్భితమగు స్కాచిశూరుని యుదంత మెట్లు తెలిసినో యెఱుంగవలయునని రాణి కుతూహలపడెను. రాజట్లు తెలిపెను.—

"మన ప్రభువులు మువ్వురు యాత్రాపరులై స్కాట్లాండు దేశము బోయిరి. తనకుమారుఁడు ననునాశ్రయించి మతయుద్ధ నిరుగ్నుఁడాయె నని తెలిసికొని, నేనాతని నేమిచేయునోయని వెఱచి, తత్ప్రతిబంధక ముగా మనతైర్థికులను స్కాచినృపాలుఁడు బంధించెను. మనదేశస్థులు నాకావిషయము దెలియఁబఱచిరి. తోడనే, స్కాచిరాజకుమా రుఁడు గావలయునని గ్రహించితి. మనలోయప్రభువు హాతశేషుఁడగు స్కాచి శూరాను చరుని గాంచి యీవిషయము ధృవపఱచెను. సోదరీ! నీ కరమందిమ్మా. రాజకుమారా! నీవు నీకరమందిమ్మా!"

రాజసోదరి ఘనలజ్జాపరవశయై తన కలవరము మఱుఁగు పఱుపఁ బ్రయత్నింపుచు నిటులనెను.—"సోదరా! వలదు, వలదు! సుల్తా నును నాతని జనులను గ్రైస్తవ మతస్థుల నొనరింప నాసించి నన్నా మ్లేచ్ఛ రాజునకు భార్యగా నీయఁదలంచితివిగదా?"

"ఔను, జోస్యమట్లు స్ఫురింపఁజేసెను. ఇపుడింకొక విధమునఁ బరిణమించెను."

ఆంగ్లనృపాలుఁ డటులు బదులాడ, నా జోస్యము చెప్పిన యెంగాడీ స్వామి యిటులనెను.—"నృపాలా! ఇటు లెక్కసక్కెము లాడ

కాదు. దైవప్రభావ మమోఘము. దుర్బలుఁడగు మానవుఁడు సము చితముగ నరయఁజాలక పొరపడును. సలాఉద్దీను సుల్తానును స్కాచి శూరుఁడును నాగుహయందు నిద్రాపరులై యుండఁ దివ్యనేత్రి పరీక్ష యొనరించితిని. నాయతిథియగు రాజన్యుఁ డాంగ్లరాజబాంధవీ కరగ్రహణ మొనరించునని తెలిసికొంటిని. ఇల్దరీము నామధారి యగు నా యతిథి పాదుషా యని యెఱుంగుదుగాని, స్కాచి శూర వేషధారియగు కణతుఁడు స్కాచి రాజకుమారుఁడని యెఱుంగనైతిని. ఆ కారణమున, మేరీని వివాహమాడవలసిన రాజన్యుఁడు సుల్తానే గావలయునని నిశ్చయించితిని. మఱియు, మేరీ మగఁడు క్రైస్తవుఁ డనియు గ్రిహములు తెలిపెను. కావున, నాంగ్లరాజ సోదరీ వివాహా నంతరము సుల్తాను స్వీయమత పరిత్యాగమును గ్రైస్తవమతావలంబ నమును నొనరించునని సమాధాన మొనరించుకొంటిని. సుల్తాను గుణ వంతుఁ డగుటచేత నాతఁడు నిశ్చయముగ నటు లొనరించునని విశ్వ సించితిని. ఆహా! గ్రహగమనపరిశీలనాసక్తుఁడనని, కాలరహస్య జ్ఞుఁడనని గర్వించితిని. నా యవివేక మిపుడు తెల్లమాయెను. దృఢ విశ్వాసబద్ధులమై, యప్రమత్తులమై, భయభక్తియుతులమై నిరంత రాయమానముగ దైవసంస్మరణ మొనరింపవలయుఁ గాని తద్రహస్య భేదన మొనరింపఁబూనుట యసంబద్ధము. మహాభారవినమ్రుఁడనయ్యు దైవజ్ఞుడనని గర్వించి, క్రైస్తవరాజన్యులకు హితము గలుపఁగడంగి ధూళిసన్నిభముగ నల్పుఁడనని ప్రబోధము గాంచితిని.ఇఁక శృంఖలా విముక్తుఁడనైతి. నే నిఁక దైవచింతానిమగ్నుఁడనై తత్సాయు జ్యము గాంతుగాక.”

ఎంగాడీ సన్యాసి యట్లు ప్రలాపించుచు నా సభనుండి వెడలి పోయెను. నాఁటఁగోలె నాతని యున్మాదము మందగించెను. కఠిన ప్రాయశ్చిత్తములు మాని యాతఁడు సముచితముగ నాచరింపఁ దొడఁ

గెను. అంతవఱకు నాతఁడు తనజ్యోత్స్న మమోఘమని గర్వించియుండెఁ గదా. కాని, తన దివ్యజ్ఞానము ఘోరముగఁ దప్పిపోయెనని స్పష్టమైనంతనే, యాతని దురహంకార మంతరించెను.

రాజసోదరీసేవాపరాయణుఁడై యద్భుత బలపరాక్రమములు బ్రదర్శించి యశస్సాంద్రుఁడై, తత్ప్రణయము కతంబుననే బహుకష్ట నిమగ్నుఁడై, యాంగ్లపతాకాపహర్తయగు కాన్రేడును నిర్జించిన స్కాచిరాజ కుమారుఁడు, తన ప్రణయినిని సముచితముగ సంభావించెనని వేఱుగఁ జెప్పనవసరము లేదు.

## ౨౬

సలాఉద్దీను సుల్తాను క్రైస్తవనాయకులకు మధ్యాహ్నసమయమున విందు గావించెను. తత్సన్నాహములు ప్రాచ్యసాంప్రదాయసిద్ధముగ నపూర్వవైభవముతో నొప్పుచుండెను. మనోహరరత్నకంబళము లప్పై నతిథులు సుఖాసీనులగుటకు మెత్తనిదిండ్లు లమరియుండెను. ఆ పటకుటీరము సముచితాలంకార విరాజమానమై నయనపర్వముగ నుండెను. తదంతర సువర్ణరజతాద్యంబరములు వర్ణనాతీతములు. విందున కాయితమైన యాహారపదార్థము లసంఖ్యములు, అపూర్వములు, మనోహరములు. సర్వమాంసఖాద్యములును, శాకాహారములునుగూడ నుండెను. హిమసన్నిభ శీతల మధురపానీయములు సువర్ణరజతపాత్రములందు సిద్ధముగ నుండెను.

అఖండవైభవాస్పదమగు మృదులాసనము సుల్తానునకుఁ బ్రత్యేకముగ నేర్పడి యుండెను. ఆతఁడు సంభావింపఁదగు పరిముఖులుగూడ నచటనే సుఖోపవిష్టులు కాఁగలరు. ఆ గుడారము నందంతటను

లెక్కకు మీఱిన కేతనములు రాజిల్లుచుండెను. అయ్యవి సుల్తాను సహస్రవిజయచిహ్నములు. అందు, దీర్ఘ శూలాగ్రమున నెగురు పతాకమునం దిట్లు లిఖింపఁబడి యుండెను. "సలాఉద్దీను రారాజు: సలాఉద్దీను జగజ్జేత: సలాఉద్దీను మరణింపవలయు." తత్సన్నాహము లొనరించిన భానిసలు శిరస్సులువాంచి, చేతులు గట్టి జీవరహిత శిలావిగ్రహములవలె, గారడీఁడుత్రిప్పువఱకు నిశ్చలముగ నుండు తోలుబొమ్మలవలె నిలిచియుండిరి.

తన యతిథుల రాకకై యెదురుచూచు సుల్తాను హస్తమునందు నెంగాడీస్వామి పంపిన పత్రముండెను. తురుష్క సార్వభౌముఁ డద్దానిని బరిశీలించి తా దాలోచనా నిమగ్నుఁడాయెను.—

"ఈ శాస్త్రముగమ్యము. భావిరహస్య ప్రకటన మొనరించునట్టులే యుండి తుదకు వంచించును. ఆంగ్లరాజవిరోధి తద్రాజబాంధవీ వివాహానంతరము మిత్రుఁడగునని కదా జోస్యము! అట్టి ప్రబలవిరోధి నేఁ గావలయుఁగాని, మిన్యుఁడగునని యెట్లు తలంపనగును? ఐనను, విషయమట్టులే పరిణమించెను. వనాంతరవాసి యగు మృగరాజుకంటె గృహమునఁ జొరబడు బావు పిల్లియే యధికభయావహము గదా. అట్టులే, నే దూరస్థుఁడఁగాన, సన్నిహితుఁడగు స్కాచిన్నపాలుఁడే పరికృతవిరోధి. మఱియు, నాంగ్లరాజకన్యాకరగ్రహణ మొనరించు వాఁడు క్రైస్తవుఁడని గ్రహములు దెలిపెఁగదా. ఉన్మాదకుఁడగు నెంగాడీస్వామి తద్విషయపురస్కృతుఁడై వెంగలియై నేను క్రైస్తవమతావలంబన మొనరింతునని దృఢముగ విశ్వసించెను. వాని మతి భ్రమించిన భ్రమించుఁగాక. పవిత్రమహమ్మదీయ మతవిశ్వాసబుద్ధుఁడను నే నటు దలంపవలయునా? ఛీ! ఈ వృథాచింతన మేల!—ఓరీ! హస్సాంగా! ఏమి, నీ యాగడము! ఏల రావలయు?"

ఆ సమయమునఁ బ్రవేశించినవాఁడు సకటబను నామధేయుఁడగు

వ్రకాంగుఁడు, వాని వికృతాననము భయావేశమున వికృతతరమాయెను. నోరు తెఱచి, చెప్పవాల్పక, చేతులు చాపియున్మత్తుని చందమున వాఁడందుఁ జొరఁబడెను. సుల్తాను కఠినముగఁ బ్రశ్నింప వాఁడు సముచితముగఁ బ్రత్యుత్తర మీయఁజాలక, గద్గదస్వరమున—'ఇఁక సరి!' యని పలికెను. సుల్తాను కుపితుఁడై మగుడఁ బ్రశ్నింప, వాఁడు మగుడ నట్టులే యనెను. కారణమేమన, వాఁడు భయసంభ్రమాకులుఁడై తా నేమి వాకొనెనో యెఱుంగఁడాయెను. పాదుషా యుల్లుగర్జించెను—"ఓరీ! వినోదమున కిది యదనుగాదు, భద్రము!"

"దేవా! వినోదముగాదు. భయంకరము—ఆలింపవలయు—"

వాఁడేమి తెలుపునో వినఁగోరి, వానితోడ సుల్తానొక గదిలోనికి బోయెను. వారేమి ప్రసంగించిరోగాని, యతిథిజనాగమనము దెలుపు తూర్యములు మ్రోఁగినంతనే, సలాఉద్దీను సుల్తాను శీఘ్రముగ నరుదెంచి, క్రైస్తవరాజన్యులను సముచితముగ సంభావించెను. అందు స్కాచిరాజకుమారుని గడుంగడు నాదరించెను. సుల్తాను మహమ్మదీయ ప్రభురూపమునను, స్కాచిరాజకుమారుఁడు సాధారణ స్కాచిశూరరూపమునను నాఁడా యెడారియందుఁ దారసిల్లి పరస్పరబలంములు చవిచూచి, మిత్రులైరిగదా. అనంతరము సుల్తాను హాకీము వేషమునఁ దన స్కాచిమిత్రుని మృత్యువునుండి తప్పించెను; స్కాచిశూరుఁడు నిగ్రోబానిసయాయెను. ఇపుడీరువురు బ్రచ్ఛన్నరూపములు వీడి యథాకృతులుదాల్చిరి. సుల్తాను తద్విషయ సంస్మరణ మొనరించి, యాతని నెంతయుఁ బ్రశంసించెను. స్కాచిరాజకుమారుఁ డాతని సుగుణములు సముచితముగఁ గొనియాడి మందహాస మొనరించి యిటులనెను—"నాఁడు నామిత్రుఁడగు నిల్దరీము నీరము ఘనీభవించి హిమమగునని యెఱుంగకపోయెఁగదా. నేఁడో! 'షర్బతు' హిమసమావృతమై కడుశీతలమై మనోహరమైయున్నది."

సుల్తానిటులనెను.—"ఆకృతికిఁ దగునట్లు భాషింపవలయు. కుర్దు దేశపు మహమ్మదీయుని జ్ఞాన మాపాటిదియె.

'విమలస్ఫటిక సన్నిభఘనాంబు పథంబున నాపాదమస్తకము కవచము ధరించి బహుక్రోశదూర మశ్వారూఢుఁడనై యరుదెంచితి' నని నీవంటివి, సమాధాన మేమిత్తువో చూడవలయునని నాకావిషయము దుర్గ్రాహ్యమైనట్లు నటించితిని."

అట్లు సంభాషించు సుల్తాను శీతల మధురపానపాత్ర మాతని కందిచ్చెను. తత్పానీయము గాంచినంతనే యాస్ట్రియానృపాలుఁడత్యాతురంబున నగుదెంచి, గత రాత్రి మధుసేవవలనను నాఁటి వేడిమివలనను శోషిల్లు కంఠము సేదదేఱునట్లు స్కాచిరాజకుమారు ననంతరము గడగడ ద్రావి పరమానందభరితుఁడాయెను. ఆతఁడా కాంచనపాత్రమును సన్యాసినాయకున కందిచ్చెను. తత్క్షణము సుల్తానొక సన్న యొనరింప, వక్రాంగుఁడు బిఱబిఱ నగుదెంచి "యిఁకసరి!" యని కఠోరముగ నఱచెను. తోడనే, సింహమును గాంచు మృగముచందమున, సన్యాసి భయప్రకంపితుఁడాయెను. ఐనను, వాఁడాక్షణము తెలివొంది, తన కలవరపాటు మఱుగుపఱచుటకుఁ గాఁబోలు—సువర్ణకలశ మెత్తి త్రావఁబోయెను. కాని, యా దురాత్మునకట్టి యవకాశము లేకపోయెను. వాని పెదవులా పాత్రమంటకమున్నె, సుల్తాను కరవాలము, మేఘనిర్ముక్తమగు మెఱుపువలెఁ గోశమునుండి తళుక్కున లేచెను: సన్యాసినాయకుని శిరము తత్క్షణము నేలపై దొరలెను. ముష్టిబద్ధమైన పాత్ర మట్టులే యుండ, మృతకళేబర మొక్కక్షణమున నేలఁ గూలెను. నాళవినిర్గతరుధిరముతోడను, కలశాంతర్ద్రవముతోడను నా ప్రదేశ మార్ద్రమాయెను.

సన్యాసి నాయకుని ఘోరమరణము గాంచినంతనే క్రైస్తవ రాజన్యులాగ్రహధురీణులై యేకకంఠమున ద్రోహమని యఱచిరి.

నిజమిత్రి రుధిరారుణ కృపాణధారియగు సుల్తాను తనప్రక్కనే యుండుటచేతఁ దనగతియేమగునోయని యాస్ట్రియానృపాలుఁడు త్రుళ్లెను. రిచర్డు మొదలగు మహాయోధులు తదవసరోచితముగాఁ దమ ఖడ్గములు బట్టిరి. ఐనను, సుల్తాను యథా నిశ్చలచిత్తుఁడై, యేమియు సంభవింపనట్టులు నిశ్చలస్వరమున నిట్లు లనెను.—

"ఆస్ట్రియానృపాలా! భయపడకుము. ఆంగ్లనృపాలా! ఆగ్రహింపక, నాను దాలింపుము. ఈ మానవాధముఁ డెన్ని ద్రోహము లాచరించినను, సైరించితిని.—భవత్ప్రాణాపహరణప్రయత్న నిమగ్నుఁ డాయెను: సంజీవినీ ప్రభావమున నిన్నుద్ధరించి యీ స్కాచిరాజ కుమారునితోడ వెడలు నప్పు డెడారియందు నమ్ము దారుణముగ వెన్నాడెను—మా యశ్వము లత్యంత జవ సత్వ సంపన్నములగుటచేతనే మేము ప్రాణరక్షణ మొనరించుకొనఁ జాలితిమి: ఈ సమయముననో! అల్ప సేనా పరిరక్షితులమై యిట నుందుమని యెఱింగి మము బట్టుటకై వీఁడొక మహాసేన సిద్ధపఱచెను; నే నావిషయము కని పెట్టఁజాలితిని—సమయవిరుద్ధముగ నాతోడ నింత జన మరుదెంచుట కిదియే కారణము; దాన వాని దుష్టప్రయత్నము నిరర్థకమాయెను: ఇట్టి యొక్కొక యపరాధమునకే వీఁడు వధ్యుఁడై నను, సహించితి. ఈ మిథ్యా సన్యాసి యంతమాత్రమున నూఱడింపఁ డాయెను. తన మిత్రుఁడగు కాన్రేడు మరణించు సమయమున, దన రహస్యములు గూడ—వా రిరువురు నొనరించిన కుట్రలు రహస్యములు ననేకములు గదా!—బయల్పడునని వెఱచి, విశోరగసన్నిభముగఁ గడు క్రూరుఁడై యీ నరాధముఁడు వానిని వధించెను."

"ఏమి! కాన్రేడు వధింపఁబడెనే! సన్యాసినాయకుఁడగు నమారీ వారి మిత్రుఁడే! ద్వంద్వయుద్ధమునఁ గూడ నాతనిఁ బురస్కరించుకొని యరుదెంచెనే!"

రిచర్డ్సు సవిస్మయముగఁ బలుక, సుల్తా నిట్లనెను.—"నీ వుపాయనముగఁ బంపిన యీ వక్రాంగుఁడే సాక్షి. పరమాత్ముఁ డిట్టి నికృష్ట సాధనముల వలననే రహస్యహత్యలను బయల్పఱచును."

అనంతర మాతఁడే కాన్రేడు హత్య గుఱించి తెలియఁబఱచెను.— వక్రాంగుఁడగు నకటబనుఁడు కాలహరణార్థ మిటు నటుఁ దిరుగాడుచుఁ జిన్నచిన్న చౌర్యములు గూడఁ జేయుచుండును. అభ్యాస వశమున వాఁ డిప్పుడు గూడ బయలుదేఱి కాన్రేడు గుడారము బ్రవేశించెను. అం దెవ్వరులేరు. కాన్రేడు మరవస్థ యూతని సోదరునకుఁ దెలుపవలయునని కొందఱు పరిజనులు వెడలియుండిరి: మిగిలిన వారలు తమ స్వామిని దలంపక యొకింత దవ్వున వినోదించుచుండిరి. సుల్తా నొసంగిన సంజీవినీ ప్రభావమునఁ గాన్రేడు నిద్రాపరుఁడాయెను. వక్రాంగుఁడా కారణమున నందు నిర్భయముగాఁ దిరుగఁజాలెను. అంతలో నడుగుల చప్పుడు వినవచ్చెను. తోడనే, వాఁ డొక తెర మఱుఁగున దాగి, యే తెంచినవాఁడు సన్యాసినాయకుఁడని కనిపెట్టఁ గలిగెను. వాఁడు మఱియు భద్రముగఁ నడఁగి చూడఁ దొడంగెను. గాఢనిద్రాధీనుఁడైన కాన్రేడు సన్యాసి ప్రవేశించినంతనే కనువిచ్చి చూచెను. చూచుటయే గాదు—చూచినంతనే తన సహచరుని దుష్టాభిప్రాయము స్ఫురింప, నాతఁడు భయకంపితుఁడై ప్రశ్నించెను. తన మిత్రునకుఁ బ్రాయశ్చిత్తము జేయింప నరుదెంచితినని సన్యాసి బదులాడెను. అంతవఱకును వక్రాంగుఁడు స్పష్టముగ నాలించెను. అనంతరము, క్షతగాత్రుఁ డవధ్యుఁడని కాన్రేడు దీనముగఁ బ్రతిమాలుచుండ, సన్యాసి 'యిఁకసరి!'—యనుచు నొక్కపోటునఁ దన మిత్రునిఁ గడ తేర్చెను. 'ఇఁక సరి' యను పదము వక్రాంగుని మనసున నాటుకొనిపోయెను. తదనంతరము సుల్తా నిట్లనెను.—

"కాన్రేడు మృతకళేబరము బరీక్ష జేయించితిని. మఱియు, మీ

సమక్షమున నీ వక్రాంగుఁడు 'ఇఁక సరి!' యనినంతనే, హంతకుఁ డెట్లు ప్రకంపించెనో యెఱుంగుదురు గదా."

ఆంగ్లనృపాలుఁ డొక తడవూరకుండి యిటులనెను.—"ఇట్టి కంటకుఁడు వధ్యుఁడగుట ధర్మమె. కాని, శిరచ్ఛేదనమున కిది సమయము గాదు. ఆ పని నీవే యొనరింపనేల?"

సుల్తా నిటులనెను.—"నేనిటు దలంపలేదు. కాని, ఆలసించుటకు వీలు లేకపోయెను. ఆలసించితినేని, యీ పాపాత్ముఁడు చిరంజీవియై యుండఁగలఁడు. మదాతిథ్యము స్వీకరించిన యనంతరము మత్పితృ సంహార మొనరించినను, వాఁడు నా కవధ్యుఁడు. కావున, నా పానీయము జవిగాంచకమున్నె వానిని ఖండింపవలసి వచ్చెను. ఈ విషయ మింక స్మరింపవలదు."

బానిస లరుదెంచి యా మృతకళేబరము గొంపోయి, యాస్థలము శుభ్రపఱచిరి. ఐనను, క్రైస్తవరాజన్యుల చిత్తములు తద్విషయ చింతనాయత్తములై, సంభ్రమానుమానాధీనములై యుండెను. రిచర్డు మాత్రము నిశ్చలచిత్తుఁడై యుండెను. అతఁడైనను నేమియో యోచించి, డోలాయమాన మానసుఁడై, తుదకు సుల్తానుం గాంచి, యాతఁడు కణతరూపము ధరించియుండిన స్కాచిరాజ కుమారుని తోడఁ దొల్లి ద్వంద్వయుద్ధ మొనరించిన విషయము గుఱించి యల్లనఁ బ్రశ్నించెను. సుల్తాను మందహాస మొనరించి, తాము సంచారశూర ధర్మోచితముగాఁ బోరాడితి మనియు, నందు జయాపజయనిర్ణయ మున కవకాశము లేక పోయెననియు, దానావిషయము గుఱించి సగర్వముగఁ బలుకుటకుఁ గూడ నవకాశము లేదనియు వాక్రుచ్చెను. స్కాచిరాజ కుమారుఁడు తదాధిక్యము బరిగ్రహింప నొల్లక, సుల్తానునే సగౌరవముగా నభినందించెను. యుద్ధప్రియుఁడగు నాంగ్లనృపాలుఁ డీర్ష్యానల తప్తుఁడై యిటులనెను—

"స్కాచిరాజకుమారా! ధన్యుఁడవు. మద్బాంధవీ కరగ్రహణము కంటె సలాఉద్దీనుతోడి పోరాటమే శ్రేష్ఠమని భావింతును. మహాశూరుల సమావేశము సార్థకము గావలయు. సర్వజన సమ్మతమై యుండు సుస్థిరశాంతిస్థాపన ప్రయత్నమొనరింపకుండుటసంబద్ధము. సుల్తాను మిత్రమా! పాలస్థానము మీకును మాకును జిరకాలాకాంక్షితమై, సమరకారణమై యున్నది గదా. ఈ సభాసదులు గాంచుచుండ, మనమిరువుర మీవిషయమేల పరిష్కరింపరాదు? అల్లదె రంగభూమి. మహమ్మదీయాన్వయమున నినుమించు శూరుఁ డుదయించుటసంభవము. మా క్రైస్తవమిత్రులు సమ్మతింతురేని, వారి పక్షముననే బోరాడుటకు సంసిద్ధుఁడను. జీవములు బాయువఱకును ద్వంద్వయుద్ధ మాచరించి, శాశ్వతసంధి ప్రతిష్ఠింతుము గాక! ఏమందువు?

కాని, ఎరూసలేము నగరము సుల్తాను నధీనముననే యుండెఁ గదా. కావున నాకారణమున ద్వంద్వయుద్ధ మొనరించుట కాతఁడు సమ్మతింపక పోయెను. కేవల గౌరవార్థమైనను బోరాడవలయునని రిచర్డుమగుడఁ గోరెను. ఆతని తత్తరపాటు గాంచి మందహాస మొనరించి, సుల్తానిటు లనెను—

"ఇదియు ధర్మవిరుద్ధము. ప్రజాపాలకుఁడు ప్రజాహితకార్య మొనరింప వలయుఁ గాని, యన్యథా చరింపరాదు. మఱియు, నాకొక పుత్రుఁడు గలఁడేని, యిట్టికార్య మొనరించుటకు స్వతంత్రుఁడను."

ఆంగ్లనృపాలు నుత్సాహ మంతరించెను.

విందు ముగిసెను. అతిథులిఁక దమ యావాసములకుఁ బోవలయు. సుల్తాను లేచి రిచర్డుకరం బందుకొని, సముచితసంభాషణంబుల సంభావించి యిటులనెను—"మనమిఁక వీడవలయు. పునర్దర్శన మసంభవము. క్రైస్తవరాజన్యసంఘము విచ్ఛిన్నమాయెను. ఇఁక ననుఁ దాఁకి

విజయముగాంచు టసాధ్యమని నీవ యెఱుంగుదు. మదధీనమగు జెరూసలేము నగరము మీకువలె మాకును బవిత్రవంతము. కాన, నయ్యదివినా, నీవేమి కోరినను, ఆ జలధార జలంబులిచ్చు చందమున, ధారాళముగ నియ్యకొందును."

కథ సమాప్తమాయెను. రిచర్డు సలాఉద్దీనుల సంధి నిబంధనలు చరిత్ర ప్రసిద్ధములు. మఱునాఁడు రిచర్డు తన శిబిరమున కరుదెంచెను. ప్రణయబద్ధులగు మేరీ స్కాచిరాజకుమారులు వివాహబద్ధులైరి. ఉదాత్తచిత్తుఁడగు తురుష్క సార్వభౌముడు సుప్రసిద్ధమగు సంజీవిని దదవసరోపాయనముగా సాభిమానముగా నంపెను.

సమాప్తము.

ప్రకాశకులు :—అడ్డేపల్లి లక్ష్మణస్వామి నాయఁడుగారు

# సరస్వతీగ్రంథమండలి
# రాజమహేంద్రవరము

నవలలు - నవరసభరితములగు - నవలలు

ముచ్చటైన బొమ్మలతో ముద్దులొలుకు క్యాలికోబైండుతో
రెండుమాసముల కొక్కటిగా వెలువడుచుండును.

## నిబంధనలు

1. ఇందుఁ జందాదారులుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా రు 0-4-0 లు చెల్లింపవలయును.

2. ఇందు రెండు మాసముల కొక్కటిగ వెలువడుచుండు క్యాలికోబైండుగల ప్రతిగ్రంథమును 1-0-0 వెలకుఁ జందాదారులకుఁ బంపుచుందుము.

3. గ్రంథములఁ బంపుట కగు పోస్టేజీ మొదలగు కర్చు లన్నియును జందాదారులే భరింపవలయును.

4. చందాదారు లగువారు వెనుకటి గ్రంథముల నన్నిటిని గొనవలయు నను నియమములేదు. కాని వారు కోరినచో వెనుకటి పుస్తకములు కూడఁ జందాదారుల వెలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

5. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

6. ముందు ప్రకటింపఁబడు ఆయీపుస్తకములకు రు 7-2-0 లు ముందుగఁ బంపువారికి ఆయీపుస్తకములను అన్‌రిజష్టర్డు పార్శిలుగా పంపుచుందుము. అట్లు పంపినవారికి ఆయీపుస్తకములకు చెల్లింపవలసిన మనియార్డరు కమీషను 0-12-0 లును రిజిష్టర్డు ఖర్చు 0-12-0 లును 1-8-0 కూడివచ్చును.

ఇం దీవరకు ప్రకటింపఁబడిన గ్రంథములు :—చిత్రపటశోభితములు.

---

## ప్రేమసుందరి

కర్త:
చిలరావూరి కామేశ్వరరావు
బి. ఏ., ఎల్. టి.,

నవరసభరితమగుసాంఘికనవల. క్యాలికో బైండు 272 పుటలు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## చోరశిఖామణి

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

లోమహర్షకమగు డిటెక్టివునవల. క్యాలికో బైండు 197 పుటలు వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## లక్ష్మీప్రసాదము

కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

నవరసభరితమగు సాంఘికనవల ఇందు మూఢురాండ్రగు స్త్రీలవలన కుటుంబములందు సంభవించు కలహములును అందువలన కలుగు కష్టపరంపరలు చక్కగా వర్ణింపఁబడినవి 346 పుటలు వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

## హాత్యారహస్యము

అనువాదకులు ·
సాహితీసమితి సభ్యుడు

జటిలమగు ఇతివృత్తముగల డిటెక్టివునవల. తుదివరకు దోషులెవరో కనుగొనుటకు వీలు లేకుండు నటుల దుండగులు పన్నిన పన్నాగము లత్యంత భయంకరములు. వెల చందాదారులకు 1-0-0 ఇతరులకు రు 1-8-0

## ఫాస్టు (ప్రథమభాగము)

అనువాదకులు :
వెమురుమూడి శేషగిరిరావు

అధికార దుర్వినియోగము-అభేద్యములైన కోటలయందు దురాచారుల దురంతములు - మహాపరిశ్రమము-రహస్యమువలన గలిగిన తీవ్రమనోవేదనము, మున్నగు చిత్రవిచిత్రకల్పన, పాఠకమహాశయుల జిత్తరువుల గావించుచుండును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0,

## షాస్టు (ద్వితీయభాగము)

అనువాదకులు.

వెదురుమూడి శేషగిరిరావు

ఈశ్వర కృపాతిశయము, భక్తసంరక్షణము, భాగవతవిజయము, విమలప్రేమాభిరాములగు సాధు యువతీ యువజనుల కల్యాణము మున్నగు నత్యద్భుత ఘట్టములు. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కుముద్వతి

రచయిత :

శ్రీమతి పులవర్తి కమలావతీదేవి

ఇందలి దుష్టకేతుని దౌష్ట్యము భయావహము మాయామారీచుని మాయలు భయంకరకృత్యములు చదివి యానందింపుడు. ఇయ్యది నవలకాదు నవ రసరత్నాకరము. వీరశృంగార కరుణారసంబుల యేకీభావముచే త్రివేణీసంగమమునుబోలి చదువరుల హృదయముల రసరంజితములుగ జేయును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

## చిన్నకోడలు

అనువాదకులు.

శ్రీకొపవరపు నరసింహము

శ్రీయుత కాశీనాధ రఘునాథమిత్రగారిచె మహారాష్ట్రభాషయందు వ్రాయబడిన థాకట్యానూన్ భాయి నుండి తెలిగింపబడినది. కథాచమత్కృతి నవీనము. చిన్నకోడలు "లక్ష్మి" యొక్క శాంత్యౌదార్యాది సుగుణములును, పతిభక్తియు మిక్కిలి పేదస్థితియందున్న సంసారమును తన చాతుర్యముచే లక్ష్మిసంపన్నము గాఁజేయుట మొదలగు సంగతులు చదువవలసినవి. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## రహస్యభేదనము

కర్త.

కేతవరపు వెంకటశాస్త్రి

రహస్యాపరాధ పరిశోధక నవల కథాకల్పన మత్యద్భుతము. సంఘటనము లతిభయంకరములు. నిగూఢవాత్యలెన్నియో వర్ణింపఁబడినవి. ఇది స్వతంత్రగ్రంథము. ఇతివృత్తమాంధ్రదేశమునకు సంబంధించినది. ఇట్టి గ్రంథ మిదివఱ కాంధ్రదేశములో వెలువడలేదు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0.

## సింహగడము

అనువాదకులు :

శ్రీ వాసుదేవరావు

మహారాష్ట్ర భాషలో శ్రీహరినారాయణ అపటె గారు విరచించిన గ్రంథమున కనువాదము. రమణీయమగు యీకథ గాంభీర్యమై యుండును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మణిహారము

కర్త:
బులుసు వేంకటసుబ్బారావు
బి. ఏ., బి. ఎల్.,

ప్రభాకరుని పగిది ప్రకాశించు ప్రభాకరుడు హృదయరంజనియగు రంజని, చంద్రునిబోలు విజయచంద్రుడు, వికసితహృదయపద్మినియగు పద్మిని, సార్వభౌమలక్షణలక్షితుండగు అలకసుందరుడును చదువరి హృదయమును వివిధరసభావతరంగముల దేలించును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులక్కు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు

(ప్రథమభాగము)
అనువాదకులు
మొసలికంటి
సంజీవరావు పంతులు

కీ. శే. ధీరేంద్రనాథపాల్ గారి సుప్రసిద్ధ గ్రంథరాజమున కనువాదము. ఇయ్యది నవరసభరితమై, చరిత్రాత్మకమై, చిత్రవిచిత్రోపకథలతో విరాజిల్లుచు పాఠకమహాశయుల కెంతయు నానందదాయకముగ నుండును అద్భుతసంఘటనములతో నిండి సులభశైలిని వ్రాయబడిన యీ గ్రంథమెల్లరు చదువ తగియున్నది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0

## మొగలాయీ దర్బారు

(ద్వితీయభాగము)
అనువాదకులు: మొసలికంటి
సంజీవరావు పంతులు

ప్రథమసంపుటమందలి నిగూఢములైన దారుణ శవప్రదర్శనములు, పిశాచకృత్యములు ఇందు భేదింపబడి చదువరుల నానందనిమగ్నుల నొనర్చును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఘటనాచక్రము

అనువాదకులు:
గారపాటి అంజనేయ చౌదరి

పాంచకడీదేవ విరచితమగు భీషణపరిశోధ కనువాదము. ఆశ్చర్యములకు బుట్టినిల్లు, కౌతుకమునకు భాండారము, విచిత్రములకు గనియై, పాఠకులను విస్మయసాగరమున ముంచివేయును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## రాజసుందరి

కర్త:
కేతవరపు వేంకటశాస్త్రి

ఆంధ్రదేశాత్మకమగు స్వతంత్రకల్పన సాంఘికనవల. కథావిధాన మత్యద్భుతము నిరుపమానము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కుంకుమభరణి

అనువాదకులు:
శ్రీ శివశంకరశాస్త్రి

ఇది సాంఘికనవల. మామూలునవలలవలె గాక యిందు క్రొత్తచమత్కారములున్నవి. చదువుటకు మిక్కిలి మనోహరము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## జాగిలము

రచయిత : శ్రీమతి సీరము సుభద్రయాంబ

అతిభయంకర నిరూపక నవలారాజము. ఘాతకుడు భయంకరమగు జాగిలము సహాయమున చేయు హత్యలు హృదయవిదారకములు. అపరాధపరిశోధకులు యీవిషమసమస్యను భేదించుటతి విచిత్రము. హత్యలపై హత్యలు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0

## సరస్వతి

అనువాదకులు : శ్రీవాసుదేవరావు, శ్రీకృష్ణరఘునాధరావు

మహారాష్ట్రభాషనుండి యాంధ్రీకరింపఁబడిన సాంఘికనవల. మనోహర కథా విధానము. శైలి నాతికఠినము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఆనందాభాయి

కర్త. కేతవరపు వేంకటశాస్త్రి

ఇయ్యది యూహాజనితమే యైనను చరిత్రసమ్మిళితము. పండితకవులచే మనోహరముగా వ్రాయబడినది. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు 1-8-0.

## హత్యాన్వేషణము

అనువాదకులు · గుర్రాల నారాయణరావు

అద్భుతమగు పరిశోధక నవలారాజము. ఆంగ్లేయ గ్రంథమునుండి మనోహరముగా భాషాంతరీకరింపఁబడినది. తుదివరకు చదివినగాని అపరాధిని తెలుసుకొనలేరు. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు

(తృతీయభాగము)

అనువాదకులు : మొసలికంటి సంజీవరావు పంతులు

మొదటి రెండు సంపుటములవలె నిదియును చరిత్రాత్మకమై, నవరసభరితమై, చిత్రవిచిత్రోపకథల కాలవాలమై, మనోహరమై, యానందదాయకమై, పాఠకుల కెంతయు విజ్ఞానప్రదమైయొప్పును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## గంగ

కర్త : చిర్రావూరి కామేశ్వరరావు బి. ఏ. ఎల్. టి.,

గంగాచరిత్రము కరుణరసప్రపూర్ణము, ప్రేమ భావాత్మకము, శైలి కోమలమై, సుధామధురమై, తేటనీటివెల్లువవలె, ముద్దులొలుకుచుండును. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## మొగలాయీ దర్బారు

(చతుర్థభాగము)

అనువాదకులు: మొసలికంటి సంజీవరావు పంతులు

కథోపకథాపల్లవులతో నల్లిబిల్లిగ నల్లుకొనియున్న యీ నవలారాజము సర్వజనహృదయాకర్షణీయము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## కోహినూరు

కర్త

చిల్లరిగె శ్రీనివాసరావు

ఈ కోహినూరు అమూల్యమైన వజ్రముగాదు. అతిమనోహరమైన చారిత్రిక నవల. శైలి మృదు మధురము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఆర్సీన్‌లుపేలా

అనువాదకులు :

జొన్నలగడ్డ సత్యనారాయణ

మూర్తి ఎం ఏ,

అత్యద్భుతమయిన డిటెక్టివు నవల. ఇందలి లుపే లా మర్మములు, మానవహంతకి మాయలు అనిర్వాచ్యములయి పాఠకులను విస్మయవిపరీత చేతస్కులను గావించును. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అపరిచిత

కర్త :

మాలే రాఘవరావు

మనోహరమైన సహజ సాంసారిక, సాంఘిక సంఘటనలతో వెల్లివిరియు అపూర్వపరిశోధక నవలారాజము. ఇందలి ఇతివృత్తము సర్వజనహృదయానందప్రదము. క్రొత్తపోకడలతో గూడిన దీని శైలి మృదుమధురము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అంతఃపురము

(ప్రథమ భాగము)

అనువాదకులు :

మొసలికంటి సంజీవరావు

పంతులు

సుప్రసిద్ధ రెనాల్డ్సు గ్రంథరాజమునకనువాదము. తురుష్క చరిత్రాధారమగు నియ్యది సర్వజనహృదయాకర్షణీయమైనది. నవరసభరితము — అందును శృంగారరసప్రధానము—అద్భుతసంఘటననిధానము. ఎల్లరు చదువదగినది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అంతఃపురము

(ద్వితీయభాగము)

అనువాదకులు :

మొసలికంటి సంజీవరావు

పంతులు

అత్యద్భుతఘటనాసంయుతమును, విచిత్రకథావిలసితమును నగు గ్రంథరాజము. ప్రథమభాగమునందభివర్ణింపబడిన నిగూఢహత్యారహస్యము లిందు వెల్లడింపబడినవి. శైలిమృదుమధురము. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## అగ్రహారము

కర్త :

కేతవరపు వేంకటశాస్త్రి

మనోహరమైన స్వతంత్రసాంఘికనవల. అగ్రహారజీవిత మిందు దర్పణమందువలె గానవగును. వరశుల్కాదిదురాచారముల దుష్ఫలితములుచక్కగ చూపింపబడినవి. అపూర్వమగు కథాకల్పనము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0.

## ఛద్మవేషి

అనువాదకులు :
చిల్లరిగె శ్రీనివాసరావు

ఇదొక చక్కని పరిశోధకనవల. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

## విదురుని యుపదేశములు

కర్త :
కేతవరపు వేంకటశాస్త్రి

చిత్తస్వాతంత్ర్యము - సత్యవాక్యపరిపాలనము - నీతిబలము - ధర్మోపదేశము జ[illegible]దగినవి వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## కాంచనమాల

అనువాదకులు :
శ్రీ శివశంకరశాస్త్రి

అశోకుని కాలమునాటి బౌద్ధమతధర్మప్రచారముల దెలుపు నవల. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## సీమంతిని

కర్త : ములుకట్ల వేంకటశాస్త్రి

పౌరాణిక గాథ నీతిదాయకము. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## సుశీల

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి ఎం. ఏ, బి. ఎల్,

పతివ్రతయగు నీమె చరిత్రము హృదయవిదారకమయ్యును ప్రగాఢప్రణయాదర్శముజూపి యనేకుల పవిత్రుల జేయకమానదు చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## శశిరేఖ

కర్త
గుడిపాటి వెంకటాచలం బి. ఎ, ఎల్. టి.,

ప్రేమమూర్తియగు శశిరేఖ, ప్రియుని తరువాత ప్రియుని స్వీకరించుట యెట్లవసరమయ్యెనో, అయినను ఆమె నిర్మలచారిత్రి యెట్లయ్యెనో వ్రాయబడినది. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0.

## యమునాబాయి

అనువాదకులు :
క్రొపవరపు నరసింహము

తమతమ పరిస్థితులను పరిశీలింపని ప్రేమాంధులగు యువతీయువకులకీ గ్రంథ మత్యంత బోధప్రదము. వెల చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 0-12-0.

## శ్యామల

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం. ఏ., బి. ఎల్.,

శిథిలప్రణయుల దుఃఖగాథ. సాంఘికదురాచారమును ఖండించు ప్రేమైక నవల. చందాదారులకు రు 0-8-0 లు ఇతరులకు రు 1-0-0.

## కాలసర్పి

అనువాదకులు :
జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి యం. ఏ., బి. ఎల్.,

అత్యద్భుత రహస్యాపరాధ పరిశోధక నవలారాజము. చందాదారులకు రు 0-8-0 ఇతరులకు రు 1-0-0

| | |
|---|---|
| **న్న హస్తము**<br>(ప్రథమ భాగము)<br>అనువాదకులు :<br>జొన్నలగడ్డ సత్యనారాయణ<br>మూర్తి ఎం. ఎ., బి. ఎల్., | అద్భుతమైన పరిశోధక నవల. సుప్రసిద్ధమగు ఆంగ్లేయ నవల ననుసరించి వ్రాయబడినది. కథాకల్పన మపూర్వము. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |
| **న్న హస్తము**<br>(ద్వితీయ భాగము)<br>అనువాదకులు :<br>జొన్నలగడ్డ సత్యనారాయణ<br>మూర్తి ఎం. ఎ., బి. ఎల్., | ప్రథమభాగమునందలి అద్భుతఘటనముల చిక్కులిందు బాహిరమును జూచి, మహాఅద్భుతఫలితములను ప్రసవించినవి. భిన్నహస్త మెవ్వరిదో యీతుదిఘట్టమువరకు తెలియునవకాశము లేదు. పాఠకుల హృదయ ములకు వీడలేరు. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0 |
| **ంకణరహస్యము**<br>కర్త<br>నేలటూరు అనంతాచార్యులు | చక్కని నిరూపక నవలారాజము. ఇతివృత్తము మనోహరరహస్యఘటనాసంయుతము. ఒక భ్రాతృవేషధారి రహస్యము. ఒక భ్రాతృద్రోహియొక్క రహస్యాభిలాష కంకణరహస్యమున ప్రతిఫలించినవి. పాఠకులు ముగించువఱకు దీనిని విడువజాలరు. చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |
| **సంజీవి**<br>(ప్రథమ భాగము)<br>అనువాదకులు :<br>మొసలికంటి సంజీవరావు<br>పంతులు | ఈ మనోహరనవలారాజము ప్రసిద్ధాంగ్ల నవలాకారుడగు స్కాట్ గ్రంథమున కనువాదము. తొల్లింటి క్రైస్తవ మహమ్మదీయాన్వయములమధ్య జరిగిన యద్భుత మతసంగ్రామ మిందలి యితివృత్తము. సరసకథాగుంఫితమై, విజ్ఞానప్రదమై యొప్పు నీగ్రంథము నవలాపాఠకుల కత్యంతాకర్షణీయమైనది. వెల చందాదారులకు రు 1-0-0 ఇతరులకు రు 1-8-0. |

## అనుబంధ గ్రంథములు

| | |
|---|---|
| **మృత్యురంగిణి**<br>అనువాదకులు :<br>చిల్లరిగె శ్రీనివాసరావు | గొప్ప డిటెక్టివునవల ఒకానొక సుందరియొక్క భయంకరకథ నరహత్య - నారీహత్య - హత్యపై హత్యలు. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు రు 0-12-0. |
| **అభాగిని**<br>అనువాదకులు :<br>చిల్లరిగె శ్రీనివాసరావు | బాల వితంతువులు పడు కష్టములు, దుండగులు పన్ను కుట్రలు-సమాజరీతిని వర్ణింపబడిననవరసభరితమగు సాంఘిక నవల. వెల చందాదారులకు 0-8-0 ఇతరులకు 0-12-0 |